*Ramachandra Series.*

పరిశ్రామిక

# PARISRAMIKA HINDUDESAMU.

హిందూదేశము.

M. SITARAMA RAU, B. A., L. T.

Ramachendra Series.

# పరిశ్రామిక హిందూదేశము.

గ్లిన్ బార్లోగారి ఇండస్ట్రియల్ ఇండియా

అను గ్రంథమునకు భాషాంతరీకరణము

ముడియం సీతారామరావు, బి. ఏ., ఎల్. టి. చే

చేయబడినది.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరము.

బ్రౌన్ ఇండస్ట్రియల్ మిషన్ ముద్రాక్షరశాల.



[వెల రు. 0-8-

1914.

ఆ. జరయు మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు
ధనము విద్య గూర్ప దలపవలయు
ధర్మమాచరింపదగు మృత్యుచే దల
పట్టి ఈడ్వ బడినవాడు బోలె.

శా. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్న విహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు జుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్ — భర్తృహరి.

# పీఠిక.

జీ. ఏ. నటేశన్ అండు కంపెనీ (G. A. Natesan & Co.) వారి పుస్తకముల క్రయపట్టికను చూచినపుడు ఈ క్రింది యభిప్రాయములు కాన్పించినవి.

## *Select Press Opinions.*

"THE MADRAS MAIL"—Throughout the book there is a cheery note of optimism which ought to be encouraging to those who are exerting themselves to bring about improvements.

"THE INDIAN SPECTATOR."—Every young man in India ought to read Mr. Glyn Barlow's book.

"UNITED INDIA."—Mr. Barlow's book contains valuable hints as to the right ways and methods of Indian producers and sellers necessary to make their business a success.

"THE THEOSOPHICAL REVIEW."—An admirable little manual, according to the views of those who would like to see India do as Japan has done—boldly break with the unprofitable virtues of old times and shape herself consciously and with resolution for victory in the modern European "struggle for life."

"THE CHRISTIAN PATRIOT."—We have read this little book with much interest. It is full of eminently practical suggestions and the high standard of commercial and industrial morality which it pleads for makes it a very welcome addition to the literature on the subject.

భూగోళశాస్త్రమునందు కొంచెము భిరుచి కలవాడనై యుం డుటచేతను వాణిజ్యభూగోళమునందు కొద్దిగా పరిచయముండుట చేతను బార్లోగారి ఇండస్ట్రియల్ ఇండియాను (Barlow's Industrial India) ప్రతియువజనుడు చదువదగినదని అభిప్రాయ మివ్వబడియుండుటచేతను, గ్రంథకర్తగారు విద్యాశాఖయందే పనిచేయుచుండిన వారగుటచేతను గ్రంథమున నెట్టి నూతన విషయములున్నవో చూతమను ఆశ పుట్టి దీనిని సాంతముగ జదివితిని.

ఇందలి విషయములు క్రొత్తవికాకపోయినను జనులు వీని నెరుగుట మంచిదని నాకు తోచి ఆంధ్రభాషయందు ఇందలి ముఖ్యాభిప్రాయములు తెలుపవలయునను కుతూహలము చే త దీనిని భాషాంతరీకరింప బూనుకొని గ్లిన్ బార్లోగారికి జాబు వ్రాయగా భాషాంతరీకరణ విషయమున తమకేమియు నాతంకము లేదనియు గ్రంథప్రహక్కుల నన్నిటిని ప్రచురపరి చిన నటేశన్ కంపెనీవారికిచ్చితిమనియు దయతో వ్రాసిరి. అ నంతరము ప్రచురించినవారి అనుజ్ఞగొని నాకు తోచినమట్టుకు సులభశైలిని ముఖ్యాభిప్రాయముల 1912 వ జూన్ నెలలలో నే భాషాంతరీకరించితిని కాని ప్రచురించుట కింతకాలము పట్టి నది. కారణములటుండనిండు.

భాషాంతరీకరణమును చేయుటయందు మాతృకయం దలి చమత్కారాది రసములను పోనియ్యలేదని సాహ సించి చెప్పజాలను. శాస్త్రీయ విషయమగుటచేత పా రిభాషికపదములకు మంచి పదములు ప్రయోగించితినని కూడ చెప్పజాలను. నేను వాడిన పదములు మంచివి కాకపో

వచ్చును. నేను అల్లిన వాక్యములు మాతృకయొక్క మాధుర్యమును చూపకపోవచ్చును. ఇట్టివిషయములందు చదువరులు సరియైనపదములు సూచించి యుక్తి యుక్తముగనుండు సలహాల నిచ్చినయెడల రెండవకూర్పునందు లోపములను సవరింపజాలుదును.

ఇక మనదేశపుపరిశ్రామిక ఆర్థికస్థితులనుగురించి కొంచెమాలోచింతము. బ్రిటిషువారు మనదేశమును చేరకమునుపు మనదేశంబున రోడ్లుకాని ఇనుపదారులుకాని, యుండలేదు. ఉండిన కొన్నియును రాకపోకలకు **పనికివచ్చునంత** మంచిస్థితియందుండినవికావు. కాశికిపోయినవాడు కాటికిపోయినవాడు ఒకటియేననుసామెత ఆకాలమున పుట్టినదియే. మఱియు జనసంఖ్యకూడ ఆకాలమున తక్కువగానుండియే యుండును. ఇందుచేత ఎక్కడిపంట అక్కడనే ఉపయోగించుకొనుచుండిరి. ఒకవేళ పంటలు అధికముగా పండినయెడల ఆపదార్థములను కొనువారు లేకపోవుటచే ఎట్లైనను అమ్మివేయవలయునని మిక్కిలి చౌకధరలకమ్ముచుండిరి. పంటలు పండనిచోట క్షామబాధచేత జనులు వేలకొలది చనిపోవుట సామాన్యమైయుండెను. మొత్తముమీద ధాన్యము మొదలగు తినుబండారములు అప్పుడు మిక్కిలి చౌకగ నుండినవి.

తినుబండారముల విషయమిట్లుండగా పరిశ్రమలుకూడ మంచిదశయందుండినవి. తినుటకు కావలశిన పదార్థములు చౌకగ దొరుకుటచేతను, జనుల వాంఛలు తక్కువగ నుండుటచేతను, ప్రతిపంట యథేచ్ఛముగనుండుటచేతను, సాలెవారు వారి ఇండ్లయందే నేతపని చేయుచు ఆయాభాగములకు కావలశిన బట్ట

లను తయారుచేసి అమ్మకమునకు తెచ్చుచుండిరి. ఢక్కా కాశీ మొదలగు పట్టణములందు మిక్కిలినయమైన బట్టలు తయారయి విదేశములకుకూడ ఎగుమతి యగుచుండినవి. ఇట్లుండగా ఆంగ్లేయులు మన దేశమున చేరిరి. వారు ప్రకృతిశాస్త్రజ్ఞులగుటచేతను, ఉద్యమాశక్తులగుటచేతను మనదేశమున గిరాకియుండు పదార్థములను కనిపెట్టి యంత్రసాయమువలన వానిని తమదేశమునందే మిక్కిలిచౌకగా తయారుచేసి మనదేశమున అమ్మ మొదలుపెట్టిరి. ఈ సరుకులు మనదేశపువానికంటె చౌకగా నుండుటచేత వానిని జనులు కొనుటకారంభించిరి. కాలక్రమము మనదేశపుసరుకులకు గిరాకితక్కువయ్యెను. పనివారు చౌకధరలకు తమ సరుకులను అమ్మచుతుదకు కూలికూడ గిట్టకపోవుటచేత వారి వారి కులవృత్తులను వదలి క్రొత్తవృత్తిదొరకక కష్టపడుచుండిరి. నేతపరిశ్రమయందుమాత్రమే కాక చక్కెర తయారుచేయుట నూనె తీయుట, గాజు చేయుట, మొదలగు పరిశ్రమలందు కూడ ఈ మార్పులు కలిగినవి.

ఇట్లు చిరకాలము నుండి యుండిన స్వదేశపరిశ్రమలు అడుగంటుటచేత కర్మకరులు వేలకొలది పనిలేకపోయిరికదా వీరికొరకు కొన్ని క్రొత్తపరిశ్రమలు ఇపుడు బయలుదేరినవి. కర్మకరులు కావలసినంతమందియున్నారు. కాని వీరందరికిని పని దొరుకుట కష్టము. ఏమన వీరికి కౌశల్యము తక్కువ. తెలివి తేటలుగలవారికి గిరాకియున్నదికాని తాము పుట్టినస్థలము వదలిపోవుటకు ఇష్టములేక చాలమంది శ్రమపడుచున్నారు. కొందరు విదేశములకు పోవుచున్నారు. కాని ఏమె

సను మనదేశపు పరిశ్రమలను నిలువబెట్టిన యెడల కొంత మేలు కలుగునని కొందరు మహనీయులు శ్రమపడుచున్నారు.

పరిశ్రమలకు పేరొందిన ఇంగ్లాండు జర్మనీదేశములందు పరిశ్రామిక జీవనమంత మంచిదని చెప్పుకొనుటలేదు. ఏమనగా పట్టణములందు పరిశ్రమలు జరుగుచుండుటచేత కర్మకరులేమి, తనిఖీదారులేమి, పరిశ్రమలకు సంబంధించిన వారేమి మొదలుగాగల జనులెందరో సమావేశమగుచున్నారు. ఇందు ధనవంతులు కొందరుమాత్రమే దూరమున నివశించుచున్నారు. మిగత వారందరు పట్టణమునందే నివశించవలశియున్నది. కావున ఇండ్లకు గిరాకియెక్కువగుటచేత ఎక్కువ అద్దెలను (బాడుగను) ఇచ్చుకొనజాలక చిన్న చిన్న ఇండ్లయందు అనేకులు నివసించుట తటస్థించుచున్నది. తినుబండారములకు ధరలెక్కుట నిశ్చయము. అందుచేత వర్తకులు అప్పటమైనసరకులను అమ్మక వానిలో ఇతరపదార్థములను కలిపి లాభమువచ్చు త్రోవలను వెదకుచుందురు. ఇది ఇట్లుండ వాయువైనను పరిశుద్ధముగ నుండుటలేదు. ఫ్యాక్టరీల పొగచేతను, బండ్లవలని దుమ్ముచేతను, మురుగుకాలువలనుండి వెలువడు దుర్గంధవాయుకములచేతను నిండియుండు వాయువు దేహారోగ్యకరముగ నుండదుకదా. కావున పట్టణవాసులకు జబ్బులు మెండు. ధనసాహాయ్యములేని బీదవారలకు మరికొంచెమెక్కువకాన వీరురోగములచే బాధపడుచు పట్టణములను వదలజాలక శ్రమపడుచున్నారు. ధనవంతులు వ్యాపారముచేసి ఎక్కువ ధనికులగుచున్నారు. ధనములేనివారు జబ్బులచేతను ఎక్కువధరలచేతను ఎక్కువదరిద్రుల

గుచున్నారు. ఒకవైపున ధనమధికమగుటచేత సర్వవిధముల సుఖమనుభవించుచు క్రిందు మీదు తెలియక సుఖసముద్రమున నోలలాడుచుండు ధనవంతులును మరియొకవైపున శుష్కదరిద్రులై తిన తిండిలేక చేయునదేమియులేక పొట్టకొరకై అవినీతికార్యములకుకూడ లోనయి అటులనైనను జీవనము జరుపుకొనజాలక వానివలని బాధలను మాత్రమనుభవించు కర్మకరులున్నారు. వీనింజూచి పరిశ్రమలవలన నష్టమున్నదనియు పరిశ్రమలను వదలి పొలములను వెళ్ళి అచట పనిచేసి అంతధనవంతులుకాకపోయినను సుఖజీవనముచేయుట ఉత్తమమని పరిశ్రమలకు ప్రసిద్ధిచెందిన ఇంగ్లండు జర్మనీ దేశములందు చెప్పుకొనుచుండగా అట్టిబాధలులేని హిందూదేశమున పరిశ్రమలకొరకై నిరర్థకమైన శ్రమపడి లేనిపోని చిక్కులను తెచ్చిపెట్టుకొననేల? ఇది అటుండ పరిశ్రామిక కార్యములలో ఆరితేరిన పాశ్చాత్యుల యెదుట ఏమియునెరుగని మనదేశమువారా పోటీకి పనిచేయువారు? ఇట్టిపోటీవల్ల నేమైన లాభముకలదా? లాభము కలుగుటకు ఎన్ని సంవత్సరములు నష్టపడి పనిచేయగలరు? ఈ నష్టభారమును నిర్వహింపగలవారెవ్వరు? మూలధనమెద్ది? కౌశల్యముగల కర్మకరు లెక్కడ? వీరిని సమావేశముచేసి పరిశ్రమలను నడిపింపగల పరిశ్రామికానుభవముగల ధీరులేరి? ఇట్టిలోపములుండ పరిశ్రమలు పరిశ్రమలు అని కలువరించుట భ్రమకదా! కాబట్టి పరిశ్రమల మాటవిడిచి కర్షకులు పోగయి వ్యవసాయముచేసి పంటలను పండించి పరిశ్రామికదేశములకు కావలశిన పచ్చిపదార్థములను సప్లయిచేసి లాభమున్ను పొందకూడదా యని కొందరనుచున్నారు.

ఇందు కొంతసత్యమున్నదని చెప్పకతప్పదు. మనదేశమందు నూటికి 80 మంది వ్యవసాయము చేయువారనుట నిజము. పైగా మనదేశమునపండు పదార్థములు అంత శ్రేష్ఠమైనవికాకుండుటయు నిజమే. ఎట్లనగా మనదేశమున ఉత్పత్తియగు చెరుకునుండి రావలసినంతరసము వచ్చుటలేదు. మనదేశమున పండు ప్రత్తి నాజూకుబట్టలకు తగినదికాదు. మనదేశములోని పొగాకు అంతశ్రేష్ఠమైనదికాదు. కావున ఈ విషయములందు తగినకృషిచేసి పంటల నాణ్యమును బాగుచేసి ఒక శేరు ధాన్యము పండుచోట నాలుగు శేర్ల ధాన్యము పండునటుల చేయుట నిశ్చయముగా మంచిది. ఇందుచేత విదేశములకు కావలశిన పచ్చిపదార్థములు సప్లయిచేయుటయేగాక మనదేశపు వారుకకుకూడ తోడుపడి ప్రజలకు చౌకగ అమ్మగలుగుదుము. కాని ఈ పని సరియైనవిధమున చేసినయెడల ఇంతమంది కర్షకరులక్కరలేదు. యంత్రజ్ఞానము సంపాదించుకొని పోడిమిచేయు పద్ధతుల తెలిసికొని యంత్రములచేత పనులు చేయించగలిగినపుడు ఇందరు కర్షకరులెందుకు?

జనులవాంఛ హెచ్చువ యగుచున్నవి. ప్రజలు గ్రామములలో నిరంతరముండుట కియ్యకొనుట కిష్టపడకున్నారు. కొంచెము విద్య నేర్చుకొనిన వారియందు నూతనాభిప్రాయములు నూతనవాంఛలు జనించి గ్రామములందుండుట కిష్టపడక జనులెంవరో పురనగరములకు వెళ్ళుచున్నారు. ఇది మంచిదైనను కాకపోయినను గమనింపవలశిన విషయములలో నొకటి. ప్రజలకు గ్రామజీవనము మీాద ఆశ కల్గించుటెట్లు? గ్రామ పరిశ్రమలు ఇందుకు కొంత సాయము చేయునుకదా! యోచింపుడు.

ఇంకొక విషయము. మన దేశమున వర్షపాతమును నమ్ముకొనియుండుటకు వీలు లేదుకదా. ఒకసంవత్సరము కురిసినను మరుసటిసంవత్సరము కావలసినంత వర్షము కురియుననుట నమ్మకము లేదు. అట్టి కాలములందు వ్యవసాయమునే నమ్ముకొనియుండువారి గతియేమి? ఇందరుజనులు వ్యవసాయమునే నమ్ముకొనియుండుటచేత కరువుకాలములందు చనిపోవువారిసంఖ్య యెక్కువగుచున్నదని చెప్పుచున్నారుకదా. దీనికేమియోచన? పరిశ్రమలేకదా ఇందుకు తగినదారి చూపునవి.

ఇంకొక విషయము. ఏటేటను దేశమునపండు పిచ్చిపదార్థముల నెగుమతిచేయుచుండుటచేత భూమిసారము తగ్గుచుండునాయన్నికూడ ఆలోచన చేయవలయును. మనదేశము చమురువిత్తులను వేలకొలది టన్నులు ఎగుమతి చేయుచున్నది. ఇందుకుబదులు నూనె మనదేశమునకు వచ్చుచున్నది. కాని గానుగపిండియంతయు విదేశములోనె ఖర్చగుచున్నది. ఈ గానుగపిండి పశువులకెత్తినయాహారము భూములకు శ్రేష్ఠమైన యెరువు. ఇంతటి అత్యంతోపయోగకరమైన గానుగపిండి దేశము విడిచిపోవుట లాభమా? ఇటుగాక ఆ విత్తులను శాస్త్రప్రకారము మనదేశమునందే గానుగాడిన యెడల పిండి మిగులుటయు నూనె చౌకగుటయేగాక కర్మకరులకు పని కల్పించి సబ్బు పరిశ్రమకు కూడ ఆస్పదము కల్పించినవారమగుదుము. అవును. ఈ పరిశ్రమ జయప్రదముగా జరిగినకదా పైలాభములు వచ్చును. యంత్రజ్ఞానము ఎక్కువ యనుభవముకల పశ్చిమదేశీయులవలె మనమీపరిశ్రమను జయప్రదముగా జరుపగలమా? ఇంకొన్ని కావలసిన మూలధనమెక్కడ? యంత్రజ్ఞానమెక్కడ?

ఈ విషయమున దొరతనమువారి సాయమే ముఖ్యము. విదేశములనుండి నిపుణులను తెప్పించి వారిచేత పరిశ్రమలు నడిపించుచు కావలసిన మూలధనమును సాధ్యమైనంతవరకు సహకారసంఘముల స్థాపించి యుత్పత్తి చేయుచు లోబడినగాని దేశమభ్యున్నతికి రాదు. కాని దొరతనమువారికికూడ నొక చిక్కున్నది. ఏమన హైందవపరిశ్రామికాభివృద్ధి ఇంగ్లండులోని పరిశ్రామికులకు భయోత్పాత కారణము కాన వారిని మెప్పించి ఇండియాకు మేలుచేయుట మిక్కిలి కష్టమైనపనియే అయినను దొరతనమువారు కొంతసాయము చేయుచున్నారనుట నిశ్చయము. కాన ఇందుకుగోడు జనులు పాటుపడి సహకారసంఘములేర్పరచి అన్యాయమునకు దిగక తమకును, ఇతరులకును లాభము కలుగవలయునను పూనికతో పనిచేయుట మిక్కిలి ఆవశ్యకవిషయము.

ఇక గ్రంథవిషయమాలోచింతము. పైవిషయముల నన్నిటిని బాగుగ నెఱిగియున్న బాగ్లోగారు ప్రప్రథమమున దేశాభిమానమునుగూర్చి ముచ్చటించుచు తన్నుమాలిన ధర్మములనుగురించి చెప్పక తనకును తనదేశమునకును లాభమిచ్చు దేశాభిమానముగూర్చి సవిస్తరముగా చెప్పి, ఒక్కడుగా నేపనినైనను చేయజాలడను విషయము నొక్కి చెప్పుచు సహకారసంఘీభావములవల్లనే పారిశ్రామిక కార్యములు కొనసాగగలవనియు ఈ విషయమున మనయందుండు లోపము లివియనియు మొదటి రెండు ప్రకరణములలో చెప్పియున్నారు. మూడవప్రకరణమున స్వదేశమతములగూర్చి చెప్పుచు అందేమియు దోషము లేదనియు ఇందున దొరతనమువారు లోబడుచున్నా

రనియు, ఇది జయప్రదముగ జరుగవలశినయెడల కొనువారియందేకాక అమ్మువారియందును ఉత్పత్తి చేయువారియందును కూడ స్వదేశప్రేమ యుండినచే గాని కేవలము చిత్తవృత్తిగా (Sentiment) నుండు స్వదేశమతము మేలు చేయుటకు బదులు కీడు చేయునని నొక్కి చెప్పియున్నారు. పరిశ్రమలయందు జనులకుఉత్సాహము కలిగించుటకు ప్రదర్శనములు వస్తుపాఠములు కాన నాల్గవప్రకరణమునందు పరిశ్రామిక ప్రదర్శనములు వానినడుపు పద్ధతులను వాని ఉపయోగములను సూచింపుచు 5, 6 ప్రకరణములందు మనలో సహజముగనుండు లోపములను కొన్నిటిని చూపియున్నారు. ఏడవ ప్రకరణమున హైందవకళా కౌశల్యమునుగూర్చి చెప్పి తయారైన సరుకుల నమ్ముటకు తగినషాపులుండవలయుననియు హైందవసరుకులను కొనుటకు గ్రాహకులు వలశినంతమందియున్నారనియు చెప్పుచు పరిశ్రామికవిషయములందుజయముపొంద వలయునన్న కొంత యోపికయు మూలధనముండవలయునని సూచించి జయమునకు సత్యము, న్యాయప్రవర్తనము, సహకారభావము, పరిశ్రామికజ్ఞానము ముఖ్యావశ్యకములనియు దొంగవేషములు పనికిరావనియు నొక్కి చెప్పుచు గ్రంథకర్తగారు గ్రంథమును పూర్తి చేశియున్నారు.

నా వ్రాతప్రతులను ముద్రాశాలకు పంపుటకుముందు నా మిత్రులగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారివద్ద చదివి వారి సలహాలనుగొని వానిని పుస్తకమునందిమిడ్చితిని. వారిశ్రమకోర్చి తప్పులు దిద్దినందులకును, సలహాల నిచ్చినందులకును అనేక వందనము లర్పించుచున్నాడను.

---

# పరిశ్రామిక హిందూదేశము

## 1 వ ప్రకరణము.

### వాణిజ్యమునందలి దేశాభిమానము.

పూర్వము మొగలాయి చక్రవర్తులు ఉండిరనియు, హిందూ రాజులుండిరనియు వారు గొప్ప గొప్ప రాజ్యముల నేలుచుండిరనియు చెప్పుట వినియున్నాము. చరిత్రములందు చదివియున్నాము. కాని ఆ చక్రవర్తులెట్టివారో ఆరాజ్యము లెట్లుండినవో మనకంతగా తెలియదు. మన ఆంగ్ల హైందవ రాజ్యమట్టిదికాదు. ఇది నిశ్చయముగాను నిలుకడగాను పాదుకొనియుండుట ప్రత్యక్షవిషయము. పూర్వపురాజ్యము లెట్లుండినవోకాని ఇప్పటి బ్రిటిషు హైందవ రాజ్యము అనన్య సామాన్యముగనున్నది. ఇది మిక్కిలి గొప్పదగుటచేతను, అత్యద్భుతముగ నుండునదగుటచేతను ఇది యిట్టిదని వర్ణించి క్రొత్తవారికి చెప్పుట కష్టము. క్రొత్తవారిమాట యటుండగా మన హైందవరాజ్యములో నివశించుచుండు సామాన్యజనునికైనను మన దేశమిట్టిదనియు, విరివియందింత పెద్దదనియు తెలియుట లేదు. ఏ భాగమున నివశించువారు ఆభాగమునే ఇండియాయని భావించుచున్నారు. దక్షిణదేశపు మైదానములనుండు రయితు, ఇండియాదేశమనిన ఎడతెగని వేసవికాలము గలిగినదనియు అందుచేత నచటివారలకు బట్టలు అవశ్యకములు కాక కేవలము మానసంరక్షణమునకు మాత్రమే కావలసినవనియు,

ఇంధనము కట్టెపుల్లలు మొదలగునవి (fuel) వంటకుమాత్ర మే యావశ్యకమనియు తలచును. హిమాలయపర్వత ప్రదేశములనుండు పహారీ వానికి ఇండియాయనిన మరియొకటి తోచును. ఇతడుండు ప్రదేశమున చలి అధికమగుటచేత నీరు పేరుకొనిపోయి యుండును. కాబట్టి తాను తిండికుపయోగించు రొట్టె (atta) తనకెంత యావశ్యకమో తాను కప్పుకొను కంబడియు, తాను వేయుచలిమంటయు, అంత యావశ్యకములే యనియనుకొనును. నిరంతరము వర్షముగలిగి తేమగా నుండు అస్సాము లోని కాసీకొండల (Khasi Hills) సమీపమున నుండు కూలివాండ్రు ఇండియాయనిన విస్తారము వర్షముకురియు దేశమనియు, దానివాపుటకు తగినంత దళసరిగల కప్పు ప్రతియింటికిని ఉండవలయుననియు, అనుకొందురు. పడమటిభాగపు ఎడారులందునివశించు రసపుత్రుడు ఇండియాయనిన వర్షములేని దేశమనియు అచటనుండు ఇండ్లు అత్యుష్ణపవనముల నుండియు, రేగుచుండు తుపానులనుండియు, జనులను కాపాడుటకేయనియు, అనుకొనును. ఇట్లు ఇండియాదేశమనిన ఒకనికి ఉప్పు పండు దేశమనియు మరియొకనికి నేలబొగ్గు దేశమనియు, ఇంకొకనికి ప్రత్తి పండు భూమియనియు, నాల్గవవానికి ఉన్ని నిచ్చు గొఱ్ఱెలు గల దేశమనియు తోచుచుండును. కాని ఇండియాయనిన వివిధ శీతోష్ణస్థితులు కలిగి రకరకపుపంటల నిచ్చుచు, పలుతెగల జనులకాటపట్టయిన దేశరాజమని సామాన్యజనులకు తెలియదుకదా!

స్వాభావసృష్టియందు మనదేశమునందు ఎన్ని భేదములు కనబడుచున్నవో రాజకీయవిషయమునందుకూడ అన్ని భేదము

లు కనబడుచున్నవి. ఈ దేశమందుండు మూడుకోట్ల జనులు జాతి మతాచార భేదములు కలిగి బీరకాయపీచువలె శాఖోప శాఖలుగానున్నారు. వీరిలో చాలమంది సరిగా ఆంగ్లప్రభుత్వ మునకు లోనై యున్నవారు. మిగిలినవారు ఆంగ్లదొరతనము వారికి సామంతులయిన కిరీటాధిపతులగు రాజకోటికి లోనై యున్నారు. మహారాజులు, గాయక్‌వారులు, నైజాములు, నవాబులు, రాజులు, రాజకుమారులు ఎందరో ఉన్నారు!

ఇవన్నియు మన దేశమున నున్నవని చెప్పుకొనుటవలన నేమైన ప్రయోజనమున్నదా? దేశమెంతవిస్తారమైన నేమి? జనులెన్నికోట్లుండిననేమి? కిరీటాధిపతుల వైభవమెంతయైన నేమి? వీరందరుకలిసి దేశక్షేమమునకై పాటుపడినకదా దేశమునకు విముక్తి కలుగును! ఎవరికైనను విముక్తి రావలయుననిన ఇతరులవలన ఎన్నటికిని రాజాలదు. ఇది తనయొక్క కార్యములచేతను తనలోనుండి బయలుదేరు సదుద్దేశములచేతను రావలయును. ఇట్లేమన దేశమునకు కూడ మేలు కలుగవలయునెడల ఇందుండు జనులనుండియు, రాజాధిరాజులనుండియు, దీనిపాలించువారినుండియు,విముక్తి రావలయునే కాని యేయొకరిప్రయత్నములచేతగాని దేశమునకు మేలు రాజాలదు.

ఇకమనదేశమెట్టిదో యోచింతము. ఇది అనన్యసంపద గల దేశమనుట నిర్వివాదాంశము. మనకు కావలసిన పదార్థములన్నియు ఇందు దొరకుట సత్యము.

ప్రతివిధమైన శీతోష్ణస్థితియు ప్రతివిధమైననేలయు ఈ గొప్ప దేశమందున్నది. ఇందుత్పత్తియగు పదార్థముల అమ్మకమునకు గాను మరియొక దేశమునకు వెళ్ళపనిలేదు. మరియొక దేశము

నుండి అచటిసరుకులతో నొకవర్తకుని రారమ్మని పిలువవలశిన యక్కరయు లేదు. దేవుడిచ్చిన స్వభావసంపద చేతను చౌకబత్తెములకు పనిచేయు పనివాండ్రచేతను విదేశపుపోటీని లక్ష్యముచేయక మనదేశము తనజనుల జీవనావశ్యకములనే గాక భోగపదార్థము లన్నిటినికూడ తనయందే ఉత్పత్తి చేయగలదు.

ఇదంతయు కలలోనివార్తగా తలపకూడదు. కాని ఇందుకై రాజులు యువరాజులు ప్రజలు మొదలుగాగల వారందరు పని చేయవలయును. లేనియెడల వణిగ్విషయమున మనదేశముయొక్క సామ్రాజ్యము పడిపోవును. పూర్వము రోమకసామ్రాజ్యము క్షీణించుటకు కారణమేమి? గాత్తులయొక్కయు హూణులయొక్కయు దండయాత్రలే కదా? ఇపుడు మనదేశముయొక్క వణిగ్ సామ్రాజ్యము పోగొట్టుటకు విదేశవస్తురూపమున గాత్తులు (Goths) హూణులు (Huns) గుంపులు గుంపులుగా వచ్చుచున్నారు. ఇపుడైనను మనము మేల్కొని దండువెడలిన విదేశవస్తువులను పారదోలి మనదేశమున నుత్పత్తియగు స్వదేశవస్తువుల ప్రభుత్వమును బలపరుచుకొనుట ఎంతయు శ్రేయస్కరమగును.

ఇండియాయొక్క వాణిజ్యపరిశ్రమలను వృద్ధిచేయుట దేశాభిమానముగల ప్రతి హైందవునకును కర్తవ్యము. వర్తకము చేసికాని మ్యానుఫాక్చరుచేసికాని లాభము సంపాదించుట యందుకూడ దేశాభిమానము చూపవచ్చు ననుసంగతి ప్రతివర్తకుడును ప్రతిమ్యానుఫాక్చరుదారుడు (manufacturer) ఎరిగి యుండెనేని ఆతనికిది గొప్ప యుత్సాహకారణమగును. మనకిది కొంతవింతగా కనపడవచ్చును. మనదేశమున ధనార్జనచేయువారి

యందు దేశాభిమానము సాధారణముగ కనబడుటలేదు. ఎట్లన తగవులేనిచోట తగవుపెట్టి అమాయకుడగు తన దేశీయుని మెడకు ద్రవ్యనష్టమును కలుగజేయు నొకచట్టపుటభియోగము (lawsuit) కట్టిపెట్టితినని ఆంతరంగిక సంతోషముతో విఱ్ఱవీగు న్యాయవాది ధనమార్జించుటయందు దేశాభిమానమును మిళితముచేయుట లేదు. సాధారణముగా తనవల్లను తనసహచరులవల్లను కలిగిన కరువునకు మనస్సులో సంతసించుచు ఆకలిచేత బాధపడు కూలివారలకు, నూటికి నూరులాభమువచ్చునటుల, అమ్మినప్పుడు కూడ తప్పుతూనిక తూచుధాన్యవర్తకుడు ధనార్జనతో దేశాభిమానమును మిళితముచేయుటలేదు. నిరుపేదయగు రయితునకు సంతకముచేయుమని అడమానపుపత్రము (తనఖాపత్రము) నిచ్చి, తానుకట్టిన యెక్కువ వడ్డీచేతను, పత్రములోని కుయుక్తులచేతను ఆరైతుయొక్క వరిపొలము త్వరలో తనదగునని సంతసించు షాహుకారుడు ధనార్జనమునందు దేశాభిమానము చూపుటలేదు. ఇట్టిధనార్జనయందు చట్టవిరుద్ధమేదియు లేకుండవచ్చును. కాని ఇది బొత్తుగా అసహ్యాకరము. ఇందు దేశాభిమానము కొంచమైనను లేదు. ఇటుగాక తనలాభము కొరకును దేశక్షేమము కొరకును ఒక పరిశ్రమ నొకడు స్థాపించినాడనికాని స్థాపించుటకు తగిన ప్రయత్నముచేసి సాయపడినాడనికాని అనుకొందము. ఇందు చేత ఆప్రదేశమున లోటుగానుండు సరకు సరఫరాచేసి, పనిలేని పనివాండ్రకు పనికల్పించి వారలకు భత్యము లెక్కువచేసి దేశగౌరవమును స్థాపించినవాడగును. ఇట్టివారికిని పైవారలకును సామ్యమేమయిన కలదా? ఇతడు రాజునకంటె నెక్కువ

ధనవంతుడు కావచ్చును. తాను దేశమునకై పాటుపడుచున్నా డని సుగర్వముతో తన వ్యాపారము నడుపుచు సంతోషపడ వచ్చును.

కావున చట్టపు టభియోగములు, కరువులు, దివాలా దారులు మొదలగువానిని ఉత్పత్తి చేయుట యొకటి; ఉపయో గకరమైన పదార్థములను తయారుచేయుట మరియొకటి. ఇట్లను టచేత న్యాయవాది, ధాన్యపువర్తకుడు, సాహుకారు, దేశమునకు మేలుచేయలేరని అభిప్రాయపడకూడదు. వారు వారి వారి నిర్ణీతకార్యములందు దేశాభిమానము చూపవచ్చును. వకీలుయొక్క వృత్తి మిక్కిలి యుత్కృష్టమైనది. (ennobling) దేశాభిమానమైనది. వాది అనుభవించిన నష్టమును చక్కదీ యుటయు ప్రతివాదియొక్క చర్యసరియైనదని స్థాపించుటయు వకీలునకు ధర్మములు. కాని ఇంతకంటెను యెక్కువైన ధర్మము దేశసేవ. అతని స్థితినిబట్టియు అతని ధనమునుబట్టియు వకీలు జనులకు మార్గదర్శియనుట అందరొప్పుకొనవలసిన విషయము. కావున కోర్టువెలుపల నుండునపుడు పరిశ్రామిక కార్యములందు శ్రద్ధవహించి తనకును తన దేశమునకును ఇతడు సహకారిగా నుండవచ్చును. ధాన్యపువర్తకుడు హిందూదేశముయొక్క యార్థికవిషయమున (economics) ముఖ్యమైనవాడు. అతడు కేవలము స్వార్థపరత్వపుటాసలు వదలి, అన్యాయమునకు దూరుడై, దేశముయొక్క నైజసంపదను వర్తకమును అభివృద్ధిచేయుటయందు సాయపడెనేని, అతడు సంపాదించుకొనుచుండినను దేశాభిమానియగును. సాహుకారిన్నో ఇతడేకదా కష్టకాలమునందు సహాయము చేయువాడు? ఇతడేక

దా ఉద్యమాయత్త చిత్తుల ప్రయత్నముల కొనసాగించుట యందు తోడుపడువాడు! ఇతడు దుష్ప్రవర్తనకు లోనుగాక న్యాయమునకు లాభమునకు పనిచేయుచు, తెలివిలేమిచే కలుగు నపవ్యయములకు తోడుపడక యుండెనేని ఈతని వృత్తి కూడ దేశక్షేమమున కేయగును. ఇందుకుతోడుగా తనకుమిగులు లాభములో కొంతపాలు పరిశ్రమి కోద్యమములందితడు పని యోగించెనేని సాహుకారుడుకూడ దేశాభిమానియే యగును.

పరిశ్రమిక వ్యవస్థలందు (Industrial scheme) దొంగ దేశాభిమాన మెంతమాత్రము కూడదు. దేశాభిమానము వ్యవహారము చేయువాని హృదయమున నుండవలయును కాని పైమాటల యందును నటనయందును ఉండుటవల్ల నేమియు లాభముండదు. ఒక పరిశ్రమ దాని గుణాగుణములను బట్టి వృద్ధిక్షయములు పొందును కాని మన దేశమున చేయబడ్డవన్న కారణముచేత పాడువస్తువులను కొనమని ప్రజలను దైన్యముతో ప్రార్థింపకూడదు. ఇట్టి దైన్యపు ప్రార్థనలు మనమెరుగనివి కావు. కాని ఈ సరుకులు ఇండియా దేశమున చేయబడ్డవని చాటి చెప్పుటయందేమియు హానిలేదు. జాతీయ వణిగ్యుద్ధమునందు (National trade warfare) బహిరంగముగా మన జండాను విప్పియుంచుటయే మంచిది. రహస్యము ఎంతమాత్రము ఆవశ్యకము కాదు. దేశాభిమానియగు పరిశ్రమికుడు డబ్బులాగు దొంగ వేషములు దీక్షతో మానివేసి తనపరిశ్రమను ఋజుమార్గమున మిక్కిలి ప్రేమతో పెంచవలయును. ఇందువలన తనకును తన దేశమునకును లాభము తప్పక కలుగగలదు.

పరిశ్రామిక దేశాభిమాని తానుత్పత్తి చేసిన సరకుల నాణ్య ము మంచిదిగా నుండునటుల చూడవలయును. అట్లుగాక 'ఇండియాలో తయారయిన' వని చెప్పబడు పదార్థములు కొనువారికి తృప్తికరము కానియెడల ఆపరిశ్రామికుడు దేశాభివృద్ధికి శత్రుడగుచున్నాడు కాని మిత్రుడెన్నటికిని కాడు. ఇండియాలో చేయబడిన అగ్గిపుల్లలు మండవనికాని అక్కడిలక్క కరుగదనికాని, తయారైనకత్తులు తెగవనికాని, తాళములు సులభముగా నూడివచ్చుననికాని, చిమ్నీలు పెళుసైనవనికాని, అనుభవమువల్ల ప్రజలు అభిప్రాయపడిరేని, కేవలము సరుకులు చేసినవారి లాభముకొరకు, కొనువారంత ఓపికతో దేశాభిమానమును వహించి పనికిరాని సరకులను కొనుచుందురని తలంప వీలులేదు. మ్యానుఫాక్చరు దారుడు తానుండుట వారి మేలుకే యని యెరుంగవలయునే కాని తన వ్యాపారమువల్ల తా నెంతలాభముపొందినను తనకొరకు కొనువారున్నారని ఎన్నటికిని అనుకొనకూడదు.

మనదేశమందు నాణ్యమైన సరకులు తయారుచేయవచ్చుననుటకు కావలసిన నిదర్శనములున్నవి. ఈసరకుల నాణెమునుబట్టియే మన దేశపుయొక్క భవిష్య దౌన్నత్యముండుననుట నిశ్చయము. అర్థిక శాస్త్రిసమ్మతముగను విదేశపుపోటీని సరకుచేయని తక్కువధరలకును మంచినాణెమైన పదార్థములు తయారుచేసి నేడో రేపో తనకు తప్పకవచ్చు ఆదాయమునకై తొందరపడక కొంచమోపికతో వేచియుండెనేని అట్టిమ్యానుఫాక్చరుదారుడు తనయొక్కయు తనదేశముయొక్కయు జయమునకు పనిచేసినవాడగును. అటుగాక త్వరలో లాభము

పొందవలయునను కక్కుర్తికి లోబడి ముతకవియు తక్కువి యు నగు సరుకులను అమ్మకమునకు తెచ్చెనేని మానుఫాక్చరు దారుడు సహకారియగుటకు బదులు మన దేశాభివృద్ధికొక గుదికఱ్ఱయగును. వాఁడైనను బాగుపడఁడు. కాబట్టి తన దేశము నకును తనకును జయము కలుగవలయునేని మంచి నాణెమైన సరుకులను తయారుచేయించుటయే ప్రతిదేశాభిమాన పరిశ్రా మికునకును కర్తవ్యము.

దేశాభిమానము ఉండవలసినది ఒక ఉత్పత్తిదారునకే కా దు. కొనువారలకుకూడ నుండవలసినదే. దురదృష్ట వశమున మనదేశమునం దొకమాదిరి కొనువారున్నారు. వీరు వస్తువులు మంచివా చెడ్డవా అను విచక్షణయైనను చేయక స్వదేశవస్తువు లందు నిష్కారణమైన ద్వేషమును వహించి, విదేశవస్తువులన్న వాటికై పడిచత్తురు. తన ప్రేమకు పాత్రిగాలగు దేశమాతయొ క్క హక్కులను కొంచెమైనను లక్ష్యపెట్టక బజారు పేరెత్తి నంతనే తమ యసూయను చూపి, విదేశవస్తువులందు గొప్ప షాపులకు వెళ్లుచు వానిసికొనుటయందు దుర్గర్వమును చూపు చున్నారు. ఇట్లు చేయుట ఎందుకు? నవనాగరికుఁడనియు, రసి కాగ్రేసరుఁడనియు పేరువచ్చునను ఆసయే ఇందుకు కారణము. ఇట్లనుటచేత స్వదేశవస్తువులనే కొనుమని చెప్పుటలేదు. స్వదేశ వస్తువులు విదేశవస్తువులకంటె నాణ్యము కానప్పుడును వానికం టె చౌకగా నుండనప్పుడును స్వదేశవస్తువునే కొనవలయున ని దేశాభిమానమెవరిని ప్రోత్సాహము చేయనక్కరలేదు. చేయకూడదు. ఇట్టి అశాస్త్రీయపు (non-economic) కొనుగో లువల్ల వర్తకము తప్పక క్షీణదశకు వచ్చును కాని స్వదేశవస్తు

వులు విదేశవస్తువులతో సరితూగగలిగియుండిన యెడల స్వదేశ వస్తువులనేల కొనకూడదు? ఇట్లు చేయుటయందు స్వార్థత్యాగము చేయక తనకును తన దేశమునకును న్యాయముమాత్రము చేసినవాడగును.

కావున ఉత్పత్తి చేయువాడును కొనువాడును ఏకమైతమకొరకును దేశముకొరకును ఒకటిగా కలిసి పనిచేశిరేని మన దేశపు వాణిజ్యము ఉన్నతపదవినంది ప్రపంచములోని పరిశ్రామిక దేశములలో నిదియును ఒకటియగును. వాణిజ్యమందలి దేశాభిమానమొక గొప్పవిషయము. దీనినిగురించి విశేషముగ వ్రాయవచ్చునుకాని ప్రతిమనుజుడును అతని వృత్తి యేదియైనను అతనివ్యాపార మేదియైనను, తనకులభించు దేశాభిమాన సమయములను సద్వినియోగ పరచుచుండవలయును. పోగొట్టుకొనకూడదు. ఏమానవుడు ప్రతిదినాంతమున "నా యనంతరమున పెండ్లాము బిడ్డలకును, నా ముసలితనమునను, ఇక్కట్టు కాలములోను, నాకు సాయపడుటకు తగునట్లు నేడు కష్టపడితిని. అయినను దేశమాతను మరువక ఆమెఅభివృద్ధికి కూడ కొంతపాటుపడితిని" అని రొమ్ముమీద చేయివేశికొని యెవడనుకొనగలడో అట్టివాడే యుత్తముడు. అతడే ధన్యుడు.

## రెండవ ప్రకరణము.

## సహకారము.

మనదేశమున వ్యాపారము బాగుగా వృద్ధికావలయునేని వ్యాపారమునకు ముఖ్యావశ్యకమగు జాయింట్ స్టాక్ కంపెనీ పద్ధతివాడుకలోకి రావలయును. ఎందుకనగ ఏకార్యమునైనను

సాధించుటకు మూలధనము కావలశియుండును. అందును ఒక ఘనకార్యము తలపెట్టబడిన యెడల దాని నిర్వహించుటకు తగిన మూలధనము పెట్టుట యే యొక సాహుకారికైనను సాధ్యపడదు. ఒక ఫర్మైనను(firm)తన మీద వేసికొని కార్యమును నిర్వహింపజాలదు. కావున నిట్టివిషయములందు మనము పోగై జాయంటు స్టాక్ కంపెనీ నొకదాని నేర్పాటు చేసి అందు పెట్టుబడి పెట్టుటకు నేర్చుకొనవలయును. ఇందుకొక యుదాహరణమును గమనింతము. రైలుగాని రోడ్లుగాని లేని ప్రదేశము లిప్పటికిని మనదేశమున నున్నవి. అక్కడిగ్రామములందు పరిశ్రమలను జయప్రదముగా జరుపుటకు తగినసామాగ్రియుండవచ్చును. కాని యాసామాగ్రిని పోగుచేయుటకును, దానిని తయారుచేయు సాధనములు కూర్చుటకును ధనము కావలశియుండును. ఈ ధనము నొకడుగా నిచ్చుట కెవ్వడైనను సాహసించునా? సాహసించినచో కావలశినంత ద్రవ్యమాతని యొద్దయుండుట తటస్థింపదు కదా! ఇట్టి స్థితిలో చేయవలసిన దేమి? చందాలువేసి మూలధనము పోగుచేసి కార్యనిర్వాహక సంఘము నొకదాని నేర్పరచి దానిచేత నొక మేనేజరును నియమింపచేసి పరిశ్రమాభివృద్ధి యెట్లెట్లు జరుగునో చూచుచు లాభముయెంతవచ్చునో గమనించుచు ఉండుట గ్రామవాసులు నేర్చుకొనవలశిన యంశము.

ఒక గ్రామవాసులననేల? పట్టణవాసులుకూడ దీని నేర్చుకొనవలసిన వారలె. పట్టణములలోని విద్యావంతులు నయితము జాయంటుస్టాక్ కంపెనీల యందు (Joint Stock Companies) పెట్టుబడి పెట్టుటకు వెనుదీయుచునే యున్నారు. వ్యా

పారలక్షణములు (Commercial instincts) పట్టుబడిన బొంబా యి కలకత్తానగరములలోను వానిచుట్టుపట్లను తప్ప మిగతప ట్టణములందు హైందవుల ప్రోత్సాహముచే నేర్పడినవిగాని, హైందవ భాగస్థులెక్కువగా నుండునవిగాని, జాయంటు స్టాక్ కంపెనీలు మిక్కిలి అరుదుగా నున్నవి. ఇట్టి వెనుబాటు (backwardness) మన యందుండునంత కాలము హైందవపరి శ్రామికోద్యమములు స్వంత ఫరములయందును (firms) లేదా యొకని చేతులలోను ఉండక తప్పదు. ఇట్లుండునంత కాలము పెద్ద పెద్ద పరిశ్రామిక వ్యవస్థలు (schemes) అభివృద్ధిచెందజా లవు. ఇంతకాలము ప్రజలకు పరిశ్రామికానుభవము కాని పరి శ్రామికజ్ఞానము గాని యబ్బదు. జాయింటుస్టాకు కంపెనీలు మనలో నుండకుండుటకు కారణములున్నవి. కొన్నిటిని విట వివ రింతము.

(1) మనదేశమున ప్రత్యక్ష ధనమునందు(tangible wealth) ఆస అధికముగా నుండుట మొదటి కారణము. ప్రత్యక్షధన మనగా స్వంతదారునకు రొక్కముగానొ ఇల్లుగానో, భూమి గానొ, అగుపడుచుండు ఆస్తి. ఈ యాస అనాదినుండి వచ్చి నది కాని ఇటీవల వచ్చినదికాదు. ఆకాలమున పరిశ్రామిక సంయోగమనిన జనులకు తెలియనే తెలియదు. దేశమునందు బందిపోటుగాండ్లు, థగ్గులు, పిండారీలు మొదలగు దొంగలు వి చ్చలవిడిగా తిరుగుచుండిరి. వీరికితోడు స్థానాధికారులుకూడ తమ దుర్గమునుండి కొల్లకొట్టుటకు అప్పుడప్పుడు వెడలుచుం డిరి. చట్టముల భయములేని యాకాలమునందు జనులు థగ్గుల కుగాని బందిపోటుగాండ్లకుగాని అలవికాని భూరూపమున ధన

మునుంచుకొనుటయందేమి వింతయున్నది? రొక్కముగాని సొమ్ములుగాని యుండినప్పుడు రొక్కము నొక గుంతలోగాని గోడలోగాని పాతిపెట్టి, సొమ్ములను ఇంటనుండు భార్యవంటికి తగిలించుట స్వాభావికమే కదా? పరిశ్రామిక సంయోగము (Industrial combination) అంకురింపని ఈ కాలమునందు కూడ పూర్వపుసంతతివారమగు మనము అవశ్యం పితురాచారమనునట్లు మనచేతిలోనుండు డబ్బును భూములరూపమునగాని మరియొకవిధమైన ప్రత్యక్షరూపమునగాని దాచిపెట్టుచునే యున్నాము. పూర్వకాలమునందు రాకపోకలకు అనుకూలములుండలేదు. ఉండినకొన్ని రోడ్లుకూడ యాత్రీకులకును మూటలవర్తకులకును బందిపోట్లకును యెక్కువపనికి వచ్చుచుండినవి. ఇందుచేతజనులకు పరస్పరసంబంధమంతగా నుండలేదు. కాబట్టి ప్రతివాడును చెట్టునీడనే నివసించి తన భూములనే దున్ని యూర్జితము చేసికొనుచుమిగత ప్రపంచముతో నెట్టిజోక్యముకలుగ జేసికొనక ఆ ప్రపంచమును దానికే వదలిపెట్టియుండెను. పూర్వమిది బాగుగానేయుండెను కాని ఇప్పుడది సరికాదు. కాలములు మారిపోయినవి. రాకపోకలకు సదుపాయము లేర్పడినవి. చోరుల భయము వదలినది. పరిశ్రామిక సంయోగకాలమాసన్నమయినది. ఈ మార్పుల నందరు గమనింపవలయును. ముఖ్యముగా విద్యావంతులీ అదును పోగొట్టుకొనక కేవలము ప్రత్యక్షరూపమునందు ధనమునే అపేక్షింపకూడదు. భూమి యిప్పుడైనను మంచిఆస్తియే కాని పూర్వకాలమందుండినట్లు అంత మంచిఆస్తి కాదు. ఎందుకనగా (1) తర తరములనుండి

ఫలించుచున్న భూమియందు సత్తువ తగ్గిపోయినది. ఆసత్తువ మరలభూమిలో పడునట్లుచేసి సేద్యము చేయు కృషీవలులంత గా లేరు. వీరికి ప్రకృతిశాస్త్రజ్ఞానము లేకపోవుటయు మూల ధనముండక పోవుటయు గొప్పలోపములు. మూలధనము లేని కారణముచేత రయితులెప్పుడును ఋణములపాలయి శ్రమపడు చుందురు. ఇట్టివారికి తక్కువవడ్డీకి అప్పిచ్చు వ్యవసాయపు బ్యాంకులు లేవు. ఇవిచాలక వర్షము కురియకపోవుటకూడ ప దే పదే తటస్థించుచుండును. కాబట్టి ఇన్ని అనానుకూలములు గల వ్యవసాయమునే నమ్ముకొనియుండుట మంచిదికాదు. మ నమందరము కడపటికి భూమియం దుత్పత్తియగు పదార్థముల నే నమ్ముకొనియుండు వారమయినను కేవలము భూమినేఆస్తి గా చేసికొనుట మంచిదికాదు. మనకును మన దేశమునకును లాభదాయకమగు పరిశ్రమల యందుకూడ పని చేయుచుండ వలయును.

(2) సహకారభావము మనయందు లేకుండుటకు మఱియొక కారణమున్నది. ఇదేదన వడ్డీకి అప్పులిచ్చువ్యాపారము ప్రత్యేకముగా సాహుకార్లే చేయకుండుట. భూస్వాములు గుమాస్తాలు,షావుదారు లు,వర్తకులు, ఉపాధ్యాయులు, మొదలగువారలలో ప్రతివారు ను ఇంటనుండునపుడు అప్పిచ్చువారుగానుండుట అరుదుకాదు. ఈ పని కొంచెమెచ్చుతక్కువ ఆంతర్యమున పత్రములమీదు గా జరుగుచున్నది. గౌరవనీయమగు వృత్తులనిపించుకొన్నట్టి వృత్తులుగలవారు కూడ ఇంటనుండునపుడు తాకట్టువర్తకము చేయుట అరుదుకాదు. 11 గంటలకు న్యాయస్థానమునందు న వాగ్ధాటిని చూపుటకై నిలుచునట్టి వకీలు అరగంటకుముం

దు ఒక స్త్రీయొక్క పాదసరమును తూచి దానితాకట్టుమీద నెలకు నాలుగణాల వడ్డీప్రకారము 10 రూపాయలు అప్పుఇచ్చినాడనిన నమ్ముట కష్టమేకాని యదినిశ్చయము. 10 రూపాయలకు నెలకు నాలుగణాల వడ్డీప్రకారము సంవత్సరముకు 100 కి 30 రూపాయలగును. ఇదియు వెండిపాదసరము తాకట్టుమీద! ఇట్టిలాభకరమగు వ్యాపారమందరు కోరదగినదికాదా! తప్పక కోరదగినదే. అయిన నిది పరిశ్రామికాభివృద్ధి కొకగొప్పయాటంకము. ఎట్లనగా చరాస్తితనకామీద (తాకట్టు అడమానము) నూటికి 30 రూపాయిలువడ్డీ సంపాదించువాడు నూటికి 10 లాభ భాగము వచ్చుటె కష్టమగునట్టియు, మొదటి డివిడెండు (భాగస్థుల ఆదాయము) రాకమునుపే దివాలా తీయునేమోయని సందేహముండునట్టియు పరిశ్రామిక కార్యములందు పెట్టుబడి పెట్టుటకు ఎవడైన నిష్టపడునా? ఇట్టి వడ్డీ వ్యాపారము తప్పని చెప్పుటవల్ల ప్రయోజనము లేదు. కాని వడ్డీ యెక్కువనిపించుకొను ఈ తాకట్టు వ్యాపారమునందుకూడ పైకగుపడునంతటి గొప్పలాభము నిజముగా లేదు. ఎందుకనగా ఇతనివద్దకు గాహకులు (Customers) ఒకమారు రారు. వచ్చుచు పోవుచునుందురు. అందుచేత అతని ధనములో నెక్కువ భాగము వీరికొరకు కాచుకొనియుంచ వలయును. ఇందుచేత నూటికి ముప్పది వంతున తనఖామీద అప్పువచ్చినను గాహకుల సంఖ్యనుబట్టి తన మొత్తపు మూలధనము మీద నికరముగా గిట్టునట్టివడ్డీ చాలతక్కువగానే యుండును. ఒకొకప్పుడు ఇరువది, పదునైదు, పది, మాత్రమే గిట్టుచుండును. పరిశ్రామిక పనులండిటుకాదు (1) పెట్టుబడిలో కొంచెమైనను మూల

పడియుండక అంతయు పనిచేయుచుండును. (2) భాగస్థులకు పదేపదే తనిఖీచేయు బాధయుండదు. తనబిడ్డ కాలిగోలును తాకట్టుమీాద అప్పుతీసికొనుటకొక స్త్రీవచ్చి ఇంటివాకిట కాచియున్నదను వార్తవలని తొందరలేకయే వకీలు తన వ్యాజ్యపు సంగ్రహమును (Brief) చదువుకోవచ్చును, (3) అప్పిచ్చువాని మూలధనముయొక్క నిజమైనవిలువ మారకుండును గాని పరిశ్రమయందలి పెట్టుబడియొక్క విలువ యెక్కువగుచుండును. ఇందుచేత వడ్డీలాభముమాత్రమేగాక మూలధనముయొక్క విలువ హెచ్చుటయుకూడ లాభమే యగును. ఎట్లన ఒకడొక కొత్తపరిశ్రమయందు నూరురూపాయలు పెట్టుబడి పెట్టినాడనుకొందము. ఆ పరిశ్రమ బాగుగా జరిగెనేని మొదటి సంవత్సరమున నూటికి 8 వంతున లాభము వచ్చును. అప్పుడా తనిభాగముయొక్క విలువ నూటినుండి నూట యిరువది కావచ్చును. అందుచేత అతనికి నిజముగా గిట్టు వడ్డీ నూటికి 8 కాదు 28 యే యగును.

పరిశ్రమలయందు పెట్టుబడిదారులకు లాభము ఒకొకప్పుడు అపరిమితముగానుండును. జరిగిన 10, 12 సంవత్సరములలో పెట్టుబడిదారులకు మంచి లాభములిచ్చిన హైందవపరిశ్రమలలో కొన్నిటిని గురించి యోచింతము. హైందవపరిశ్రమలంటిమి ఇట్లనుటకుబదులు ఇండియాలోని పరిశ్రమలనుట యెక్కువయుక్తముగా నుండును కాబోలు. ఎందుకనగా నిన్నటివరకు హైందవులగు మనము పారిశ్రామిక కార్యములందు వెనుకపడియుండుటచేత ఐరోపావారే పెద్ద పెద్ద పబ్లిక్ కంపెనీలు (జనసంఘములు) స్థాపించి వానిచేత ముఖ్యమైన పరిశ్రమల నేర్పా

టు చేసి వానిని నడిపించుచున్నారు. ఈ కంపెనీలయందలి భాగస్థులు విదేశపువారగుటచేత లాభమంతయు వారికే వెళ్ళుచున్నది నరేకదా, పరిశ్రమానుభవముగాని పరిశ్రామికజ్ఞానముగాని మనకబ్బుటలేదు. మనకు మిగులునది గుమస్తాకిచ్చిన జీతము, పనివారలకిచ్చిన కూలియు మాత్రమే. మొదట బంగాళము లోని నేలబొగ్గు పరిశ్రమనుగూర్చి యోచింతము. అందు ముఖ్యమైన (Khatras Jerria mine) ఖాత్రాసు జరియా గనినిగూర్చి చెప్పెదము. 12 సంవత్సరముల క్రిందట ఈ కంపెనీలో పదిరూపాయల వాటాలు పదిరూపాయలకే దొరుకుచుండినవి. ఇట్లుండ ఇండియాలో నేలబొగ్గుకు గిరాకి యెక్కువాయెను. అందుచేత 10రూపాయల వాటాలు 42 రూపాయలకు కొనుగోలు విక్రయములు జరుగుచుండెను. వాటాదారులకు నూటికి 40 వంతున డివిడెండు పంచిపెట్టుచుండిరి. ఇంతేకాదు. ఈ కంపెనీవారి నేలబొగ్గుపాలములు చాల పెద్దవగుటచేత అన్నిటిలోను పని చేయజాలక అందులో కొంతభాగము సిబ్‌పూరు నేలబొగ్గుకంపెనీ (Seebpore Coal Mining Company) అను నొక క్రొత్త సంఘమునకు అమ్మగా రెండవ కంపెనీవారు మొదటి కంపెనీలోని ప్రతి వాటాదారునకును ప్రతి ఐదేసి వాటాలను ఉచితముగా రెండవ కంపెనీలో నిచ్చిరి. ఈ క్రొత్త కంపెనీలలోని వాటాల ఖరీదెక్కువగుటచేత ఒకొక 5 రూపాయిల వాటా 14 రూపాయిలకు కొనుగోలు విక్రయములగుచుండెను. నూరు రూపాయలుపెట్టి మొదటి కంపెనీలో 10 వాటాలు కొనినవాని యొక్క లాభము నెంచుక ఆలోచింతము. మొదటి కంపెనీలోని 10 రూపాయిల వాటా నలుబది రెండు రూపాయలగుటచేత

అతను కొన్న 10 వాటాలకు 420 రూపాయిలయినవి. అనగా మొదటి నూరు రూపాయిలు 420 రూపాలయినవి. ఇది యిట్లుండగా 40 రూపాయల డివిడెండు వచ్చినది. పైగా క్రొత్త కంపెనీలో 14 రూపాయల ధరగల వాటాలు యెనిమిది వచ్చుటచేత 112 రూపాయల విలువగల వాటా వచ్చినది. కాబట్టి మొదటి నూరు రూపాయలు 572 రూపాయలయినవి. ఈ కథ యింతటితో ముగియలేదు. ధరలంతకంతకు ఎక్కువగుటచేత మొదటికంపెనీలోని 10 రూపాయల వాటా నూరు రూపాయలకు తక్కువ దొరకకుండెను. ధర హెచ్చుట తగ్గుకొరకే అనునట్లు తరువాత ధరలు పడిపోయెను కాని మొదటి కంపెనీలోని వాటాలిప్పటికిని 70 రూపాయల కమ్ముచున్నవి. అసలు ధరలకు సంపాదించగలిగిన ప్రతివానికిని మొదటి కంపెనీలోని వాటాలు అద్భుతమైన ఆస్తి యయినవి. జయప్రదముగా జరిగిన కంపెనీలలో నిది యెక్కువ జయప్రదముగా జరిగినది.

బంగాళములోని నేలబొగ్గు పరిశ్రమకు తరువాత నేర్పడి లాభము నిచ్చినది బర్మా కిరసనాయల్ పరిశ్రమ (Burmah Oil Company). ఈ కంపెనీలోని వాటాలధరలు పదిసంవత్సరముల నాటికంటె ఇపుడు 10 రెట్లెక్కువగా నున్నవి. వాటాదారులకు మంచి డివిడెండు యివ్వబడినది. ఈ పరిశ్రమ తరువాతస్థాపించబడి జయప్రదముగా జరిగినది రబ్బరు పరిశ్రమ. ఈ కంపెనీలయందు కొన్నిటిలో వచ్చిన లాభము కలలోనైనను చూడము. పెరియారు కంపెనీలోని పది రూపాయల వాటాలు 150 రూపాయలమ్మెను. కొచ్చిన్ కంపెనీలోని 10 రూపాయల

వాటాలు 25 రూపాయలనుండి ఒకనెలలో 75 రూపాయల కెక్కెను. గ్లెన్‌బాగ్లో దొరగారి పరిచయస్థుడును కాఫీతోటల యజమానుడును అగు నొకదొర కాఫీచెట్లకు రోగము తగులుట చేతను కాఫీగింజల ధరతగ్గుటచేతను కొంచెము హెచ్చుతక్కువగా తన యాస్తినంతయు పోగొట్టుకొని దివాలాకు తయారై యుండి ఒక కొండక్రింద కొంత బీడునేలను బహుస్వల్పధరకు కొని రబ్బరువిత్తనము కొంతసంపాదించి కూలివాండ్ల నేర్పరచి రబ్బరు విత్తించెను. పోయిన సంవత్సర మాతడు ఈ తోటను మూడులక్షల రూపాయిలకు లండనులో నొక కంపెనీకి అమ్మివేసెను! ఎంతలాభమో చూడుడు! ఇట్టి వ్యాపారము అందరు ఆశించ తగినదే కాని ప్రతివానికిని ఈలాటివి తటస్థించవు. రబ్బరుమొక్కలు 5 సంవత్సరము లెదిగిన కాని రబ్బరునియ్యవు. కాబట్టి రబ్బరుమొక్కలు నాటుట నిప్పుడెవరైన నారంభించిరేని అవి యెదిగి రబ్బరు నిచ్చుటకు మొదలుపెట్టులోపున ప్రపంచములోని రబ్బరుత్పత్తి దానికుండు గిరాకికంటె యెక్కువగా కావచ్చును. ఇందుచేత రబ్బరుపంట వరిపంటకంటె లాభకారి కాకపోవచ్చును. అనగా రబ్బరువేసి మంచిలాభము సంపాదించుకాలము దాటిపోయి యుండవచ్చును. కావున అదును యెరిగి ముందుగా పంటవేశిన వారే లాభమొందిరని తేలుచున్నది. ఈ రబ్బరు పరిశ్రమయొక్క కథవల్ల ప్రతిపరిశ్రామికుడొక విషయము తెలిసికొనవలయును. ఏమనగా ప్రపంచమునందు నిరంతరము మార్పులు కలుగుచుండును. ప్రాతవస్తువులకు గిరాకి వచ్చుచుండును. క్రొత్త కొత్తవస్తువులకు గిరాకి తగులుచుండును. అందుచేత పరిశ్రామికుడు అదును కనిపెట్టి కేవలము

పాత పరిశ్రమలనే నమ్ముకొనక ముందాలోచనకలిగి క్రొత్త క్రొత్త పరిశ్రమలను వృద్ధిచేసి మహా భాగ్యము సంపాదించవచ్చును.

పరిశ్రమలవల్ల అందరికిని ఇట్టి మహాభాగ్యము కలుగునని ఆశపడకూడదు. ప్రతి పెట్టుబడిదారునకును మంచిలాభము కలుగునని ఆసపడవచ్చును కాని ప్రతిదినము గొప్పభాగ్యముని చ్చుపెట్టుబడులు దొరకుననిమాత్రము తలపకూడదు. అపరిమితమైన లాభమువచ్చునని పైకి చాటించెడి పెట్టుబళ్ళు సాధారణముగా నేమియు నియ్యకపోవుట సామాన్యము. కాబట్టి పెట్టుబడిదారుడు జాగ్రత్తగా నుండవలయును. పైని చెప్పబడిన పరిశ్రమలెందు కంతలాభము నిచ్చినవందురేమో వినుము. బోయర్ యుద్ధమువల్ల ఉన్నట్టుండి ఇండియా నేలబొగ్గునకు గిరాకి తగిలినది. ఇండియానుండి తక్షణము ఆఫ్రికాకు వెళ్ళవలసిన స్టీమరులు ఇండియా బొగ్గును ఉపయోగించక తప్పదయ్యెను. ఆ సమయమున యుద్ధనావల వాడుకకును యుద్ధసామాగ్రి తయారుచేయుటకును ఇంగ్లాండు దేశమునందే బొగ్గు కావలశియుండుటచేత ఇండియాకు బొగ్గెగుమతి తక్కువయ్యెను. ఇందుచేత ఇంగ్లీషు బొగ్గును వాడుచుండిన రైళ్ళు యంత్రశాలలు ఇండియాలోని బొగ్గునే నమ్ముకొనవలసివచ్చెను. ఇట్లేర్పడిన గిరాకి యుద్ధమైన తరువాత తగ్గిపోయి లాభము నాశించుకొని యుండువారలలో చాలమంది దివాలాతీసి యుండవలసినదే కాని అట్లు జరుగలేదు. ఎందుకనగా దక్షిణ ఆఫ్రికాలోని అమ్మకము ఇండియాలోని బొగ్గునకు అద్భుతమైన ప్రకటనమాయెను. ఇండియా బొగ్గు ఇట్టిదని ఇదివరకెరుగ

ని రైళ్ళు యంత్రశాలలు దాని నాణెమెరుగుట తటస్థించినం దున దానినే వాడుక చేయుచుండిరి. రష్యా జపానుయుద్ధము జరుగుచుండుటచేత రష్యానుండి నూనె యెగుమతి తక్కువ య్యెను. అందువల్ల బర్మానూనెకు గిరాకి అధికమాయెను. ఇదే ప్రకారము విద్యుత్పరిశ్రమయు, రబ్బరుపట్టాలు కావలసిన మోటారుబండి పరిశ్రమయు, నెక్కువగుటచేత రబ్బరుకుకూడ గిరాకి యెక్కువయ్యెను. అందువల్ల రబ్బరుపంట వేసినవారి కి లాభము విశేషము కలిగెను. కావున ఇట్టి అద్భుతలాభ దాయకములగు పెట్టుబడులు యెల్లప్పుడును దొరకవు. ఇట్టివి పరిశ్రామిక ఫలవనములందు కతాచితుగా దొరకు సత్ఫలము లు గాని ప్రతిదినము దొరకునవికావు. కాబట్టి ఈ ప్రకరణ మువల్ల తెలిసికొన దగిన యంశమెద్ది? తన మూలధనమెంత కొంచెమైనను బాగుగ నేర్పాటుచేయబడి మంచిత్రోవను న డచు పరిశ్రమలో పెట్టుబడిపెట్టి లాభమునకు వేచియుండవల యునేకాని వివేచనలేని వ్యాపారపుజూదమునకు దిగకూడదు. బాగుగ నాలోచించినయెడల జూదపు టెత్తులచేత లాభము సంపాదించినవారు మిక్కిలి అరుదు. అట్టి ప్రతియొకనికిని ఇప్పు డో అప్పుడో, మరొకప్పుడో దివాలాతీసి ఉన్నదంతయు పో గొట్టుకొనినవారు ఇరువదిమందియైనను ఉందురు. తనవార్ధక్య మునందును, తనయనంతరము తన్ను నమ్ముకొనియుండు తన భార్యకును తండ్రికిని తన బిడ్డలకును నిరాధారముగా నుండవల వలసిన స్వల్పసంపాదనంతయు నొక పిచ్చికంపెనీలో పెట్టి స ర్వము పోగొట్టుకొని గొల్లు గొల్లుమని ఇరువది సంసారములు యేడ్చుచుండగా యెవరినో యొకరిని బాగుచేసెనేని ఈ పు

స్తకము కీడు చేసినదే యగును. ఒడలు తెలియక పెట్టుబడి పెట్టినది యొకటి: వివేచనాపూర్వకమైన పెట్టుబడి మరియొకటి. సరియైన దారిని నడుచు పరిశ్రామిక కార్యములందు సహాకారము చూపుటచేత హైందవ పరిశ్రమాభివృద్ధియందు సాయపడుటయే గాక, ఆ పరిశ్రమలు తెచ్చు సంపదలో భాగస్థుడు కావచ్చునని సలహా చెప్పుటయే ఈ ప్రకరణముయొక్క ముఖ్యోద్దేశము.

(3) పరిశ్రామిక సంయోగమింతకాలము వెనుక పడియుండుటకు కారణము మరియొకటి యున్నది. మనము స్వభావసిద్ధముగా పెట్టుబడి విషయములందు పిరికితనము కలవారము. పూర్వము జాయింట్ స్టాక్ కంపెనీలయందు దెబ్బ తినినవారనేకు లుండుటచేత ఈ నైజమైన పిరికితనము మరింత హెచ్చినది. ఒకమారు చురుక్కుమనిన మరల సమీపింపము కదా. ఈ విషయమై బంగాళములో జరిగిన బంగారు గని కథను కొంత ఆలోచింతము. 1890వ సంవత్సరమున బంగాళములో నొక జిల్లాయందు బంగారు అపరిమితముగానున్నదను వార్త అంత నల్లుకొనెను. కంపెనీ ప్రమోటర్లు (Company promoters) అట ముసాగిరి. బంగారు గనుల కంపెనీల నేర్పరిచిరి. గనులందు బంగారపరిమితముగా దొరుకునని ప్రమోటర్లు చెప్పి బంగారు కొండుపులను కలకత్తాలో ప్రదర్శించిరి. అందుచేత ఈ కంపెనీలలోని వాటాలకు గిరాకి అధికమాయెను. ధరలెక్కిపోయెను. ధనముగల రాజులు నవాబులు మొదలైన వారందరు ప్రోత్సాహముచేత నెక్కువ వాటాలు కొనిరి. తర్వాత నిజము బయలుపడెను. బంగారు గనులందు బంగారు

లేదయ్యెను. వాటాల ధరలు తగ్గిపోవుటచేత వాని నడుగు వారే లేకపోయిరి. కొనువారు అంతకు ముందే కొనరైరి. ఎవరో కొందరు బాగుపడిరి కాని రాజులు నవాబులు మొదలగు వాటాదారు లందరు గొల్లుమనిరి.

1882, 1883వ సంవత్సరములందు వయనాడు (Wyanad) బంగారు గనుల పని పూనినప్పుడుకూడ నిట్టి అనర్థమే సంభవించెను. ఇచ్చట గనులందు బంగారుండుట బూటకమనుటకు వీలులేదు. మొదట మన పూర్వులు గనులందు పైపైననుండు బంగారును తీసియుండిరి. తగిన సాధన సామాగ్రిలేమిచేత ఎక్కువ లోతునకు త్రవ్వజాలక పోయిరని తలంచి నూతన యంత్రసాహాయ్యమువలన లోతుగా త్రవ్వి మంచి లాభము పొందుదమని ఆశపడిరి. ఈ యాలోచన యుక్తియుక్తముగా నుండుటచేత పని త్వరితముగా జరుగుచువచ్చెను. బంగాళాలు గుడిశెలు బయలుదేరెను. యూరోపునుండి పనికులు వచ్చిరి. ఇంగ్లాండునుండి బరువైనట్టియు విలువైనట్టియు యంత్రములు తెప్పించిరి కాని వానిని కొండలమీదుగా గనులవద్దకు సాగించుటకు మిక్కిలి కష్టముగనుండెను. ఈ సామాను మెల్ల మెల్లగ పైకి పోవుచుండగానే త్రవ్వుట మొదలుపెట్టి గనులుత్తవని తెలిసికొని యెక్కడి సామానక్కడనే వదలి ఆ పరిశ్రమ మానివేసిరి. ఈ యంత్రసామగ్రి తుప్పుపట్టి పడియుండుట చూచి ఆ కొండలమీద తిరుగువారు చోటుకాని చోటునకివి యెందుకు వచ్చినవా యని ఇప్పటికిని ఆశ్చర్యపడుచుందురు. ఇవి 27 సంవత్సరముల క్రింద దివాలా తీసిన జాయింట్ స్టాక్ కంపెనీని జ్ఞాపకముచేయు

భయంకరమగు సూచకము లేకదా! ఈ కంపెనీ వాటాదారు లందరు యూరోపియనులే యగుటచేత నష్టమంతయు వారికే వచ్చినది కాని ఈ కంపెని దివాలా తీసినదని ఇండియాకంత యు తెలిసెను.

ఐరోపా వారి ప్రయత్నము లిట్లుండగా హిందువులు ఏర్పాటుచేసిన జాయింట్ స్టాకు కంపెనీలకుకూడ ఈ గతియే పట్టియుండెను. హైందవులు పెట్టిన గాజు, కాకితము, అగ్గిపుల్లలు మొదలగు వానిని చేయు యంత్రశాలలు యెన్ని పుట్టి గిట్టినవో యెవరు చెప్పగలరు? ఇట్టి యనుభవము ఒకవైపున బాధించుచుండగా జాయింట్ స్టాకు కంపెనీలయందు పెట్టుబడి పెట్టుట కెవరు సాహసింతురు? వీరు పాతిపెట్టుటకుగాని సొమ్ముల తనఖామీద నూటికి 30 వంతున వడ్డికి అప్పు యిచ్చుటకుగాని తీర్మానించుకొనుట స్వాభావికమే కదా?

పై విషయములను గురించి సరియైన జవాబు చెప్పవలయునేని ఈ పరిశ్రమ లెందుకు చెడిపోయినవో చర్చించుటయే మంచిది. ఇటీవల చెడిపోయిన పరిశ్రమలలో ముఖ్యమైనదగు బంగారు పరిశ్రమయందు పెట్టుబడిదారులు కంపెనీ ప్రమోటర్ల దుర్బోధనలు విని చెడిపోయిరనుట నిక్కము. ంతటి యనుకూలపు స్థితియందుకూడ బంగారు పరిశ్రమ జూదమువంటిది. బంగారు విలువయైనదే కాని ఇనుము నేల బొగ్గువలె అంత యుపయోగకరమయినదికాదు. కావున మన దేశపు పెట్టుబడి దారునకు సిఫారసుచేయుటకు బంగారు పరిశ్రమ తగినది కాదు. ఇది జూదమువంటిదనుటచేత నర్థమేమి? జూదమునందువలె లాభము వచ్చెనా బాగుగా

వచ్చును. రాక పోయెనా మరల తిరుగే లేదు. ఎందుకనగా గనులలో బంగారుండునది లేనిది నమ్మకముగా చెప్పుటకు వీలు లేదు. ఈ లోహము గనులందు ముద్దలుగా నుండక సన్నని చారల వెంబడి యుండును. ఈ చారలెటు వెళ్లునదియు చెప్పుటకు వీలులేదు. బంగారధికముగ నిచ్చుచార హఠాత్తుగా నిలిచిపోయినను పోవచ్చును. కాబట్టి బంగారు త్రవ్వకము జూదమువంటిదనుట యందు అతిశయోక్తి యేమియు లేదు. నేల బొగ్గువిషయ మటుకాదు. ఇది గనులందు పొరలు పొరలుగా వ్యాపించి యుండుటచేత ఎన్నిలక్షల టన్నుల బొగ్గుండునది యు ముందుగా లెక్కింపవచ్చును. బంగారు త్రవ్వకపు పరిశ్రమయందు ఇట్టి జూదపు లక్షణముండుట, మైసూరునందొక్క జిల్లాయందుండు గనులధరలు విమర్శించినట్లయిన, బాగుగా విశదమగును. కొన్ని గనులు వాటాదారుల కధికలాభము నిచ్చినవి. కొన్ని నష్టము కలిగించినవి. ఇందుకుదాహరణము లు. (Mysore Gold Mining Company) మైసూరు బంగారు త్రవ్వకపు కంపెనీలో $7\frac{1}{2}$ రూపాయల వాటా 75 రూపాయలయినది. పాలఘాటు కంపెనీలో 15 రూపాయల వాటాలు రూ 5-1-0 అయినవి, క్రొత్త కెంపిన్ కోటుకంపెనీ యందు $3\frac{3}{4}$ రూపాయిల వాటా అరణాలకు దిగిపోయినది. కాబట్టి బంగారు పరిశ్రమలవంటి జూదపు పరిశ్రమలను విడిచి నమ్మకమైనవానియందు ప్రతి హైందవుడు శ్రద్ధ తీసికొని పనిచేయుట మంచిదని యెరుగవలయును.

మరియొక విషయము. బంగారు పరిశ్రమ జూదమువంటిదని చెప్పితిమిక్కదా. మిగిలిన పరిశ్రమలన్నియు తగినక్షే

యని భావింపకూడదు. సాధారణముగా బయలుదేరు ప్రతి జాయింట్ స్టాక్ కంపెనీ విషయమునను వానిని వృద్ధి చేయుట కై ఏజంట్లు (Agents) యేర్పడియుందురు. వారిలో కొందరు కంపెనీవల్ల రాబోవు లాభమును నోరూరునట్లు ప్రకటించుచు వాటాదారులను పోగుచేయు మాటలరాయండ్లు. వీరి విషయమున జనులు జాగ్రతగా నుండవలయును. ఇట్లనుటచేత కంపెనీ ప్రమోటర్లందరు చెడ్డవారని తలంపకూడదు. సజ్జనులిందు కూడ నున్నారు. కాన బయలుదేరే కంపెనీ నమ్మకరమైనదనియు, దాని డైరెక్టర్లు ఆస్తియు పలుకబడియు కలవారై సుప్రసిద్ధులుగా నుండుటయే గాక ఆ పరిశ్రమయందు కొంత పరిచయముకూడ కలిగి, దానిని శ్రద్ధగా తమ యధీనములో నుంచుకొని నడుపువారనియు, పెట్టుబడిదారునికి తోచి, ఆ పరిశ్రమ జయప్రదముగా జరుగగలదని నమ్మకము కలిగెనేని అట్టి దానియందు పెట్టుబడి పెట్టుట మంచిది. తరువాతివిషయము దైవాధీనము. ఇంతేకాని యోచించక మంచిచెడ్డలరయక కేవలము కంపెనీ ప్రమోటర్ల మాటలే విని, డంబపుప్రకటనల విశ్వసించి ఇట్టిపనులకు పూనుకొనరాదు. పూనుకొనుటచేత తాము నష్టపడుటయేగాక కంపెనీలయందు అపనమ్మకము కలిగించి దేశ పరిశ్రమాభివృద్ధికి హానిచేసిన వారగుదురు.

మన దేశమున స్త్రీవిద్య ఇపుడిపుడు వృద్ధియగుచున్నది. కావున విద్యావంతులగు స్త్రీలందరు నిరూర్జితమగు సొమ్ములందలి దురభిలాషమాని తమకును తమ దేశమునకును లాభదాయకములగు పరిశ్రమలందు పెట్టుబడిపెట్టునటుల తమ పురుషుల ప్రోత్సాహము చేతురుగాక. స్త్రీలు అబలులనుటయు భీరు

వులనుటయు భౌతికాపాయ విషయములందే నిజముకాని మనో ధైర్యమునందు పురుషులకు వెనుతీయువారు కారు. విద్యావంతులయి ప్రపంచస్థితు లెరిగి రేని, ఇట్టి కార్యములందు మన యువతీలలామలు తమ సాహసమును చూపుదురనుట సత్యము. ఈ సాహసముమాత్రము అరయమివల్ల నెప్పటికిని కలుగకూడదు. ఎంత కాలమిది వివేచనతో కూడియుండునో అంత కాలమది మనకు మేలునే చేయునుకాన నో హైందవ యువతీమణులారా! విద్యాధనము సంపాదించి నిర్మార్జితములగు సొమ్ముల యందే కేవల మాసయుంచక దేశలాభమునకును స్వలాభమునకును తోడుపడు పరిశ్రామిక కార్యములందు కొంత ధనము పెట్టునటుల పురుషుల కుత్సాహము గలిగించి పుణ్యము కట్టుకొందురుగాక.

అద్దములు అగ్గిపుల్లలుచేయు చిన్న యంత్రశాలలు పడిపోవుటకు మూడు కారణములున్నవి. (1) పరిశ్రమ జయప్రదముగా జరుగుటకుండవలశిన స్థితిగతులుండనిదే పరిశ్రమారంభము చేయుట (2) పనిచేయువారి కుండవలశిన కళాజ్ఞానము కళా కౌశలము (Technical skill) ఉండకుండుట (3) పరిశ్రమ మొదట అనుభవించు చిక్కులనుండి తప్పించుకొని జయముకాంచువరకు కావలసిన మూలధన ముండకుండుట. ఒక చిన్న చీకటిగది ఆఫీసుగాను, అందు సగముశరీరము మీాద బట్టవేసికొని కాలు విరిగిన బల్లయెదుట కుంటి కుర్చీమీాద కూర్చునియుండు గుమాస్తా కంపెనీ యుద్యోగస్థుడు గాను నేలమీాద చతికిలబడి యుండు ముగ్గురు నలుగురు మనుషులు యంత్రశాలలో పనివారుగాను, ఉండు యంత్రశాల యే

మాత్రము బాగుపడగలదు బాగుపడుటకు గొప్ప ఆఫీసులు ఆవిరి యంత్రములే కావలయునని చెప్పుటలేదు. కాని యంత్రశాల చూచుటకైనను బాగుండవలయును. లేనియెడల అవి నష్టకము పుట్టింపజాలవు. కాబట్టి ఇట్టి సౌకర్యము లేవియు లేక పుట్టగొడుగులవలె పుట్టి గిట్టు ఇట్టి చిన్న కంపెనీలనుబట్టి పరిశ్రామి కోద్యమములు తగవని చెప్పకూడదు.

(4) పరిశ్రామి కోద్యమములు జయప్రదముగా జరుపుటకు తగిన తెలివి తేటలు, చొరవ, చురుకుతనము, మొదలగు సులక్షణములు పరిశ్రమాధికారి కుండకపోవుటవల్ల హైందవ పరిశ్రామి కోద్యమములు పాడగుచున్నవి. తెలివి తేటలు లేని పుత్రుడే పరిశ్రామిక జీవనమున కేర్పడినవాడని యెంత కాలము మనము తలంచుచుందుమో అంత కాలము ఈ యసమర్థత మన పరిశ్రామికు నందుండక తప్పదు. మన కుటుంబములో తెలివితక్కువ వానినే పరిశ్రామికవిద్యకొరకు మనము విదేశములకు పంపుచున్నామని చాటర్టనుదొరగారు (Mr. Chatterton) పలుమారు చెప్పియున్నారు. ఇది యంతయు సత్యము. ఇట్టి స్థితియందు ఆ తెలివి తక్కువవాడు విదేశమునుండి మన దేశమునకు వచ్చినతరువాత చేయునదేమి? అతడు తలపెట్టిన పరిశ్రామిక కార్యములంత బాగుగ నెరవేరనియెడల యేమివింత? దీనిని చూచి పరిశ్రమమన కెన్నటికిని జీవనోపాయము కాజాలదని జనులు నమ్మినారేని ఇందేమి యాశ్చర్యమున్నది?

సింఛన తహసిల్దారగు రామస్వామయ్యరుగారు తమ పొరిగింటివారితో ఇట్లనుచున్నాడు 'నా పెద్దకుమారుడు శివరాముడు నన్ను పోలియున్నాడు. వానికి మంచి తెలివి తేటలు

కలవు. కాలేజీలో బాగుగా చదువుకుంటున్నాడు. వానిన్ని లా చదువుకొనుటకు పంపుదును. పాపము మా వైద్యనాథము తల్లిని పోలియున్నాడు. వాడేమియు నేర్చుకొనలేదు. వాడు మొద్దన్న కావడమేగాక సోమరితనముకూడ వానియందున్నది. వాడు పుస్తకము పట్టుకొని పట్టుమని ఒక గంట యైనను కూర్చొనలేదు. వీడు యేదైన పరిశ్రమలో బాగుపడునేమో! కాబట్టి వీనిని కాగితముచేత నేర్చుకొనుటకు జపానుదేశమున కంపెదను.” శివరాముడు నిశ్చయముగా తెలివిగలవాడే యగును. అతడు త్వరలో బి. యల్. పరీక్షయందు కడతేరును. కాని చిన్నపట్టణమందుండు వకీళ్ళపోటీకి తాళజాలక యే చిన్న పట్టణములోనో వకాల్తా మొదలుపెట్టి అచట మంచి ఆదాయమును సంపాదించును. కొంతకాలమునకు మ్యునిసిపల్ కౌన్సిలులో నొకసభికుడుకూడ నగును. అటుతరువాత చిన్నపట్టణం వకీళ్ళలో సింహమనియు అచటి పౌరులలో మొదటివాడనియు కూడ ననిపించుకొనును. కాని ఆ చిన్నపట్టణము దాటిన తరువాత శివరాముడెవరైనది ఎవరికిని తెలియకుండును. వైద్యనాథము నిజముగా తెలివితక్కువవాడు. ఇతడు జపానుకు వెళ్ళి కాకితముచేత నేర్చుకొనుచున్నానని అనుకొనుచుండును. ఇతడు మనదేశము వచ్చినతరువాత తన తండ్రియిచ్చిన వేయిరూపాయలు పెట్టి కాకితముల యంత్రశాల స్థాపించును. కాని కాకితము మంచిదికాక వ్రాసినప్పుడు సిరా అంతటను అల్లుకొనును. లేదా కలమునకు చిన్నచిన్న గడ్డిపలుసులు అంటుకొనును. అందుచేత ఆ కాగితము యెవరికిని పనికిరాదు. ఒకవేళ మంచి నాణెమైన కాకితమే తయారయ్యె ననుకొంద

ము. వైద్యనాథము తెలివితక్కువవాడగుటచేత దానికి తగిన అమ్మకము సంపాదించగలడా? అందుచేత కొంతకాలమునకు యంత్రశాల సాగకపోవును. ఉండిన యిద్దరుకూలీలను తీసివేసి మామయిచ్చిన స్త్రీధనముమీద జీవనముచేయ మొదలుపెట్టును. దీనిని చూచి ఇతని యిరుగు పొరుగువారలు తమ పుత్రులు పరిశ్రామిక విషయములందు యెంత యభిరుచి కలవారైనను వారిని న్యాయశాస్త్రమె చదువుమని నిర్బంధించుట తటస్థించును. స్వామినాథమును పంపుటకుబదులు శివరామునే కాకితపుచేతకు జపానుకు పంపియుండినట్లయిన అతడు వకీలుపని కంటె కాకితపుచేత యెక్కువ జయప్రదముగా జరిపియుండును. తన తెలివితేటలుపయోగించి మొదటిరకపు కాగితములనే తయారుచేసి తండ్రివద్ద వేయిరూపాయిలకంటె యెక్కువగాధనము తీసికొని పెద్ద పరిశ్రమ నొకటి యేర్పాటుచేసి శివరామయ్యర్సు గణేశా ఫూల్సుక్యాపు కాగితమన్న సింలాలోని సెక్రిటేరీయట్ ఆఫీసుమొదలు తూతుకుడీ లోని టవున్ సబ్ మేజస్ట్రీటు కోర్టువరకు అంతటను వాడుకలోనుండునట్లు చేసియుండును. కాని కుటుంబములోకెల్ల తెలివితక్కువవాడుగదా పరిశ్రామిక జీవనమున కేర్పరుపబడినవాడు. అట్టివా డేమిచేయగలడు? ఈయనర్థమునకంతకు కారణమేమి? పరిశ్రామికత్వము కూలిపనియు నొకటియేయని మనము తప్పభిప్రాయపడుటయే కదా. పరిశ్రామికత్వమునందు కూలిపనివాడు ముఖ్యుడే యైనను, ఒక గొప్ప దేశమును పాలించుటకెంత తెలివితేటలుండవలయునో అంతటి తెలివితేటలు చాకచక్యము ఏ గొప్పపరిశ్రమనయినను సరియైన మార్గముననడుపు ప్రతివానికిని యుం

డవలయును. ఎంతటి తెలివి తక్కువవాడైనను పరిశ్రామికోద్యమములను జయప్రదముగా జరుపుచునుకొనుట నిస్సందేహముగాను నిర్వివాదముగాను తప్పనిమున్నూరు నొక్కిచెప్పవలసియున్నది.

ఇక స్వదేశి స్టీం నావిగేషన్ కంపెనీని గురించి యొక మాట చెప్పెదము. ఇది పడిపోవుట మిక్కిలి చింత్యము. విదేశపు నావలయందు పనిచేయువారందరు హైందవులే యగుటచేత మనదేశపు సరుకుల మోతవ్యాపారము (Carrying trade of India) నందు కొంతయైనను మనకుండవలయునని మనముకోరుట న్యాయమైనది. ఈకంపెనీ మిక్కిలి మంచి తరుణముననే బయలుదేరినది. పరిపాలనముకూడ బాగుండినది. కాని ఇంతకుమునుపే బయలుదేరి పనిచేయుచుండిన కంపెనీ బలవంతమైనదగుటచేత, దానితో పోటీకి పనిచేయు ఓ స్వదేశీకంపెనీకి నష్టముగనుండుట వాస్తవమేకాని కాలక్రమమున ఈ బాధలుపోయి రెండుకంపెనీలు స్నేహభావముతో పనిచేసియుండును. అయితే దురదృష్టవశమున వ్యాపారవిషయములు రాజకీయ విషయములతో సమ్మేళనమాయెను. రాజకీయవిషయములు అతిఉగ్రముగా నుండెడివి. అందుచేత రాజకీయవిషయముల గూర్చి మాట్లాడువాడు తా ననుకున్న దాని కంటె యెక్కువగా చెప్పుట కాస్పదముండెను. దొరతనమువారు స్వదేశమతమును బోధించువారల మాటలను చులకనగా చూడకుండిరి. ఏమైననేమి కంపెనీ పడిపోయినది. ఇక ముందైనను ఇండియాయొక్క సరుకుల మోతవ్యాపారములో చాలభాగము హైందవులచేతిలో నుండుగాకయని కోరుదము.

(5) సహకారభావము లేకుండుటకు మరియొక గొప్పకారణమున్నది. ఇదేదన ఇండియాయందు సాధారణముగా ఒకరినొకరు నమ్మకుండుట. ఇది మిక్కిలి విచారకరము కాని సాధారణముగా నిది అందరియందును ఉన్నదనుట నిర్వివాదాంశము. ఉత్తమకులముల మాట యేమైనను తక్కువజాతులందుంను ఈ అపనమ్మకమునకు కారణము లేకుండలేదు. ఇండియాదేశమున వంటవాడు బజారులో వస్తువులను కొని నిజమైన ధరలపట్టినిచ్చుట తెలివితక్కువే యనుకొనును. గోడకట్టుటకు నిజముగా నైనఖర్చుపట్టీని తన ఇంజనీరుకిచ్చి తానేమియు తెలితక్కువవాడు కాడనుకొను తా బేదారునికి దొరతనమువారు సి. ఐ. ఇ. బిరుదు నియ్యవచ్చును. ఇవన్నియు చూచి జాయింటుస్టాకు కంపెనీ మేనేజరు కంపెనీ డైరెక్టర్లకు జమాఖర్చుపట్టి తయారుచేయునపుడు సరియైనలెక్క చెప్పెనేనితానుకూడ తెలివితక్కువవాడేనని యెందు కనుకొనకూడదు?" అని పెట్టుబడిదారుడు ఏల తలపకూడదు? కంపెనీ డైరక్టర్ల విషయమునకూడ అట్టిమాటయే అనుకొనవచ్చును. దేవాలయపు ధర్మకర్తలు దేవాలయపు ధనమపహరించు చున్నారని పేరుపడియున్నారుకదా? తన గ్రామ దేవాలయపు ధర్మకర్తలు కూడ దేవాలయపు ధనము నపహరించిరని నమ్మియుండువాడు కంపెనీ డైరెక్టర్లుకూడ కంపెనీయొక్క ధనమపహరింతురను భయముచేత కంపెనీలయందు పెట్టుబడి పెట్టుటకు జంకెనేని ఇందేమి ఆశ్చర్యమున్నది! ఇందుచేత హైందవులందరు మోసగాండ్రనవచ్చునా? ఇండియా యందు విశ్వాసపాత్రులగు మహాజనులు లేరా? అనేకులున్నారనియే చెప్పవలయును. అయినను

ఈ యపనమ్మకము మాత్రము సాధారణముగా జనులయందు న్నది. ఈ సందర్భమున పెట్టుబడిదారుడు చేయవలసినదేమి? (1) తాను బాగుగా కన్నులు తెరచియుండుట. (2) తనతోడి జనులందు న్యాయమైనసమ్మక ముంచుట. (3) మంచియేర్పాటు గల కంపెనీయందు మోసము సాధ్యముకాదని నమ్ముట. జాయింటుస్టాకు కంపెనీయొక్క మూలధన పాలనకును దేవాలయపు ధనపాలనకును వ్యత్యాసమున్నది. పనివారు సమర్థులుగానుండి, అనుభవముగలిగి పేరుపొందిన మేనేజరుండి, వలుకుబడిగల డైరెక్టర్ల సంఖ్య తగినట్టుగానుండి, లెక్కలు తనికీ చేయుటకు తగిన ఆడిటర్ ఉండి, వీరందరూ వారి వారి నియమిత కార్యములను బాగుగా చేయుచుండిరేని మోస ప్రయత్నములు చిక్కుపడకుండుట మిక్కిలి యసాధ్యము. ఇదిగాక భాగస్వాములకు ఆదాయనష్టపు పట్టీలు క్రమముగా వచ్చుచుండును. సాంవత్సరిక అర్ధసాంవత్సరిక సభలయందు వాటాదారుడు తనకిష్టము వచ్చినట్లు డైరక్టర్లను మందలించవచ్చును. ఇదియే కాక నడుమ నడుమ భాగస్వామి ఆఫీసునకు వెళ్ళి మేనేజరును కఠినముగా తనికీచేయుచుండవచ్చును.

(6) పరిశ్రామిక విషయములందు అపనమ్మక ముండుటకు మరియొక కారణమున్నది. ఇది మన ప్రతికొనుగోలు విక్రయమునందును కనపడు బేరమాడువాడుక. ఇందుచేత కొనువాడు అమ్మువానిని మోసముచేయ యత్నించును. అమ్మువాడు కొనువానిని వంచింపచూచును. అంగడివాడొక వస్తువుయొక్క ధర యిరువది రూపాయలని చెప్పి కడపట 15 రూపాయలకే యిచ్చినయెడల కొనువాడీతనియందు నమ్మకముంచు

నా? కొనువాడమాయకుడై అడిగినంత ధనము యిచ్చెనేని కొం
చెమైనను అన్యాయమని తలంచక యంగడివాడు డబ్బు జేబు
లో వేసికొనునుకదా! కొనువాడు కూడ ఈ మోసకృత్యమం
దు భాగస్తుడు కాకపోవుట లేదు. "అది బాగులేదు. ఇది బాగు
లేదు" అని చెప్పుచు దూరము పోయి మెచ్చుకొనుచుండును.
అమ్మువాడు యింతకు ముందు కొన్నవానికంటె యితనివద్ద
నాలుగణాలు యెక్కువ తీసుకున్నానని సంతోషించుచుండు
ను. ఈ బేరపుపద్ధతి చిన్న చిన్న దుకాణములందే కాక పెద్ద
పెద్ద షాపులయందు కూడ వాడుకలోనున్నది. ఇందుచేత
వ్యాపారమునందు అపనమ్మకము పుట్టక తప్పదు. ఈ చెడు ప
ద్ధతియుండు అన్నిచోట్లను మోసపు ప్రయత్నములుండక మా
నవు. ఇంగ్లండునందు కట్టుసామాను మొదలగునవి వేలము వే
యుచోట్లను అమ్మకపు గుత్తముల లాయములందును ఇట్టి బేర
ము జరుగుచుండును. కనుకనే మోసమునకివి పేరు పొందినవి.
అదృష్టవశమున మనదేశమున యిప్పుడిప్పుడు 'ఖరాధరల' పద్ధ
తి వాడుకలోనికి వచ్చుచున్నది. ఇది సాధారణమాయెనేని
వ్యాపారపునమ్మకము బలమగును. మనదేశమున ఇటీవల నొ
క ధనవిప్లవము సంభవించినది. ఇది మద్రాసులోనుండు ఆర్బ
తునాటు కంపెనీ దివాలాతీయుట. దీనివల్ల పెట్టుబడిదారున
కు యెక్కువ అపనమ్మకము కలిగించి తనధనమును భూమిలో
పాతిపెట్టుటయే మంచిదనిపించునట్లు చేసినది. ఈ కంపెనీపేరు
అన్ని యిండ్లలోను వాడుకపదముగా నుండి ధనమును నమ్మ
మును సూచించుచుండెను. ఇదెప్పుడు బయలుద్దేరినది ఈ కా
లపువారికి తెలియదు. ఇది మద్రాసులో సముద్రతీరమున

నొకగొప్ప హార్మ్యమునందుండెను. దాని యధికారి చెన్నపురి లోని ముఖ్యపౌరులలో నొకడుగానుండెను. చెన్నపురిలోనే కాక ఇతరభాగములందు కూడ ఈకంపెనీ యేజంట్లు వీరితరఫున పనిచేయువారును ఉండిరి. వడ్డీవర్తకపుశాఖ, యెగుమతి దిగుమతి వర్తకము, పరిశ్రామికపు పనులు, కాఫీతోటలు మొదలయిన అన్నిరకములపనులు ఈ కంపెనీ చేయుచుండినది. భాగ్యమునకును నమ్మకమునకు పేరెత్తినకంపెనీ ఇదియేనని జనులనుకొనుచుండిరి. ఇట్లుండగా 1906 వ సంవత్సరమున చడిచప్పుడు లేక నొకదినమున ఆర్బతునాటు కంపెనీ దివాలాతీసినదన్న వార్త బయలుదేరెను. నమ్మకముగ నిన్ని సంవత్సరములనుండి యుండుకంపెనీ దివాలాతీసినదన్న వార్త జనులు నమ్మరైరి. కాని వార్త నిశ్చయమయ్యెను, లక్షోపలక్షుల జనులచే నియ్యబడిన ధనమంతయు వెనుక ముందెరుగని జూదము వంటి వ్యాపారమునందు పాడయ్యెను. దేశమంతయు కలతచెందెను. భాగ్యవంతులు నిరుపేదలయిరి. ముసలివారున్నదంతయు పోగొట్టుకొని మరల తిండికొరకు కష్టపడ మొదలుపెట్టిరి. విధవరాండ్రకును, తండ్రిలేని బిడ్డలకును ముష్టియే శరణమాయెను. ఇట్లు దేశమంతయు గొల్లుమనసాగెను. మించిపోయినతరువాత అందరు వివేకులగుట సులభమే కాని ఆలోచించి చూడగా ఆర్బతునాటు కంపెనీనంటిదానిలో డబ్బు దాచిపెట్టుట యెంతయు అవివేక కార్యమని తోచకమానదు. మొదట యిది ఒకని స్వంతకంపెనీ. ఇది యెప్పుడైనను జమాఖర్చుపట్టీని ప్రకటించినది లేదు. అందుచేత దానిస్థితిగతులు యెవరికిని తెలియవు. "మీడబ్బు మాచేతికియ్యండి. మేము జాగ్ర

తప్పెట్టుతాము. మేమేమి చేయునది మీకు అవశ్యకము లేదు.
మాయందు మీరు నమ్మకముంచండి” అనే పద్ధతిమీద లావా
దేవీ జరుగుచుండినది. అందుచేత నమ్మకముగల జనులు ఆర్
బతునాటు కంపెనీ పెట్టెకు పైనుండు కన్నములో డబ్బును
వేసి లోపల యేముండునది చూడక అంతయు సరిగా నున్నద
నుకొనుచుండిరి. ఈ కంపెనీ పెట్టెకు పైనే గాక లోపలకూడ
నొక కన్నమున్నదని జనులెరుగరైరి. పైదెంతపని చేయుచుం
డెనో లోపలిదికూడ అంతపని చేయుచునేయుండెను. 1906 వ
సంవత్సరమున ఆ పెట్టె పగిలినప్పుడు పెట్టెఉత్తదని ప్రజలు
చూచిరి. కాని చేయునదేమియు లేదయ్యెను. ఈ గుడ్డి నమ్మ
కమువల్లనే జనులు తమధనమును ఆర్బతునాటు చేతిలో పో
సి పాడైనది. కాబట్టి పెట్టుబడిదారులందరు ఈ విప్లవమువల్ల
ఒక విషయము గట్టిగ నేర్చుకొనవలయును. ప్రతిసంవత్స
రము ఒకమారుగాని రెండుమారులుగాని తగిన గణితశో
ధకుని (Auditor) చేత కతాయింపబడిన జమాకర్చు పట్టీ
లను ప్రచురపరచు కంపెనీలయందే నమ్మకముంచి వానిలో
నె పెట్టుబడి పెట్టవలయును. స్వాంతకంపెనీలందు ఈ దివాలా
వల్ల అపనమ్మకము కలుగుట సహజము కాని పూరు పేరుగల ప్ర
జల కంపెనీలయందు పెట్టుబడి పెట్టుట కెన్నటికి అపనమ్మక
మిది కలిగింపకూడదు.

ఈ ఆర్బతునాటు దివాలాయందు కూడ పరిశ్రామికత్వ
మందు నమ్మకముపుట్టించు యంశమొకటియున్నది. ఈ కంపె
నీ దివాలాతీసిన తరువాత నిలిచినది ఆర్బతునాటు ఇండస్ట్రీయ
ల్స్ (పరిశ్రమలు). ఈ పరిశ్రమలు ఆర్బతునాటు కంపెనీచేనే

ర్పరుపబడినవి. ఇందు సిమెంటు, ఇటుక, పెంకు, చక్కెర, ఇను
ము మొదలగు యంత్రశాలలు పనిచేయుచుండినవి. ఇవిమాత్ర
ము ఆర్బతునాటు దివాలాతో పోయినవికావు. ఈ పరిశ్రమ
లు మారు పేరుతో (దక్షిణ ఇండియా పరిశ్రమలు) నూతనపా
లనక్రింద పనిచేయుచున్నవి. కాన ఇవి బాగుపడునని తోచుచు
న్నవి. ఆర్బతునాటు దివాలా తీసినపుడు నూరు రూపాయల
ప్రిఫరెన్సువాటాల నడుగువారే లేరు. తరువాత ఇది మంచివ్యాపార
మగుటచేత త్వరలో నూరు రూపాయిలవాటా 50 రూపాయ
లయినది. 1910 సంవత్సరము మే నెలలో వాటాయొక్క ధర
75 రూపాయలకెక్కినది. ఇక కొంతకాలములో అసలుధరను
మించుననుట నిశ్చయము. కాబట్టి అర్బతునాటు దివాలా పరి
శ్రామికపు పెట్టుబళ్ళయందు అపనమ్మకము పుట్టించుటకు
బదులు సరియైన పరిశ్రామిక కార్యములందు భయమేమియు
లేదనుటకు గొప్పనిదర్శనమైనది.

వారివారి కుటుంబములకొరకు ధనమునార్జించు నిష్టయేకా
క ఆ యార్జనయందు దేశసంపదనుకూడ వృద్ధిచేయు దేశాభి
మానపుటాసకలిగి పనిచేయునట్టి దేశీయుల పరిశ్రామిక సమా
జములు (Industrial Companies) పట్టణములందును పల్లెలయం
దును బయలుదేరెనేని మనదేశము పరిశ్రామికవిషయము నం
దు మహోన్నత దశకు వచ్చుననుట నిశ్చయము.

సర్వవిషయములకును సహాకారము అవశ్యకమగుటచేతను
ఈ సహాకారభావము మనదేశములందు అంతగా నుండకుండు
టచేతను దీని ప్రాముఖ్యమును గూర్చియు దాని యుపయోగ
మునుగూర్చియు బాపట్లలోని రెవరెండు జి. యన్. థామ్సన్

(Rev. G. N. Thomssen) గారు మదరాసు మైల్ పత్రికకు 1912 సం॥ మే 20 తేదీన నొక వ్యాసము వ్రాశియున్నారు. దానిసారాంశమిందు పొందుపరచుచున్నాము. సహకారచర్య (movement) మనదేశమున అవశ్యకమైనట్లు యేదేశమునకును ఆవశ్యకముకాదు. పది సంవత్సరములనుండి ఆహారపదార్థముల ధరలు యెక్కువగుటచేత మన దేశమున పనివాండ్రు మరింత బీదవారగుచున్నారు. సహకారమువలన ప్రజలకుకలుగులాభములను నిరూపించుటకు మనదేశముతప్ప ఇతరదేశమేదియు అంతతగినదికాదు. ఆహారపదార్థములింతలో చౌక అగునట్లు తోపదు. ఎందుకనిన వానికి గిరాకీ యెక్కువగుచున్నదేకాని తగ్గుటలేదు. ఇందుకు తోడుగా మంచిరస్తాలు, ఇనుపదారులు మొదలగు రాకపోకల సాధనములు అధికములగుటచేత పదార్థములు సులభముగా దూరదేశములకు పోవుచున్నవి. పూర్వకాలమున కాలువలుగాని ఇనుపదారులుగాని ఇన్నియుండలేదు. ఉండిన కొన్నిరస్తాలు వానకాలములో దిగబడిపోవుటవల్ల పనికిరాకుండినవి. ఇందుచేత యెక్కడపండిన పంట అక్కడనే వాడుకలోనుండవలశి యుండెను. ఇప్పుడీ ప్రయాణసౌకర్యములు యెంత యద్భుతముగా వృద్ధియయినవో గడచిన 30, 40 సంవత్సరములలో దేశాభివృద్ధిని గమనించినవారు తెలిసికొనగలరు. ఇందుచేత జీవనముయొక్క విలువ యెక్కువయినది. 30 సంవత్సరములక్రింద పావలాబియ్యము ఆలుమొగనికి వారమురోజులు వచ్చుచుండినవి. ఇప్పుడు పావలాబియ్యము రెండురోజులకేచాలవు. పనివారల భత్యముకూడ కొంత యెక్కువయినదికాని అది మిక్కిలి కొంచెము. ఇట్టి

స్థితిలో బీదవారికెట్లు జీవనము జరుగునో ఇది ఆశ్చర్యవిషయము. వీరిగతి ఇట్లుండగా కొందరు భూస్వాములు అధికభాగ్యవంతులగుచున్నారు. భూమిగలవారు పూర్వముకంటె కొంత భాగ్యవంతు లయినారనుట ఇప్పటి సంగతులనుబట్టి చూడగా నిశ్చయమని దోచుచున్నది.

భాగ్యవంతులకు భాగ్యమధికమగుచున్నది. బీదవారు మిక్కిలి బీదలగుచున్నారు. ఇది పూర్తిగా నిజము కాకపోయినను ఇందు కొంత సత్యమున్నది. మొత్తముమీద జనులకు తొందర యెక్కువగానున్నది. జనాభాను బట్టిచూడగా క్షామడాంబరములుండినను మనదేశమందు జనసంఖ్య యెక్కువగుచున్నదని తెలియుచున్నది. ఇక్కడినుండి ఒకమారు పదికోట్లజనమును ఇతరదేశమునకు పంపగలిగితిమేని మనల పీడించుచున్న చిక్కులన్నియు తేలిపోవును కాని ఇది సాధ్యము కానిపని. ఇట్లుచేయుటవల్ల ఆ దేశముల కెంతయో మహోపకారమగును. ఉత్తర ఆస్ట్రేలియాలోను పసిఫిక్ దీవులలోను జనులులేక బీడుపడియుండు సారవంతమైన భూములందు ఈ పదికోట్లజనులు సులభముగా నివసింపగలరు. ఇండియాయందు అత్యధికజనసంఖ్య యుండునపుడు ఇట్టి దేశాంతరగమనము తప్పక జరుగునుకాని ఆ కాలమిప్పటికి రాలేదు. ఇప్పుడైనను ఈ మహాదేశముయొక్క అద్భుతమైన స్వభావ సంపదను అభివృద్ధిచేయగలిగితిమేని ఇంకను అనేకకోట్ల జనసంఖ్యను మనదేశమే పోషింపగలదు. ఇట్టి అభివృద్ధిచేయుటకు మూలధనము కావలయును. దీని నెటుల ఉత్పత్తి చేయవలయును? ఎటుల భద్రము చేయవలయును? ఈ అద్భుత సంపద యెట్లు అభివృద్ధి కాంచగల

దు? బీదవారినెట్లు దీనదశనుండి లేవదీయవచ్చును? వ్యాను ఫాక్చరయిన పదార్థములెట్లు అమ్మకమునకు తేవచ్చును? యంత్రములు స్థాపించు టెట్లు? ఇత్యాది ప్రశ్నలకన్నిటికిని ప్రత్యుత్తరము సహకారము, సహకారము, సహకారమే.

సహకార ఋణచర్య (Co-operative credit movement) మన దేశమున పుట్టినదికాని ఇప్పటికిని ఇది శైశవదశయందే యున్నది. నమ్మకమే మూలధనము అను సిద్ధాంతమునుబట్టి ఈ సహకారఋణపద్ధతి ఏర్పడవలయును. ఈ గొప్ప సిద్ధాంతమును బట్టియే జర్మనుదేశపు మహోపకారియగు రఫ్ఫెసన్‌గారు వ్యవసాయదారులయొక్క ఆర్థికసమస్యలను సాధించిరి. దీనినిబట్టియే జర్మనుదేశపు పట్టణవాసులయొక్క ఆర్థికస్థితిని గూర్చి కొందరు తగినయేర్పాటు చేసినది.

మన దేశమునందు రైతుకు జీవనాధారము సంవత్సరాంతమున పండిన ఫలమే. పట్టణములలో నుండువారలకు సరుకులు త్వరగా నగదుకు అమ్ముడుపోవును గనుక పట్టణములలోని చిన్నవర్తకులకంటె రయితునకు యెక్కువ మూలధన సహాయము కావలసియుండునుకదా! గ్రామవాసియగు రయితునకును పట్టణవాసియగు వర్తకునకును వారి వారి వృత్తివల్ల లాభము కలుగవలయునేని, ధనసాహాయ్య మత్యావశ్యకము. నమ్మకమైన ప్రతివానికిని సహకారఋణపు బ్యాంకిమాత్రమే ఈ సాహాయ్యము చేయగలదు. ఈ బ్యాంకులు బాగుగా పనిచేయుటకు ధనవంతులిందుచేరి బీదలకు సాయము చేయవలయును. ఎందుకనిన అప్పులు అందరి పూచీమీదగాని యియ్యబడవు. ఈవిషయమై మనదేశమున యెక్కువపని జరుగవలసియున్నది.

నమ్మకముగల బీదవానికి భాగ్యవంతుని సాయముదొరికినయెడ ల బీదవాడు త్వరలో జరుగుబాటుగలవాడగును. ఇట్టి గొప్పవి షయమై సంఘసంస్కర్త లెన్ని యుపన్యాసములైనను ఇయ్య వచ్చును. ఎంతపనిచేయుటకైనను ఆస్పదమున్నది. సహకారపు బ్యాంకు లేర్పాటుచేయుటయందు బీదవారును భాగ్యవంతులు ను యెక్కువగా తోడుపడినయెడల కావలసినంత మూలధన మేర్పడి గ్రామచర్యలలో (rural movement) ప్రతిదానిని జరుపు టకు తగినంత ద్రవ్యముండును.

సహకారము ప్రజల కెంతమేలు చేయగలదో వానిని బాపట్ల సహకారసంఘము నిరూపించి చూపినది. మూలధన మేమియు లేక దాని జయమునైనను కోరువారులేక కొంచ ము నేలతో ఈ సంఘము తనసహకార ప్రయోగమును (Co-operative experiment) చేసి చూపుట కారంభించినది. ధనాఢ్ యులలో చాలమంది ఈ ప్రయోగమును ఉపేక్షతో చూచుచుండి రికాని కొంచమైనను తోడుపడరైరి. దొరతనమువారు మాత్ర ము సాయముచేసిరి. వీరి సాయమే లేనియెడల ఈ ప్రయోగము తప్పిపోయి యుండునేమో. వీరు సాధ్యమైనంతవరకు ప్రజలకున ష్టము రాకుండునట్లు అన్నివిధముల చూచుచుండిరి. ఒకపెద్ద మురుగుకాలవయు ఒకపంటకాలువయు ఇంజనీరింగు డిపార్టుమెం టువారు త్రవ్వుటవలన పెరుగుచుండు పైరునకు నీరు సమృద్ధిగా పారి యెక్కువైన నీరు మురుగుకాలువ గుండా పోవుటచేత నేల యందు నీరు నిలువకుండెను. దొరతనమువారు ఆయూరి పెంట నంతయు ఈ సంఘమువారికి అమ్ముచుండిరి. సంఘమువారాపెం టను గోతులలోవేసి ప్రజల దేహారోగ్యమున కేమియు అపాయ

ము లేకుండునట్లు దానినుండి శాస్త్రీయముగా (Scientifically మంచియెరువును తయారుచేసిరి. కాని ఉపేక్షచేతను దురభిమానముచేతను ఈ యెరువును బండ్లతో పొలములకు తోలుటకు సాగుబడిచేయు రైతులు నిరాకరించుట చేత ఈ సంఘమువారే ఆ పనిని చేయించిరి. ఈ సంవత్సరము పంట నాలుగురెట్లు పండినది. శాస్త్రీయపద్ధతిప్రకారము తయారైన యెరువువలని లాభము అనుభవపూర్వకముగా రైతులకు చూపుటకై సంఘమువారీ భూమిలో నొకభాగమున రయితుల దొడ్లలోని యెరువును వేసి దాని సమీపభాగమున సంఘమువారి యెరువునువేసి పంటవేసిరి. రెండవదానియందు మూడురెట్లుపంట పండెను. ఇందుకు కారణమేమి? దొడ్లలోని యెరువు సూర్యుని వేడిమికి యెండిపోవుటచేత దాని సత్తువ చచ్చినదని అనుభవరీత్యా రయితులకు చూపిరి.

ఈ సంఘమువారి ప్రోద్బలము చేత పశువులపెంచు పద్ధతులుకూడ బాగుపడుచున్నవి. ఇప్పుడిప్పుడు మూలధనము నుత్పత్తి చేయుచున్నారు. త్వరలో మంచిలాభము భాగస్వాములకియ్యగలరని తోచుచున్నది. భారతీయుల ఆర్థిక సమశ్యలనెట్లు సాధించవలయునో ఈ సంఘమువారు అనుభవసిద్ధముగా కొంతవరకు చూపించియున్నారు.

ఇప్పుడు మన దేశమునందు జనహిత పరాయణులగువారు బయలుదేరి సహకారవిషయమును శ్రద్ధతో చదివి అది బాగుగ పనిచేయునట్లు తగిన యేర్పాటులు చేయవలయును. ఈ విషయమై యొకవార్తాపత్రికా సంపాదకుడొక డిట్లు దైన్యముతో వ్రాయుచున్నాడు. "మన దేశమునందంతటను మూఢత్వ

ము రాజ్యము చేయుచున్నది. దీనిని పోగొట్టుటకు వేలకొలది జనులు పనిచేయవలయును. కాని మన దురదృష్టముకొలది శ్రద్ధగా పనిచేయువారు మన దేశములో మిక్కిలి తక్కువగ నున్నారు. మనకాలోచన లెక్కువయే కాని కార్యములు మిక్కిలి తక్కువ. ఈ యుదాశీనభావమే మనయైహిక నైతికాభివృద్ధుల కడ్డగింపుచున్నది.''

ఈ లోపములు మన దేశమునందే కాదు అన్ని దేశములందును ఉండును. ప్రతిదేశమునందును శ్రద్ధగలిగి స్వార్థత్యాగపరాయణులై పనిచేయు వారరుదుగనేయుందురు. మనదేశమున ఉదాసీన భావము లేక శ్రద్ధతో పనిచేయువారు కొందరైనను ఉన్నారనుట శుభశూచకమే. వీరు నిలిచి పనిచేశిరేని తమ భక్తిశ్రద్ధల చేతను మనోనైర్మల్యము చేతను దయారస పూరితములగు వాక్యముల చేతను ఇతరులయం దుత్సాహము కలిగించి దేశోపకారులగుదురు. దేశసంపద యెక్కువగును. బీదలెట్లు కరువుకాలములలో జీవింపగలుగునది సహకారము వెల్లడిజేయును.

## మూడవ ప్రకరణము.

## స్వదేశీయ మతము.

'స్వదేశీజం' (Swadesism) అనుపదము ఇటీవల వాడుకలోనికివచ్చినమాట. దీనికర్థము స్వదేశాభిమానమనియు, స్వదేశీమతమనియు చెప్పవచ్చును. అనగా స్వదేశమున నుత్పత్తి యయినట్టియు స్వదేశమున తయారుచేయబడినట్టియు పదార్థములను కొని తమ దేశాభిమానము చూపవలయునను మత

మే స్వదేశీయమతము. కాని స్వదేశియనుటచేత అరాజకుడని యర్థము లేదు.

స్వదేశీయ మతబోధకులవల్లనేమి, స్వదేశీయ కరపత్రముల వల్లనేమి చదువువచ్చిన ప్రతివానికిని స్వదేశమతమన నేమి యో తెలిసియేయున్నది. ఈ గొప్ప విషయమునందలి ముఖ్యాంశములు అందరెరిగియుండినను దీనినిగూర్చి కొన్ని విషయములు చర్చించుట యుక్తమని తోచుచున్నది.

ఇతరమతములవలె స్వదేశీయమతము వట్టిమాటలతో ముగియకుండుట కొంత తృప్తికరము. స్వదేశీయ మతబోధకుల మాటలు అరణ్యరోదనము లయినవికావు. వానిని ‘‘మే మేమో చెప్పితిమికాని జనులు విని యూరకుండిరి. మే మేమిచేయవచ్చును’’ అనివక్తలు వగచుట కవకాశము లేదు. ఏలయనగా వినినజనులందరు స్వదేశీయమతము తమకు సమ్మతమని కరతాళధ్వనులతో వక్తల సంతసింపచేసి వట్టిధ్వనితో అంత్యము చేయక తమ కార్యములవల్ల అనగా విదేశవస్తువులకు బదులు స్వదేశవస్తువుల పరిగ్రహించుటవల్ల స్వదేశీయమతమందు తమకుండు నమ్మకమును వెల్లడిచేసిరి.

అప్పుడప్పుడు ఈ కాలమున జరుగుచుండు జనచర్య (Public movement) లలోనెల్ల స్వదేశీయ మతచర్య యెక్కువ నిజమైనదనుటకు ప్రజలకార్యములే నిదర్శనములు. ఒక మహాజనుడు గతించినపుడు అతనిని పొగడి ఆతని జ్ఞాపకార్థమై ఏదేని నొకదానిని స్థాపించుట కొక తీర్మానమును సభికులందురు ఏకకంఠ్యముగ చేయుదురు. చందాలపట్టి తిరుగునపుడు చలోని సంఖ్య మిక్కిలి స్వల్పమగును. ఈ కొద్దిచందాలు

కూడ కేవలము వాగ్దానములకు దిగి కడపట వసూలుకాని చందాల పట్టియె ఆ మహాజనులకు (Memorial) జ్ఞాపకమగుచున్నది. సంఘసంస్కరణ చర్యయందుకూడ నిట్టులే. సంఘసంస్కరణసమాజముతరఫున నియ్యబడిన ప్రసంగము, ఉత్సాహమును అంగీకారమును చూపు కరతాళధ్వనులతో అంత్యమగునేకాని ఇట్లుత్సాహము చూపినవారలలో నొకడు వారముగోజులలోపల బాలవితంతువగు తనకోడలి తల గొరిగించుటకు మంగలిని పిలువనంపుచుండును. మరియొకడు యిరుగుపొరుగు వారల మెప్పుకొరకై తన పెద్దకొమార్తెయొక్క పెండ్లి మిక్కిలి వైభవముతో జరిపి తన సంసారమును గుల్లచేసి ముష్టిదశకు తెచ్చుచుండును. మూడవవాడు కొంచము విస్కీ (Whisky) సోడాల త్రాగుడు ప్రారంభించి ఆనందించుచుండును. కాని స్వదేశీయ మతబోధకుల నుగ్గడించిన వారటుకాదు. వారు చప్పట్లుకొట్టినపుడు వారి చేతులుమాత్రమే ధ్వనిచేసినవి కావు. వారి హృదయములుకూడ ఉత్సాహముతో కొట్టుకొనినవి. దేశీయ పదార్థములను కొనుటయందు తమధనమును వినియోగించుటచేత దేశమాతయందు తమకుండు దయాగౌరవములను కార్యములచేత వెల్లడిచేసిన వారైరి. కావున యిట్లు కార్యశూరులై తమ దేశాభిమానమును అత్యద్భుతముగ చూపి తమమేలు నెరిగిన వారివలె మెలగినట్టి పుత్త్రుల బడసిన దేశమాత నెంతయు బహూకరించవలయును కదా!

స్వదేశమతమునందు తప్పేమైన కలదా? ఎవరైనను స్వదేశ వస్తువులనేగాని విదేశవస్తువుల వాడుటలేదని తీర్మానించుకొనిరేని ఇందేమైనను నేరమున్నదా? ఇట్లే ఒక జాతీయులు తమ

జాతీయ పదార్థముల యమ్మకములే ప్రోత్సాహపరచిరేని ఇం దేమియు నేరముమోపుట కాస్పదముండదుకదా! ఇందుకు దా హరణము. మన బ్రిటిషు సామ్రాజ్యమునందిట్టి ఏర్పాటొక్కటి కనబడుచున్నది. బ్రిటిషుసామ్రాజ్యములో తయారయిన సరు కుల యమ్మకమునకు ప్రోత్సాహము కలిగించి ఉత్పత్తిదారు లకును మ్యానుఫాక్చరు దారులకును వారిమూలమున సా మ్రాజ్యమునకును మేలుచేయవలయునని యుండువారు కొం దరు మహాజనులు కలరు. వీరికి సామ్రాజ్య సంరక్షకులని పేరు. (Imperial Protectionists) వీరు చేయునదేమి? "మన సామ్రాజ్యములో నుత్పత్తియగు పదార్థములుండగా, మన సా మ్రాజ్యములో పరిశ్రమలు జరుగుచుండగా, ఇతర సామ్రాజ్య ములందు తయారైన సరుకుల నేల వాడుకజేయవలయును? మన సామ్రాజ్యములోని పదార్థములకే వాడుక యెక్కువ చేసినయెడల ఉత్పత్తిదారులకేమి పరిశ్రామికులకేమి మేలుచే సినవారమగుదుముకదా! ఇందువల్ల దేశసంపద యెక్కువగును కదా! పనివారలకు జీవనోపాయము లభించునుగదా!" యని వీరు వాదించుచు ఎన్నియో ప్రయత్నములు చేయుచున్నారు. ఇందొక్కటి 'All British Shopping Week' అను గొప్పసంత జరుపుట. అనగా వారమురోజులు జరుగు నీ సంతయందు బ్రిటి షుదేశములో తయారైన సరకులనే ప్రదర్శించునటుల తీర్మా నముచేసికొనుట. దీని యభిప్రాయమేమి? దుకాణదారులంద రు దేశాభిమానులై స్వదేశపుసరుకులు తప్ప విదేశపుసరుకులీ సంతయందు అమ్మకుండుటయు, కొనువారందరు దేశాభిమా నులై తమకు కావలశిన యన్నిపదార్థములను ముందుగానే

కొనునట్లు ఏర్పాటుచేసికొనుటయు ముఖ్యవిషయములు. దీని వల్ల తేలునదేమి? జనులందరు వారమురోజులైనను దేశాభిమానముగలవారై యుండవలయుననికదా?

మరియొక విషయ మాలోచింతము. వర్తకపుగుర్తుల చట్టము (Trade Marks Act) ప్రకారము ప్రతివస్తువు ఎచట తయారైనదియు ఆవస్తువుమీఁద కనుపరచవలయును. అనగా జర్మనీలో చేయబడినదనిగాని' ఆస్ట్రియాలో చేయబడినదని' కాని ప్రతివస్తువుమీఁదను ముద్ర యుండవలయునని ఈ చట్టము విధించుచున్నది. దీని యర్థమేమి? కొనువారికిది విదేశపుసరుకనియు ఇది స్వదేశపుదనియు భేదము చూపవలయుననియే కదా ఈ చట్టముయొక్క యభిప్రాయము. ఇది స్వదేశమత నియమముల (Swadeshi Principles) ననుసరించి యున్నది కదా? వీనినిబట్టికూడ ఆంగ్లప్రభుత్వమువారియందు స్వదేశమతప్రయత్న మున్నదనుట నిస్సందేహము, కావున హైందవులు కూడ స్వదేశమతమవలంబించుట యందేమియు తప్పులేదు. కాని కొన్ని విషయములు మాత్రము గమనింపవలయును.

స్వదేశప్రతిజ్ఞవల్ల లాభ నష్టముల నాలోచింతము. స్వదేశప్రతిజ్ఞయనగా స్వదేశవస్తువులనే కొనుట. స్వదేశప్రతిజ్ఞ యొక విధమైన సంరక్షణము. సంరక్షణ మనగా నేమియో చూతము. మన దేశమునకు జపానునుండి గడియారములు యెగుమతియగుచున్నవనుకొందము. వీరు యంత్రసహాయముననో మరియే కారణముచేతనో సులభధరలకు గడియారములు చేసి మన దేశమున అమ్ముచుండుటచేత మనదేశమందు గడియారములు చేయువారలు అనేక ధరలకు గడియారములు కన్న లాభము

సంపాదించలేక గడియారములు చేయుట మానివేయవలశి వచ్చును. అనగా జపానువారి పోటీవల్ల మనదేశపు గడియారపు పరిశ్రమ అడుగంటినదగును. ఇట్టి స్థితియందు దొరతనము వారొకపని చేయవచ్చును. ఏమనగా జపానునుండి దిగుమతి యగు గడియారములమీద నూటికింతయని సుంకముకట్టుదురు. జపాను గడియారము మనదేశమున 10 రూపాయల కమ్ము చుండినదనుకొందము. ఈ సుంకముండు నంతకాలము జపాను వారు 10 రూపాయలకే అమ్మినేని వారికి లాభము గిట్టదు. కావున వారు గడియారముఖరీదు యెక్కువచేయవలశియుండును. ఎంతయెక్కువ చేయునదియు సుంకమునుబట్టి యుండును. సుంకము నూటికి నూరనుకొందము. ఇట్టిస్థితిలో జపాను గడియారములయొక్క వెల సుమారు 18 రూపాయిలు కావచ్చును. మనదేశములో తయారయిన గడియారములు జపానుగడియారములంత మంచివయి 15 రూపాయలకే విక్రయమగు చుండెనేని మనదేశపు గడియారములకే గిరాకీ యెక్కువగును. అందుచేత గడియారపు పరిశ్రామికులు విశేషలాభమును సంపాదించుకొనకపోయినను నష్టము పొందక, వచ్చిన లాభముతో మంచి యంత్రములను కొనిగాని, యెక్కువ సమర్థతగల పనివాండ్ర నుద్యోగించిగాని ఉత్పత్తి యెక్కువచేశి తక్కువధరలకే అమ్ముస్థితికి రాగలిగిన తరువాత దొరతనమువారు జపానుదేశపుగడియారముల దిగుమతిమీాది సుంకమును తీసివేయుదురు. అటుపిమ్మట మనదేశపు వర్తకులు జపానువారితో సరిసమానముగా పనిచేయవలసియుండును. ఇందు దొరతనమువారు చేసినసాయమునకు సంరక్షణ మనిపేరు (Protection). పైనిచెప్పి

ఏ విధముగా విదేశవస్తువులమీద సుంకము వేయుటకు బదులు బోనసులు లేక బౌంటీలు (Bonuses and Bounties) అను పేరున కొంత విరాళము దొరతనమువారు పరిశ్రమికుల కియ్యవచ్చును. ఈ ధన సహాయముచేత విదేశపు పోటీయున్నను మంచిప వారల నుద్యోగించి కొంతకాలములో చౌకధరలకు సరుకుల ను తయారుచేసి పరిశ్రమను జయప్రదముగా జరుపుటకు వీలుండును కావున నిదియుకూడ నొకవిధమైన సంరక్షణమే యగును. మొదటిపద్ధతి ప్రకారము దొరతనమువారే నష్టమును పెట్టుకొందురు.

ఇటుగాక విదేశవస్తువులు చౌకగా నుండినను స్వదేశవస్తువులమీద ప్రేమచేత జనులు విదేశవస్తువులను మాని స్వదేశపు వానినే కొనుచుండినయెడల స్వదేశపుపరిశ్రమలు వృద్ధియయి కొంతకాలమునకు విదేశవస్తువులంత చౌకగా స్వదేశవస్తువులు కూడ తయారగును. అప్పుడు స్వదేశవస్తువులు విదేశవస్తువుల పోటీకి భయపడవలసిన పనియుండదు. కాన స్వదేశప్రతిజ్ఞ కూడ నొకవిధమైన సంరక్షణమేయగును. అనగా దొరతనమువారిచే విధింపబడిన సుంకములు బౌంటీలు పరిశ్రమల కెంత సంరక్షణమిచ్చునో స్వదేశప్రతిజ్ఞయు కూడనంత సంరక్షణ మిచ్చుననుట స్పష్టము. ఫలితమునందు దొరతనమువారి సంరక్షణయు ప్రజల స్వదేశప్రతిజ్ఞయుఒకటియే యైనను ఈ రెంటికి కొంత భేదము కనబడుచున్నది. రెండవపద్ధతి జను లేర్పరుచుకున్నదే కనుక వారు మనఃపూర్వకముగా నెక్కువ ధరలిచ్చి తమ దేశాభిమానమును చూపుచున్నారు. దొరతనమువారి సం

రక్షణముచేత ధరలందరికిని ఎక్కువగనుండును కనుక బీదవారల కిది కొంత కష్టముగ నుండకమానదు.

స్వదేశప్రతిజ్ఞ ఉచితమా? అనుచితమా? ఈ ప్రశ్నకు జవాబు చెప్పుట స్వేచ్ఛావ్యాపారము (Free Trade) మంచిదా! సంరక్షణము (Protection) మంచిదా? యను ప్రశ్నలకు జవాబిచ్చుటయేగనుక సంరక్షణ ముచితమయ్యేనేని స్వదేశప్రతిజ్ఞకూడ యుచితమేయగును. ముఖ్యముగా మన దేశముననుండు పరిశ్రమలలో దాదాపుగా నన్నియును శైశవదశయందుండి శైశవబాధలతో చిక్కులు పడుచున్నవి. ఈ దశ దాటి బ్రతుకగలిగనేని పరిశ్రమలన్నియు ఆరోగ్యదశయందుండుననుట నిశ్చయమె. కాని ఈ శైశవదశయందు సంరక్షణరూపమున నేదోయొక పుష్టికరమైన ఆహారముండక తప్పదు. ఇది సత్యమని ఆర్థికశాస్త్రవేత్తయగు జాన్ స్టూవర్టు మిల్లుదొరగారే కాక (John Stuart Mill) స్వేచ్ఛావ్యాపార పరాయణులలో (Free Traders) ననేకులుకూడ అభిప్రాయపడియున్నారు. ఇట్టి సంరక్షణము నిచ్చు స్వదేశప్రతిజ్ఞ మన పరిశ్రామికత్వమున కెంతయు తగినదనియే చెప్పవలయును.

ఈ విషయమును బాగుగా నాలోచింతము. శైశవదశయందుండు భారతపరిశ్రమలకు ఏదోవిధమైన సంరక్షణము లేనిదే అవి కౌమారదశకు రాజాలవని చెప్పితిమి. ఇందుకుదాహరణముగా గాజు పరిశ్రమ నాలోచింతము. గాజుపరిశ్రమకు కావలశినపదార్థములన్నియు మన దేశమునందున్నవి. కాని ఆస్ట్రియాదేశము చాలకాలమునుండి పనిచేయుటచేత, అచటి పనివారలు ఎక్కువ యనుభవముగలవారై, గాజువర్తకము నంతయు తమ గుత్త

పమున బోనసుగా పరిశ్రామికుల కిచ్చుచున్నారని విశదము కాగలదు.

మరియొక ముఖ్యవిషయము.

ఈ స్వదేశమతమును గురించి చెప్పవారొక విషయము ముఖ్యముగా గమనింపవలయును. భూమిలో పండు పంటగాని యంత్రములందు తయారగు సరుకులుగాని విదేశపదార్థము లన్నంతమాత్రముననే వానిని విసర్జించవలయునను అభిప్రాయము మిక్కిలి తప్పైనదని ముమ్మాటికి చెప్పవలయును. ఇట్లు విసర్జించుట అర్థశాస్త్రసమ్మతముకాదు. కేవలముతప్పు స్వదేశమతమని చెప్పకతప్పదు. ఏలయన సృష్టియందు అన్ని దేశములు ఏకరీతిగా నుండుటలేదు. కొన్ని దేశములందు కొన్ని పంటలు మాత్రముపండును. కొన్నిటియందు కొన్నిపదార్థములు పండవు. ఇందుచేత ఆయాదేశములందు పుష్కలముగాపండు పదార్థముల నభివృద్ధిచేసి వానిని విదేశములకు పంపి వాటికిబదులు మనదేశమునలేని పదార్థముల తెచ్చుకొనుట అర్థశాస్త్రసమ్మతము; ఇంగితజ్ఞానసూచకము; జాతీయ కర్తవ్యము. „మనదేశము చిన్న దేశము కాదు. ఇందనేక దేశములున్నవి. వివిధములైన శీతోష్ణస్థితులందుండి రకరకమైనపంటల నిచ్చుచున్నది” అని జ్ఞాపకము తెచ్చుకొని స్వదేశప్రతిజ్ఞ మనదేశమున నేల జరుపరాదని జనులనుకొనవచ్చును. ఇందు కొంత నిశ్చయము లేకపోలేదు. మనదేశమునందు అసమానమైన నైసర్గిక సంపదయున్నదనుట వాస్తవ్యము. ఇందుచేత స్వదేశప్రతిజ్ఞ కొనసాగుటకు వీలున్నదని చెప్పవలశినదే కాని మనదేశమున పదార్థములు చౌకగా దొరకుచున్నవా యను విషయ మాలోచింపవలయు

ను. ఇందుకొక యుదాహరణ మాలోచింతము. మన దేశమున ఇనుప ఓరు (Iron ore) కావలసినంత యున్నది. కావున మనదేశమున తయారగు ఇనుపసామగ్రినే మనముపయోగింపవలయుననుకొనుట గొప్పతప్పుకదా. నైజసంపద యుండినను దానిని ఉపయోగమునకు తగిన పదార్థములుగా చేసికొనుటయందు కొంతశ్రమయున్నది. వీని నెవరు చౌకగా చేయగలరో వారివద్ద కొనుట మంచిదికాని కేవలము స్వదేశీయమతముపేర వానిని విసర్జింపుట కానిపని. కాబట్టి ముఖ్యావశ్యకములగు పదార్థములను మన దేశముననే చౌకధరలకు తయారుచేసి మనదేశములోని జనులందరికిని పంపగలుగునంతవరకును విదేశవస్తువులన్నంత మాత్రము వానిని విసర్జన చేయుటతగదు.

శైశవయందుండు పరిశ్రమలకు సంరక్షణ మావశ్యకమని చెప్పితిమి. స్వేచ్ఛావ్యాపార నియమముల ననుసరింపక సంరక్షణనియమము ననుసరించుటవల్ల ఎల్లప్పటికిని మేలే కలుగునని చెప్పవీలులేదు. ప్రాణుల కన్నిటికిని శైశవదశయందు సంరక్షణమావశ్యకమేగాని కొంతకాల మయినతరువాత ఈ సంరక్షణము మేలు చేయుటకు బదులు కీడు చేయును. స్వబుద్ధియు, స్వశక్తియు, స్వయంసహాయమును పోయి నరుడు సూత్రధారుని చేతిలోని బొమ్మవలె నాడుచుండునుకాని కష్టసమయములందు స్వశక్తిని వినియోగించి తానుగా పనిచేయచాలకుండును. పరిశ్రమలయందుకూడ సంరక్షణము హద్దు దాటినతరువాత మేలుచేయుటకు బదులు కీడే పొసగించును. ఎట్లనగా ఒక గాజు పరిశ్రమను స్థాపించితి మనుకొందము. ఈ పరిశ్రమ శైశవయందుండుటచేత సంరక్షణ మావశ్యకముగ నుండును. దీనంజేశి

స్వదేశపు గాజుసామానులకు గిరాకి యధికమై ఫాక్టరీలు బయలుదేరును. పనివాండ్రెక్కువగుదురు. పరిశ్రమ బాగుగ జరుగుచునుండును. కాని సంరక్షణ మెంతకాలముండును? సంరక్షణ యుండుకాలముననే విదేశపుపోటీకి తగినట్లు పనిచేయు సత్వము సంపాదింపనియెడల సంరక్షణముడుగగానే సరుకులధర లెక్కువయి గిరాకి తక్కువగును. ఫాక్టరీలు మూయబడును. వేలకొలది పనివాండ్రు గొల్లుమందురు. పరిశ్రమలు వెనుకపడిపోవును.

ఇట్టులే ఉన్నట్టుండి బయలుదేరు స్వదేశమంత్రోత్సాహము కూడ ననర్థము కలిగింపవచ్చును. ఈ యుత్సాహ ముడుగగానే స్వదేశవస్తువులకు గిరాకీ తగ్గిపోయి పరిశ్రామికులకు నష్టము కలిగించును. ఇట్టి చిక్కులు కొన్నిచోట్ల కలిగినను మిగతభాగములందు స్వదేశాభిమానమిచ్చిన మాటునవలన స్వదేశవస్తువులు విదేశవస్తువులంత మంచివేయని స్థిరపడినదని తలంతము.

స్వదేశమతము కేవలము ఒకచిత్తవృత్తియని (Sentiment) యెరుగుట మిక్కిలి ముఖ్యమయినవిషయము. ఇది యెంతకాలముండునది యెవరు చెప్పగలరు? మన జీవనముమిథ్య కాదు. ఎంత శ్రమపడినకదా జీవనము గౌరవముగాజరుగుట. ఇట్టి స్థితియందు వట్టిచిత్తవృత్తి యెంతకాలము పనిచేయును! తిండికిచాలక జీవనోపాయముకొరకై పలుకడగండ్లు పడుచుండువారు చౌకగాదొరకు విదేశపదార్థములను వదలి కేవలము చిత్తవృద్ధియగు స్వదేశమతమునకై యెక్కువధరలనిచ్చి స్వదేశవస్తువులను కొందురా? ఇప్పుడిప్పుడు కనులు విప్పుచుండు పరిశ్రమాభివృద్ధికొరకు మహోత్కృష్టమైన చిత్తవృత్తియగు దేశాభిమానము తోడుపడవలశినదే కాని యెంతకాల మీచిత్తవృత్తి పేరున డబ్బుక

ట్టు చేయనగును? ఈ ప్రపంచమున జీవనమునకై యుద్ధములు
జరుగుచుండు వారలు చిత్తవృత్తికై యెక్కువధనము వెచ్చపె
ట్టుట కష్టముకదా. కాబట్టి స్వదేశమతమువల్ల దేశాభివృద్ధి
కావలయునేని స్వదేశవస్తువులు విదేశవస్తువులవలె నాణ్యముగా
నుండుటయేగాక యెక్కువ చౌకగాకూడ నుండవలయును. లే
దా సమానవెలకైనను దొరకుచుండవలయును. లేకుండినయె
డలమనదేశపు పరిశ్రామికత్వము అపనమ్మకస్థితిలోనికి దిగునని
వేరుగా చెప్ప పనిలేదు.

మరియొకవిషయము గమనింపవలయును. ఇటీవల స్వదేశీయ
మహోత్సాహము వెల్లడియైనపుడు స్వదేశమతబోధకులు, కొ
నువారికి దేశాభిమాన ముండవలయునని మొరపెట్టిరి కాని
అమ్మువారలకును వ్యాపారస్థులకు చేయువారికిని దేశాభిమా
నముండవలయునని చెప్పరైరి. స్వదేశమత మనోరథమీడేరుట
కు ఇదియొక ఆలశ్యకారణమైనది. ఎందుకనగా స్వదేశమతో
త్సాహమెక్కువగా నుండుకాలమున కొనువారు స్వదేశవస్తు
వులనే గ్రహించుచుండిరి. ఆ సమయము కనిపెట్టి చిన్న చిన్న
వ్యాపారస్థులు దారులేమి, వర్తకులేమి దురన్యాయమైన లా
భమును సంపాదింప నెంచి స్వదేశవస్తువులని పేరుపెట్టి పనికిరా
ని వస్తువులకుకూడ ధరహెచ్చించిరి. విదేశవస్తువులను తెచ్చి
స్వదేశవస్తువులని అమ్మిరి. స్వదేశీయనుమాట వార్తాపత్రికా
ప్రకటనలందుపయోగించి యెక్కువడబ్బు లాగుటకు ప్రయత్నిం
చిరి. ఇట్టి అనుచిత కార్యములవల్ల స్వదేశీయను పదమునకు పని
కిమాలినది అను అర్థము వాడుకలోనికి వచ్చినది. ఈ గతికి కార
ణమేమి? అమ్మువానికి దేశాభిమాన ముండకుండుటయేకదా!

తమ లాభమునుమాత్రమె కోరి దేశమునకును, వాని మంచిపే రునకును మహాపచారము చేసినవారైరి. అందుచేత ప్రజలకు నమ్మకముపోయి స్వదేశిసాపులను జనులు చూడరైరి. ప్రతి యూరను పుట్టగొడుగులవలె బయలుదేరిన స్వదేశీసాపులు గిట్టెను, లేదా అవి విదేశపుసరుకుల సాపులాయెను. అటుగాక స్వదేశవస్తువుల కొనుటయందు దేశాభిమానము చూపుచు న్నాననియేగాక తానిచ్చిన వెలకు తగినట్టుగా మంచి నాణ్యమై న సరుకులు వచ్చునను నమ్మకముకూడ కొనువానియందు క లుగచేయుట అమ్మువానికి కర్తవ్యముకదా. ఇపుడిండియాయం దుతయారగు సరుకులలో ననేకములు మంచినాణ్యమైనవి. ఇచ టి పరిశ్రమలు కొన్ని వృద్ధిపొందుచున్నవి. ఇట్టిసమయమునం దు స్వదేశిఅనుపదము మంచినాణ్యమును చౌకదనమును సూ చించినట్టయిన మనదేశముయొక్క పరిశ్రామికత్వమెంత బాగు పడియుండును. ఇక ముందైనను ఇట్టి స్థితి మనకు సమకూరు నుగాక!

ఈ ప్రకరణమునందు చెప్పబడినవానినిబట్టి ఏర్పడు అంశ ములివి. స్వదేశమతమవలంబించుట యందు నేరమేదియులేదు. ఈ మతము శైశవదశయందుండు మన పరిశ్రమలకు కొంతసం రక్షణమిచ్చునేకాని ఇది ఎల్లప్పుడు ఉండజాలదు. ఉండినను ఆర్థి కవిషయమునుబట్టి చూడ నిది దేశమునకు మేలుచేయదు. ఎట్లి న సంరక్షణకాలములో మ్యానుఫాక్చరుదారులు తగిన శ్రద్ధ తీసుకొని పనిచేసి సరకుల నాణెము హెచ్చించి ధరలుతగ్గించి నగాని తయారైన సరుకులు జనసామాన్యములుగావు. అయి నను వాటికి గిరాకి కొలదికాలములో తగ్గిపోవును. ఇట్లు తగ్గి

గాక ఎక్కువధరకే ప్రజలు కొనుచుండిరేని విదేశవు పోటీలే పోవుటచేత పరిశ్రమదారులకు సోమరితన మెచ్చి పరిశ్రమ ందు చేయవలశినంత పని చేయకుందురు. ఇందుచేత పరిశ్రా మక కార్యములందు దేశము వెనుకపడును. ఈ దేశాభిమాన ముతో చాకదనమును నాణెమును మిళితము చేసితిమేని అర్థశా స్త్రప్రకారము నిజమైన స్వదేశమత మేర్పడును. పరిశ్రమలు బాగుపడును. దేశమునకు గౌరవమధికమగును.

## నాలుగవ ప్రకరణము.

## పరిశ్రామిక ప్రదర్శనములు.

మన గ్రామవాసులు సాధారణముగా ప్రపంచము నెరుగని వారుకదా! ఇట్టివారికి పరిశ్రమలగురించి ప్రసంగము చేసిన నే మలాభము? "మీరు శ్రద్ధతీసుకొని పరిశ్రామిక కార్యముల ను నెరవేర్పుట మీ విధి" యని బోధించుటవల్ల నేమైన ప్ర యోజనమున్నదా? వారి తాత ముత్తాతలనాటినుండి జరుగు పరిశ్రమలు మాత్రమే వీరెరుగుదురు. నేలదున్ని, కపిలె (మోట) తోలి సీరుకట్టి పంట పండినతరువాత కట్టామణిచేయుట వీరికి తెలియును. ఆడవాండ్రు నఘ్లు దంపుదురు. పిల్లవాండ్రు కాకుల ను తోలుదురు. గాండ్ల (తెలికులవారి) వీధియందు గానుగ కి ర్రు కిర్రు మనుచుండును. దొడ్లయందు వడ్రంగులు కలప కోసి కట్టెలు చెక్కి ద్వారబంధములను ఎడ్లబండ్లను చేయుచుందురు. చీనారేకుపనివాడు అరుగుమీద కూర్చుని కిరసనాయల్ డబ్బా రేకులను చెవులు బద్దలగునట్లు కొట్టి లాంతరులు గిన్నెలు మొదలగు రేకుసామాను తయారుచేయుచుండును. దీనినంత

ను చూచి "పరిశ్రామికత్వమా! ఇంతకంటె నెక్కువగా పరిశ్రమ లేవి కావలయును? ఇంకను పరిశ్రమలకేమైన ఎడమున్నదా" అని గ్రామపరిశ్రామికు డాశ్చర్యముతో నడుగును. నిజముగా నితడంతకంటె వేరుపరిశ్రమలున్నవని వినినైన నెరుగడుకదా! ఇట్టిస్థితిలో చదువరి చేయవలశినదేమి? ప్రపంచమే ఎరుగని ఈ గ్రామవాసిని పరిశ్రామిక ప్రదర్శనముల చూడబోవునట్లు పురికొల్పుటయే తగిన పని. నిజమాలోచించి చూడ మంచిఏర్పాటుగల ప్రదర్శనముకంటె, శ్రేష్ఠమైన వస్తుపాఠము మరియొకటి దొరుకుననుట దుర్లభముకదా! ఏమనగా తనగ్రామమెంత యున్నదో అంతకొద్ది స్థలములోనే దేశములోని ప్రతిపరిశ్రమయు ఇమిడియుండుటచేత పరిశ్రమలిట్టివియని మన గ్రామవాసి సులభముగా తెలిసికొనగలడు. ఈ విషయమునందు భారత జాతీయమహాసభ (Indian National Congress) గొప్పయుపకారము చేసినది. దీని కార్యక్రమపట్టికయం దుండక పోయినను ఇటీవల యేటేటను ఒక పరిశ్రామిక ప్రదర్శనము ఈ మహాసభతోపాటు జరుగుచుండుట వాడుకైనది. ఈ మహాసభకు సంబంధములేని ప్రదర్శనములు అక్కడక్కడ జరుగుచుండుటచేతను, వీనిని చూచుటకు వచ్చిన వేలకొలది జనులు తామెరుగని సంగతులు తెలిసికొని మానసవికాసము నొందుచుండుటచేతను ఈ ప్రదర్శనములనుగురించి కొంచెము చర్చచేయుటమంచిది.

మున్ముందు పరిశ్రామిక ప్రదర్శన చరిత్రమొకింతయాలోచింతము. తొలుత తూర్పుఇండియా కంపెనీవారి హయాములో కతిపటిభాగములందు పరిశ్రామిక ప్రదర్శనములు జరుగుచుండె

డివి. ఇండియాలోని పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటుకు (Public Works) తండ్రియనదగు శ్రీడాల్ హౌసి ప్రభువుగారు గవర్నరుజనరలుగా నుండునపుడు అనేకప్రదర్శనములు జయప్రదముగా జరిగినవి. 1853 వ సంవత్సరమున ఇండియాలోని మొట్టమొదటి యినుపదారి బొంబాయినుండి టానాకు సముద్రతీరమున నడువ మొదలుపెట్టెను. 1854 వ సంవత్సరమున పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు స్థాపింపబడెను. ఆ సంవత్సరమునందే అద్భుతమగు గంగకాలువగుండ నావలు నడువనారంభించెను. 1855 సంవత్సరమున చెన్నపట్టణమునకును కలకత్తాకును రైలుబండి పోవజొచ్చెను. రాకపోకలకిట్టి అనుకూలము లేర్పడిన కారణముచేత 1855 సంవత్సరమునందు పరిశ్రామిక ప్రదర్శనములు రాజధానినగరములలో జరుప నిశ్చయించి ఇందుకొరకు ప్రతిరాజధానియందును స్థానికసంఘములు (Local Committees) నేర్పరచి వీనిని జయప్రదముగా జరుగుటకు తగిన యేర్పాటులు దొరతనమువారు చేసిరి. ప్రదర్శకు (Exhibitors) లనేకులు వచ్చిరి. ప్రదర్శితముల (ప్రదర్శింపబడిన వస్తువులు) ను ఆయా తరగతులుగా విభజించుటకు నిపుణులగువారలను దర్శసభల లో నేర్పరచిరి (Jury of experts). ప్రదర్శకులకు బహుమానములు, పతకములు వీరిచ్చుటయేగాక అన్నితరగతుల ప్రదర్శితములను గురించి వివరణపత్రికలు వ్రాయవలసియుండెను. అప్పటి పత్రికలిప్పటికిని యున్నవి. ఏబదిసంవత్సరములనాటివైనను వానివల్ల మనమెరుగవలశిన విషయములనేకములున్నవి. ఈ వివరణపత్రములవల్ల (Reports) 60 సంవత్సరములక్రిందట మనదేశములోని పరిశ్రమలెట్లుండినవో తెలియ

నగును. కళాజ్ఞానమునందు నేబది సంవత్సరములనాటి మన తాత ముత్తాతలకంటె మనమందర మధికులము కాకపోయి నను పూర్వీకులకంటె యెక్కువ కళాజ్ఞానముకలవా రిప్పు డక్కడక్కడ కనబడుచున్నట్లు ఆ వివరణపత్రములవల్ల తెలియవచ్చుచున్నది. అప్పటి ప్రదర్శనములకు మన దేశములో తయారగుచుండిన ఇత్తడి మట్టి సామానులు, చేతితోనే యబడిన నక్షీగుడ్డలు మొదలగునవి మాత్రమే పంపబడుచుండి నవి కాని యే ప్రదర్శకుడైనను యంత్రపు (Machinery) ప్రదర్శితముల పంపియుండలేదు. ప్రదర్శితము లన్నియుమం చివేకాని అన్నియును ఒకే రకమువిగా నుండినవి. ఇటీవల కాంగ్రెసుతరఫున జరుగు ప్రదర్శనములందిటు కాదు. ఆభ్రక ముతోనింపబడి, కన్నపు దొంగలకైనను తెరుచుట కలవిగాని బరువైన పెద్ద పెద్ద యినుపపెట్టెలు మొదలు, పట్టుతాపడ ముకలిగి నొక్కితె తెరుచుకొను నాజూకైన సొమ్ముపెట్టెల వరకును, అద్భుతమైన సార్టుబండ్లు మొదలు ఆట యెడ్లబండ్లవర కును, మధురస్వరమునిచ్చు హార్మోనియములు మొదలు కిరుక్రిరుమను మగ్గములవరకును, దివ్యమైన పరిమళపు పెట్టెలు మొదలు మునిసిపల్ పెంటబండ్లవరకును, మీగడ వెన్న పాత్రలు మొదలు నల్లసిరాబుడ్ల వరకునుగల సమస్తవస్తువులు ప్రదర్శనమునకు వచ్చుచున్నవి.

1855 సంవత్సరమున చెన్నపట్టణములో జరిగిన ప్రదర్శన మునందు యాంత్రికప్రదర్శితములకై యేర్పడిన ధర్మసభలో చెన్నపురి ఇనుపదారి ఇంజనీరులు చాలమందియుండిరి. యాంత్రిక ప్రదర్శితములు బొత్తుగా లేకుండుట చూచి, పూర్వ

ను తాము వాడుచుండిన పనిముట్లనే పనివారు వాడుదురనియు ంతకంటె మంచిపనిముట్లకు గిరాకీ లేదనియు, ఇందుకు దుర ుమానము ముఖ్యకారణమనియు; విద్యవల్లను ధైర్యముగ ూర్గదర్శియొక్క ప్రోత్సాహమువల్లను క్రొత్తపనిముట్లు క్రమముగా ాడుకలోకి రాగలవనియు వివరణపత్రికయందు వీరువ్రాసిరి.

1855 సంవత్సరముజరిగిన ప్రదర్శనములవలన చాలమేలు లిగినది. ఉత్తరఇండియాలో పెద్ద పితూరి బయలుదేరుటకు ూడు నెలలకుముందు, చెన్నపట్టణమున 1857 సంవత్సరమున ిగిన ప్రదర్శనమందు యంత్రప్రదర్శితములు చాల బాగుండె ు చెప్పుటకు వివరణపత్రికయందిట్లు వ్రాయబడినది.

"మదరాసునందును, యూరోపియనులు పనిచేయుచుండు చోట్లకు ట్టుపట్లను, వారి నైపుణ్య ప్రకృతిశాస్త్రజ్ఞానముల నూపునట్టి నయమైన ముట్ల (Improved) విషయమై స్వదేశీయులకుండు దురభిమానము అం ుచుచున్నది. నిశ్చయమనుట స్వదేశీయుల ప్రదర్శితములే చాటుచు వి. స్వదేశీయులు యూరోపియనుల పని నమూనాకు నకలుతీయు నందు కొంతవరకు జయముపొందిరి. అయినను వారి సాధనములుగాని వా ుపయోగించు పద్ధతులుగాని అంతమంచివికావు. కాని తగిన ప్రోత్సాహ కలిగి వీరు యూరోపియనుల సాధన సామాగ్రి నుపయోగించిరేని ఉప క్తముగు ఈ యంత్రనిర్మాణకళ (Mechanical art) (అనగా యంత్ర ను పనిముట్లనుచేయు) స్వదేశీయులచేతులందు బాగుగానభివృద్ధి నొందు ు నిస్సందేహము."

పూర్వపుపదర్శనములందు పనిచేసిన ధర్మసభికులందరు జీవిం నుండరు. కాని వీరెవరైనను ఈ కాలపు ప్రదర్శనములకు ు చూచిరేని తాము అనుకున్నట్లు ప్రతిచోటను లేక?

యినను పెద్దపట్టణములందైనను పరిశ్రమాభివృద్ధి అగుపడుచున్నదని తప్పక తలంతురు. కాబట్టి యిపుడు కనపడు ఈ స్వల్ప అభివృద్ధికిని పూర్వపు ప్రదర్శనములే కారణములని వేరుగా జెప్పబని లేదు.

ఇవిగాక పలుమారు వ్యవసాయ ప్రదర్శనములు పూర్వము కొన్ని జరుగుచుండినవి. కాని వీనికి ఖర్చు ఎక్కువగుచుండుట చేత వీని జరుపుట కలెక్టర్లకు (District Collectors) మిక్కిలి తొందరగానుండెను. ఇందుకు తోడుగా డాల్‌హౌసీ ప్రభువుగారితరువాత వచ్చిన రాజప్రతినిధులలో (Viceroy) కొందరు ఆతని పరిశ్రామిక వ్యవస్థల (Schemes) నభివృద్ధిచేసిరి కాని వారెవరికిని డాల్‌హౌసీగారి యుత్సాహముండినది కాదు. ఇందుచేత ప్రదర్శనములు నిలిచిపోయినవి. కడపటి ప్రదర్శనము జరిగి 20 సంవత్సరములైనవి. 1860-1869 సంవత్సరములందు ల్యాంకషైరు (ఇంగ్లండు) లోని దూదివర్తకము పడిపోవుటచేత బొంబాయిలోని ప్రత్తి పరిశ్రమయు దానికి సంబంధించి యుండు ఇతరపరిశ్రమలును ఉన్నట్టుండి అభివృద్ధిపొందినపుడు బొంబాయివారు అంతర్ జాతీయ (International) ప్రదర్శనముపెట్టుటకు అధికోత్సాహముతో ఆలోచించిరి కాని వాణిజ్యాభివృద్ధి అనుకున్నంత అధికముగా నుండకుండుటచేత ప్రతిఘాతము (Re-action) సంభవించినది. ఎట్లన పార్సీ కోటీశ్వరుడగు బైరాంజీ కామాగారు 45,000,000 రూపాయలకు దివాలాతీసిరి. దీనికితర దివాలాలు వెంబడించినవి. జనుల దురవస్థ యెక్కువాయెను. ప్రదర్శనము నిలిచిపోయెను. 1884 సంవత్సరమున అధికజయప్రదముగా నొక అంతర్ జాతీయ (International) ప్రదర్శనము

లకత్తాలో జరిగినది. 1903 వ సంవత్సరమున ఢిల్లీదర్బారువెం
బడి మరియొక ప్రదర్శనము జరిగినది.

ఈ ప్రదర్శనములన్నియు దేశమున కెంతయో మేలుచేసి
వి. అన్నిటికంటెను కాంగ్రెసువెంబడి జరుగు ప్రదర్శనములే
యెక్కువసుకరములని చెప్పవలసియున్నది. ఎందుకనిన ఇవి మ
దేశస్థులచేతనే స్థాపింపబడినవగుటచేత ఇందు దొరతనము
గారి ఉద్యోగస్థులు సూత్రధారులుగా నుండి లేనిపోని చైత
న్య మాప్రదర్శనములకు కనపడునట్లు చేయుటలేదు. భారతీ
యులు స్వశక్తితోను స్వయం సహాయముతోను స్వయంకృషి
తోను యెంతవరకు ఇట్టికార్యముల నిర్వహించగలరో దానిని
ఈ ప్రదర్శనములు నిజముగా చూపుచున్నవి. ఈ ప్రదర్శనము
లో మొదటిది కలకత్తాలోను 1901 వ సంవత్సరమున జరిగినది.
రెండవది 1902 వ సంవత్సరము డిశంబరు నెలలో అహామదా
బాద్డునందును మూడవది 1903 వ సంవత్సరమున మదరాసునం
దును జరిగినవి. ఈమూడు ప్రదర్శనములలో కడపటిది యెక్కువ
గాగుండుటచేత ప్రదర్శనము లేటేటను వృద్ధిపొందుచున్నవని
యది సూచించుచున్నది. కాంగ్రెసువెంబడి ప్రతిసంవత్సరము జ
రుగుచుండు ఈప్రదర్శనములు మన దేశమునకు మేలుచేయుగాక.

ప్రదర్శనముల విషయమున ఈ క్రింద చెప్పబోవు సంగతులు
చెన్నపురియందు 1903 వ సంవత్సరమున జరిగిన ప్రదర్శనమున
కు సంబంధించినను ఇవి అన్ని ప్రదర్శనములకును అన్వయించును
నుక వీనిని శ్రద్ధతో గమనింతురుగాక.

ప్రతిప్రదర్శనమునకును మూడంగములు కలవు. (A వ్యాప

స్థాపకులు (Organisers) (B) ప్రదర్శకులు (Exhibitors) (C) చూపరులు.

A. <u>వ్యవస్థాపకులు</u> (1) ప్రదర్శనము జరుపుట నిశ్చయమైన తోడనె సాధ్యమైనంత త్వరలో తగినయేర్పాటులు ప్రారంభముకావలయును. కడపటివరకును సామానులమూటలు వచ్చుచుండినయెడల యెంతశ్రమకలుగునో యెంత గలిబిలిగానుండునో ప్రదర్శనములనడిపిన వారికే తెలియును కాని ఇతరులకు తెలియకపోవచ్చును. క్రమమైన యేర్పాటులు లేని ప్రదర్శనము మనోహరముగానుండదు. దానివల్ల ఉపయోగము లేదు. ప్రదర్శనప్రారంభము వరకును యేర్పాటులు సిద్ధిపోవుచుండె నేసి అంతయు చెడిపోవును. కాబట్టి శీఘ్రముగా పనులు మొదలుపెట్టుట ఆవశ్యకమని మండల వ్యవస్థాపకులు (District organisers) ముఖ్యముగా నెరుగవలయును. వీరుప్రదర్శితముల తయారుచేయువారితో సంబంధముండువారు గనుక యెక్కువ జాగ్రతగా నుండవలయును. సకాలమున ప్రదర్శనము జరుగుననియు, దానికి అందరు మంచిప్రదర్శితముల తయారుచేసి పంపవలయుననియు పదేపదే ప్రోత్సాహము చేయుచుండ వలయును. లేనియెడల కొన్ని ప్రదర్శితములు వృథాయగును. ఎట్లన పనివాండ్రు ప్రదర్శనమున తమనైపుణ్యమును చూపగోరి ఆలశ్యముగా పని ప్రారంభించినవారు యెంతత్వరగా పనిచేసినను తుదకు ప్రదర్శితములను కాలమునకు ఎదిగించలేకపోదురు. అందుచేత నివి వృథాయగును. ఈ కారణముచేత 1851వ సంవత్సరమున లండనులో జరిగిన గొప్ప ప్రదర్శనమునకు 1849వ సంవత్సరముననే ఏర్పాటులు చేయబడినవి. 1850 జనవరినెల

3 వ తేదీని చందాలపట్టి బయలుదేరినది. ప్రదర్శనము 1851 వ సంవత్సరము మే నెలలో మొదలుపెట్టిరి. అనగా ప్రదర్శనము ప్రారంభించుటకు ముందు సుమారు రెండు సంవత్సరముల నుండి పనిచేసిరి. ఈ ప్రదర్శనము 6 మాసములు నిలిచియుండినందున మొదటి కొన్ని రోజులలో కనబడిన లోపములను సవరించుకొనుటకు తగిన వ్యవధియుండెను. ఇండియాలో జరుగు ప్రదర్శనములు కొన్నిరోజులు మాత్రమె ఉండునవి గనుక మొదటిరోజునకే సర్వము సిద్ధముగా నుండునట్లు చేయవలయును. లేకున్న ప్రదర్శనము చెడిపోవును.

(2) చూపరులకు సులభముగా నుండునటుల తగిన యేర్పాటులు జరుగవలయును. మొదట ఇంగ్లీషునందును దేశభాషయందును పెద్ద అక్షరములలో గుర్తుబల్లలు తయారుచేసి చూపరులు తమ ఇష్టమువచ్చినచోటికి పోవునటుల సదుపాయము చేయవలయును. నేతబట్టలు అనియొక బల్లమీదను, యంత్రములు అని రెండవదానిమీదను, ఫర్నిచరు అని మరియొకదానిమీదను వ్రాశి అచ్చట గుర్తుబల్లలు కట్టి ప్రదర్శితములను వేరువేరు తరగతులుగా చూపవలయును. ప్రదర్శితములయొక్క అచ్చుధరలపట్టి తెలియచెప్పునదిగాను(informing) గమనింపవలసిన అంశముల సూచన లచ్చటచ్చట కలిగి అంత పెద్దపుస్తకముకాక సామాన్యముగా నుండవలయును. బాగుగా నేర్పాటుచేయబడ్డ చెన్నపురి ప్రదర్శనపు (1903-1904)

ధరలపట్టిలో ఈ క్రింద సమూదు చేయబడిన అంశములు 27 వ పుటయందుండినవి.

| రిజస్టరు నెంబరు. | పంపువారి పేరు. | వస్తువులవివరము. | వరుస నెంబరు. |
|---|---|---|---|
| 467 | ఇండియనుస్టోర్లు కలకత్తా. | 1 జతస్టాకింగులు | 2884. |
| 467 | ఇండియనుస్టోరు కలకత్తా. | 1 స్వెటరు (ఉన్ని) | 2885. |
| 467 | ఇండియనుస్లోర్లు కలకత్తా. | 6 జర్సీలు (ఉన్ని) | 28867. |
| 467 | ఇండియనుస్టోర్లు కలకత్తా. | బాలక్లవా టోపీలు (ఉన్ని) | 2888. |
| 467 | ఇండియనుస్టోర్లు కలకత్తా. | 2 జతల ఉన్ని చేతితిత్తులు. | 2889. |

ఈ ప్రకారము ఈ యొక కంపెనీయొక్క జాబితా మూడు పుటలు పట్టినవి. నేతబట్టలపట్టి యంతయు 12 పేజీలు పట్టినది. ఈ పట్టీని చదువువారలకిది బట్టలవర్తకుని ధరలపట్టియని కాని వేలముదారుని ధరలపట్టియనికాని కనబడునేగాని తగినఅంశముల చెప్పు ప్రదర్శకపుపట్టియని తోచదు. ఈ కంపెనియొక్క ప్రదర్శకముల నీక్రింది విధమున చూపినయెడల యెంతయు తగియుండును.

| రిజస్టరు నెంబరు | పంపినవారి పేరు. | వస్తువివరణము. | నెంబర్లు |
|---|---|---|---|
| 467 | ఇండియనుస్లోర్లు కలకత్తా | ధారణకుతగినబట్టలు | 2884-4'11 |

ఇటుపట్టీని క్లుప్తముచేయుటవల్ల తగిన రిమార్కులకు యెడముండును. ప్రతివస్తువునకును చీటీనంటించి దానిమీాదపేరును

నెంబరును విడివిడిగా వ్రాసియుండవలయును. వస్తువుపట్టీ పదేపదే చూచుకొనక్కరలేకుండ ఏదైన వింతవిషయ ముండెనేని దానిని సంక్షేపముగా వ్రాయవచ్చును. అమ్మకమునకుగాను ప్రతి ప్రదర్శకమునుగూర్చియు వ్యవహారపుపట్టి (Official) యొకటితయారుచేయవలసినదే కాని ప్రజలకిచ్చునది వ్యవహారపుపట్టీకి నకలుగా నుండనక్కర లేదు. వ్యవస్థాపకులు గమనింపవలసినది మరియొకటి. పనికిమాలిన ప్రదర్శితముల నందు చేరనియ్యకుండుట. ప్రదర్శితములు ఉత్కృష్టముగానుండి మార్గదర్శకములు కానియెడల ప్రజలకు అట్టి ప్రదర్శనములవల్ల లాభముండదు. అవి యెంతమంచివిగా నుండెనేని జనులకంత ఉత్సాహము యెక్కువ చేయును. ఇటుల మంచి ప్రదర్శితముల నేరికోరుటయందు కొంచముజాగ్రతగా నుండవలయును. ప్రదర్శకుల నిరుత్సాహుల చేయకుండు నట్లుగా సామాన్యమైనవానిని కూడ గ్రహించవలసి యుండును, ఇట్లనుటచేత పరిశ్రామిక ప్రదర్శనములంతగా తెలియని ప్రదేశములందు అంత శ్రేష్ఠమైన వానికొరకే కాచుకొనియుండక సామాన్యమైనవానినైనను గ్రహించవలయు ననియర్థము కాని ఇట్టిస్థితియందైనను బొత్తుగాపనికిమాలిన ప్రదర్శితములను గ్రహించకూడదు. సాధారణముగా ప్రదర్శనకై వచ్చినవాడు తెచ్చినదానిని ప్రదర్శనములోనుంచ వలయునని కమిటీవారు చూతురు. తన ప్రదర్శితములను కమిటీవారంగీకరించుట గౌరవమనియు, అట్టి గౌరవమునకు పాత్రమగుటకు ప్రదర్శితములందు కొన్నియైనను సులక్షణములుండితీరవలయుననియు ప్రతిపరిశ్రామికపు పనివాడును బాగుగా నెరుగునట్లు కమిటీవారు చేయవలయును.

(3) ప్రదర్శనముయొక్క ముఖ్యోద్దేశము ప్రజలను తర్ఫీతుచేయుటకనుక సాధ్యమైనంతమంది చూపరుల నాకర్షించవలయును. చూపరులు కేవలము నేర్చుకొనుటకు రారు. నేర్చుకొనుటయన చాలమందికి తలనొప్పిగా నుండును. కాబట్టి చూపరుల నాకర్షించుటకు తగినన్ని వినోదకారణము లుండవలయును. ఆవరణముచుట్టున నుండు జండాలు తమాషాలు మొదలగు వినోదములకును ప్రత్తివిత్తనపు యంత్రములు, నీరెత్తుసాధనములు మొదలగు వానికిని సంబంధము లేదుకాని వేడుక చూచుటకై ప్రదర్శనమునకు వచ్చిన చూపరులు యంత్రముల పరీక్షించుటకై నిలిచిన నిలువవచ్చును.

(4) బోధపరుచుటకు పనికిరాని ప్రదర్శితములను యేప్రకారముగా కమిటీవారు అంగీకారము చేయకూడదో అదేప్రకారముగా నెక్కువ వెలగల ప్రదర్శితములనుకూడ అంగీకరింపకూడదు. వీనిని ప్రదర్శనశాలలో నుంచు భారము మిక్కిలి గొప్పదని యేర్పాటుకర్త లెరిగి తగిన ఇంజనీరు కాపని నప్పగించి నీటిబొట్టు పడకుండునట్లు పదిలముగా ప్రదర్శనశాలను వేయించవలయును. ఇటు చేయనియెడల వర్షము హఠాత్తుగావచ్చి వర్షధాటికి నిలువని కారణముచేత నాజూకైన మజ్లిన్‌లు, తాప్తాలు నున్నితమైన షర్నిచరు మొదలైనవాటికి బదులు చీకిపోయిన బట్టలు మెత్తగా నానిన కట్టెలు, త్రుప్పుపట్టిన లోహపుసామానులు మొదలగువానితో ప్రదర్శనములంత్యమగును. చూపరుల విలువదుస్తులు పాడగుటయేగాక ప్రదర్శితములు పాడయినందుకు ప్రదర్శకులు గోలపెట్టుదురు. కాబట్టి ప్రదర్శనశాలయందు

వాన కురియకుండుటయేగాక నిప్పువలని భయము లేకుండున ట్లుకూడ చెయ్యవలయును.

ప్రదర్శనవిషయమై తగినసభ యుండవలయును. సభికుల లో చాలమంది చందాలిచ్చిన వారగుటచేత సాధారణసభయం దు ఎందరున్నను సరియే కాని కార్యనిర్వాహక సంఘము (Executive Committee) పనికితగినట్టు యెంతచిన్నదయిన అం తమంచిది. ఈ సభవారు నిరంకుశాధికారము ఒకరికిచ్చి మిగ తవారందరు ఆయన ఉత్తరువును సిరసావహించి పనిచేయు చుండవలసినది. ప్రదర్శన మిట్లొకని చేతిలో నుండుటవలన నది బాగుగాజరుగును. ఎందుకనిన ప్రదర్శనపురోజు సమీపించిన కొలది తొందర యధికమగును. కొన్ని కొన్ని విషయములు ఉ న్నట్టుండి యేర్పాటు చేయవలసియుండును. ఇతరులతో ఆలో చనచేయుటకు వ్యవధియుండదు. ఇట్టిసమయమునందు ఒకరు ఒకటి చెప్పి మరియొకడు మరియొకదాని చెప్పుటచేత పనులు కొనసాగవు. కాన నీభారమంతయు ఒకడే వహించెనేని కార్య ము క్రమముగా జరుగగలదు. అయినను ఈ సర్వాధికారి అం తను తన నెత్తినవేసికొనక ప్రదర్శన కార్యములను భాగము లుగా విడదీసి ఒకొక భాగమునకు ఒకొక సభ్యుని ఉపాధికారి గా నుంచుట మంచిది. ప్రదర్శనములు జరుపుట గొప్పవిషయ ముకనుక అట్టివాని నిర్వహించి పనిచేశినవారు అనుభవశాలు రగుదురు. వీరితరులకు మార్గదర్శకు (Leaders) లగుదురు కను క ప్రదర్శనములు మిక్కిలి యుపయోగకరములే యగును.

(B) ప్రదర్శక లోకవిషయము నెరుగవలయును. పదర్శనము లు యేర్పడుట ప్రదర్శకులయొక్క సరుకులను ఎక్కువధరలక

ఆ పరిశ్రమ తగినదా? యని చర్చించుచు "నేనిచటికి కేవలము తమాషాకొఱకు వచ్చినవాడనుకాను. కేవలము నాస్వంతజ్ఞానాభివృద్ధికిని రాలేదు. నా గ్రామమునకు మేలుచేసి తన్మూలమున దేశమునకు సేవ చేయవచ్చినాడను" అని మనసులో ననుకొనుస్థితిలో నుండవలయును.

## ఐదవ ప్రకరణము.

## విమర్శనాబుద్ధి (Inquiring Spirit).

సాధారణముగా భారతీయులగు మనము పనికిమాలిన ప్రశ్నలను వేయువారము కాని. విమర్శనాబుద్ధికలవారము కాము అనగా మనము అనావశ్యకమైన జిజ్ఞాసకలవారమై (inquisitive) నిరుపయోగములగు ప్రశ్నలు వేయుదుము కాని, ఎందుకు? ఏమని? ప్రశ్నలువేసి కార్య కారణములకు గల పరస్పర సంబంధములను తెలిసికొను కుతూహలము చూపకుందుము. క్రొత్తవాడు వచ్చెనేని వాని ముఖము మొగాదిగా చూచి యెంతో పరిచయము కలిగినవానివలె స్వంతవిషయముల గూర్చి ప్రశ్నలనేకములడుగుటచేత తానెవడో అనుమానము కలిగించిన వాడనియు, తన్ను ప్రశ్నలు వేయువాడు మారువేసము వేసికొనిన పోలీసువాడనియు క్రొత్తవాడు తప్పక తలచునట్లు చేతుము. ఈ ప్రశ్నలన్నియు నుద్దేశములేక అడిగిన ప్రశ్నలు కాని ఉపయోగ విషయములను తెలిసికొను నాసతో నడిగినవి కావు. ఇట్టిస్వభావము అన్నికులములందును కనబడుచున్నది. క్రొత్తగా నిల్లుచేరిన దాది ఒక యరగంటలో ఇంటి యజమానుడు

యజమానురాలు వారిబిడ్డలు వారింటికి వచ్చువారు మొదలు గాగల విషయములను వంటవానివల్ల తెలిసికొనుటయే గాక యజమానులు రహస్యములనుకునే సంగతులుకూడ యెరిగి యుండును. అగ్రవర్ణములందు కూడ నిట్టి స్వభావ మగుపడు చున్నది. యూరోపియనులతో పరిచయము లేనివాడొకడు మదరాసుకు పోవువానినిచూచి మదరాసుకు యెందుకు వచ్చి నావనియు, గడియారముయొక్క వెల యెంతయనియు కొంచ మైనను సంకోచింపక యడుగును. ఒక దొరసాని మన స్త్రీ లయొద్దకు వెళ్ళినేని ఆమెకు వేయు ప్రశ్నలు ఆ దొరసాని స్వభావమును పట్టి తమాషాగా నైనను కష్టముగానైనను ఉండును.

స్త్రీలయందీస్వభావము యెంతవరకు పోవునది ఈ క్రింది కథ చూపుచున్నది. ఈమధ్య దండునకు సీపాయిల నేరుకొనుటకై ఒక ఇంగ్లీషు ఉద్యోగస్థుడు పల్లెటూళ్ళకు పంపబడెను. అచట హోటల్ గాని బంగాళాగాని లేకపోవుటచేత కలెక్టరుగారు పూర్వసువాసినియగు నొక రాణిగారికి వ్రాసి ఆమె నగరిలో నొక ఇంటియందు బసయిప్పించిరి. ఈ యుద్యోగస్తుడుండిన వారమురోజులు రాణిగారు అతనికి కావలసినవాటి నన్నిటిని పంపి తగు మర్యాదతో చూచుచుండిరి. ఆరాణిగారికి ఇంగ్లీషు చదువుకున్న కుమారుడు 15, 16 యేండ్లవాడు ఒకడుండెను. ఆతని ద్వారా ఈ యుద్యోగస్థుడు రాణిగారి దర్శనముచేసి తాను వెళ్ళిపోవునపుడు ఆమె చూపినదయకు వందనములు చేసి ఆమె శెలవుతీసికొని, దేహపరిశ్రమయందిష్టము గలవాడైనందున నగరమునుండి రైల్ స్టేషనుకు కాలినడకన సగము

దూరము వెళ్ళునరికి రాణిగారి కుమారుడు పరుగెత్తుచు అతని కలుసుకొనెను. తనను మర్యాదతో సాగనంపుటకు రాణిగారికుమారుని పంపినారని దొరగారనుకొని ఆ బాలుని ప్రక్కన నడుచుచు ఆతని మనసులో నేమో యుండుట కనిపెట్టి ఆ సంగతి చెప్పుమని అడుగగా ఆ బాలుడు వగర్చుకొనుచు "మీకు జీతము యెంత యని మాతల్లిగారు అడిగి రమ్మన్నారు" అనెను. ఈ కథ కల్పితము కాదు. ఈ యుద్యోగస్థుడె ఈ గ్రంథము నింగ్లీషు భాషలో రచించిన బార్లోగారికి సంగతి స్వయముగా చెప్పెనట. వెళ్ళిపోవు ఉద్యోగస్థుని వెనుక కొడుకును పరుగెత్తించి జీతమెంతని యడిగించుట ఈ రాణిగారికొకరికె వాడుకయయి యుండవచ్చును కాని మన దేశమునందు సరియైన విమర్శనాబుద్ధి లేకపోవుట యెల్లరకు సామాన్యమే యనుట కొకనిదర్శనమిదియగుచున్నది.

విమర్శనాబుద్ధిని—అనగా ప్రతివస్తువునుగురించి గాని ప్రతివిషయమును గురించిగాని ఇది యేమి? ఇది యెందుకు? అని అడుగు స్వభావమునకును నిరుపయోగమగు ప్రశ్నలు వేయు అధిక ప్రసంగమునకును (inquisitiveness) సంబంధములేదు. ఈలోటు మనలోనుండుట చింత్యము. ఒక యుదాహరణము నాలోచింతము. ట్రాంబండ్లు మదరాసులో నెన్ని సంవత్సరములనుండి పరుగెత్తుచుండినను, ప్రకృతిశాస్త్రిములు చదువువారికి తప్ప మన దేశీయులలో వెయ్యింటికి ఒకరైనను ట్రాంబండ్లు యెట్లునడుచునదియు కొంచెమైనను తెలిసినట్లు మాట్లాడువారు లేరు. ఇంగ్లీషువారు కాని యూరోపియనులు కాని ఇట్లుండరు. వారు ప్రతిదానికిని కారణము వెతకుచుందురు. మొదటిసారి స్టీమరు

లో ప్రయాణము చేయునప్పుడు ఎంజిన్ గదిలోనికి దిగి వానిని పరీక్ష చేయుదురు. రైలు బండిలో ప్రయాణముచేయు చుండగా నడుమబండి నిలిచిపోయెనేని వాడు పాతజోళ్ళు మరమ్మతు చేయువాడైనను యంజను మరమ్మతు చేయువానివలె బండి నిలిచినందుకు కారణములు తప్పక నడుగును. ప్రతి విషయమును గూర్చి దీనిలోపల విచారింపుము. (Enquire within upon everything) అను ప్రసిద్ధ గ్రంథము తయారుచేసిన బ్రిటిషువాడు తనజాతి స్వాభావమైన విమర్శనాబుద్ధి నెరింగినవాడు. మనుష్యులెరిగినదంతయు నున్నదని ప్రకటింపబడిన టైమ్సు' వారి సర్వసంగ్రహ నిఘంటువు (Time's Encylopaedia) బాగుగాకర్చగుట, విమర్శనాబుద్ధి ఇంగ్లీషువారియందు జనసామాన్యమని సూచింపుచున్నది. ఈ విమర్శనాబుద్ధి ఇంగ్లీషువారియందు శైశవమునందే కనబడుచున్నది. ఇంగ్లీషు బాలుని చేతికొక చిన్న ఆటగడియారము నిచ్చితిమేని వాడు త్వరలో దానినిపగులగొట్టి లోపల ఏముండునది గడియారము ఎట్లు నడుచునది తెలిసికొనుటకై యత్నించును. ఈ బుద్ధివలన పిల్లవాండ్రు మెడతెగని ప్రశ్నలు వేశి పెద్దవాండ్లను విసిగించుచుందురు. దీనిని చిన్న నాటకముగా వ్రాయుదము.

రంగము. ఒక గది— (తండ్రి తన పడకకుర్చీమీద కూర్చొని చలికాచుకొనుచు వార్తాపత్రిక నొకదానిని చదువుచున్నాడు. అతనియెదుట నొక చిన్న పిల్లవాడు బొమ్మలపుస్తకము ముందు వేసికొని బొమ్మలను చూడక గడియారమును చూచుచు కూర్చున్నాడు.)

పిల్ల— (కొంత శేపు నిశ్శబ్దముగానుండి) నానా!

తండ్రీ— (డబ్బునుగురించిన విలేఖనము చదువుటలో మునిగి యుండి మోమున చిరాకు కనపడుచుండగ చుట్టుతిరిగి) మంచిది! ఏమి?

పిల్ల—నానా, గడియారము యేలాగు గుండ్రముగా తిరుగును

తండ్రి—(ఓర్పుతో బాలునికి తెలియఁజేయుటకై మిక్కిలి తొందరగా) ఎందుకు? చూడు. దానిని తిప్పినపుడు స్ప్రింగుకు బిఱ్ఱెక్కును. తరువాత చక్రము తిరుగును (పత్రిక చదువ మొదలుపెట్టును.)

పిల్ల—(కొంత సేపయిన తరువాత) నానా!

తండ్రి—(మిక్కిలి చిరాకుతో) మంచిది. యేమిసంగతి?

పిల్ల—స్ప్రింగు ఏమిటి?

తండ్రి—(మిక్కిలి ఓర్పు నభినయించి, నిట్టూర్పు నిగుడించి, పత్రికను ఆవల నుంచి, గడియారము క్రిందికి దించి, దానిని విప్పి, స్ప్రింగు యేలాగు పనిచేయునది చూపి ఎప్పటివలె అన్నిటిని పెట్టి మరలపత్రిక చదువ మొదలుపెట్టును.)

పిల్ల—(కొంత సేపయినతరువాత) నానా!

తండ్రి—(పండ్లు కొరుకుచు) నీకు యిప్పుడేమి కావలయును?

పిల్ల—ఆపక్కనుండి ఈ పక్కకు ఊగులాడు బంగారుగుండు మాట యేమీ చెప్పలేదే!

తండ్రి—(కోపముతో లేచి) ఓ దేవుడా! ఇది...(కోపము నాపుకొని) నీవు పడుకునేవేళ అయినది. ఆచిన్న బంగారు గుండును గురించి ఇంకొకసారి చెప్పెదను (అనుచు దాదికొరకు గంటకొట్టి) పిల్లవానిని పంపివేయును.

ఇట్లు గడియారము గురించి తెలుసుకొమ్మని పిల్లవానిని పురికొల్పు స్వభావమే తరువాత అతనిని నక్షత్రముల గూర్చి తెలిసికొనునట్లు చేసినపుడు అతడు గొప్పజ్యోతిష శాస్త్రవేత్త యగును. భూపటలములో జరుగు మార్పులగురించి తెలిసికొనునట్లు అది చేసినపుడు అతడు గొప్ప భూగర్భశాస్త్రజ్ఞుడు కాని గనుల యంజనీరుకాని అగును. అటుగాక అతడుద్రవ వాయుకముల గూర్చి నేర్చుకొనునేని గొప్ప రసాయనశాస్త్రవేత్త యగును. ఇదియుగాక యంత్రములగూర్చి తెలిసికొనునేని అతడు నూతనయంత్రముల కనిపెట్టువాడగును.

ఇట్టి విమర్శనాబుద్ధి మనయందంతగా నుండకుండుట విచారకరము. ఇది పుట్టుకతో మనకు లేకుండినదికాదు. మనము దానికి తగిన పరిశ్రమ నియ్యకపోవుటచేత ఆశక్తి మనకు తగ్గినది. కావున ప్రతి భారతీయునకును ప్రతిభారతీయ విద్యార్థికిని ఈ విమర్శనాశక్తిని అభివృద్ధిచేసికొనుట కర్తవ్యము. లేనియెడల ఈ కాలమునకు తగక వెనుకపడిపోదుము.

ఇది మనయందంత అరుదగుటకు కారణముల చర్చించుట వల్ల మనకు లాభము కలుగవచ్చును.

(1) మనదేశమునందు ఆదినుండియు బ్రాహ్మణులే మార్గదర్శకులుగనుండిరి కదా! వీరి మతము వీరిని యెల్లపుడు తత్వవిచారములనే పురికొల్పుచుండుటచేత వీరు అనాత్మికములగు జడవిషయములందు శ్రద్ధ తీసికొనక యుండిరి. అందుచేత జనులకు కూడ వీనియందు శ్రద్ధలేకపోయెను. వేదాంతమతప్రకారము జడపదార్థములన్నియు అనిశ్చయము; కేవలముమాయ. సర్వాంతర్యామియగు పరబ్రహ్మమొకటె నిశ్చయము. ఇందు

చేత బ్రాహ్మణుడు అనాత్మీయవిద్యయందు ఇష్టములేక దాని నిగురించి కొంచెమైనను యోచింపకుండుటయే గాక నిష్టగల ప్రతి బ్రాహ్మణుడును ప్రపంచమును బొత్తుగా వదలి హేయమగు ప్రపంచవిషయమేదియు కనులబడకుండునట్లు గంటలకొలది కన్నులు మూసికొని యోగాభ్యాసము చేయుచు తన తపోబలముచేత భూమినుండి స్వర్గమునకు పోవలయునను ఆతురతకలవాడై యుండెను. పరమాత్మతో ఐక్యము కావలయునని కోరుట మహాత్కృష్టమయినదనుట నిశ్చయమే. అనాత్మీకములకంటె తక్కువైనవనుటయు నిశ్చయమే. కాని మానవుడు కేవల మాత్మస్వరూపుడు కాడు. ఇతని ఆత్మకొక దేహమున్నది. కాన జడపదార్థము లెంత అస్థిరములైనను వానిని పూర్తిగా వదలుకొనుటకు వీలులేదు. దేహము అస్థిరము కావచ్చును కాని అది యుండువరకును దానివలని బాధలు మన మనుభవించుచునే యున్నాము. ఆకలిదప్పులు, కరువు బీదరికములు, జాతీయనష్టము (National loss) జాతీయ భ్రష్టత్వము (National degeneration) మొదలగునవన్నియు మన మనుభవించుచుండునవి కావున ఇరుగు పొరుగువారల ప్రేమించువాడును, తన దేశీయులయందు వాత్సల్యముకలవాడును వారి మేలుకొరకు కొంతైనను సాహాయ్యముచేయక తప్పదు.

ఇట్లనుటచేత బ్రాహ్మణులు తమ మతాభిప్రాయములను నమ్మకములను లవలేశమైనను పోగొట్టుకొనుమని చెప్పుటలేదు. ఈ ప్రపంచవస్తువులన్నియు అస్థిరములనియె వీరను కొనవచ్చును కాని ఇవి ఆవశ్యకములగు అస్థిరములు కనుక వీనిని మార్గదర్శకులు కొంచెము గమనించిరేని దేశమునకు లాభ

ము చేసినవారగుదురు. బ్రాహ్మణుల తత్వజ్ఞానము మిగుల ఆ
ందదాయకమని యొప్పుకొనక తప్పదు. కాని కాలమానము
ంచెమాలోచించ వలయును. ఇండియాకు ఇపుడు క్రొత్తద
వచ్చినది. నేలబొగ్గుయంత్రములు వాడుకలోకి రావలశినదశ.
ఈ దశయందు మానవుడు కేవలము తత్వజ్ఞానమువలననే జీ
ంపచాలడు. కేవలము అధ్యాత్మిక విషయములనె చర్చించి
యే జాతియువృద్ధి పొందినది లేదు. మధ్య యుగములందు
(Middle age) యూరోపులో విద్యయంతము మఠములలోని స
న్యాసుల చేతులలోనుండెను. వారు ఆధ్యాత్మికవిషయములనే
చర్చించు ప్రకృతి శాస్త్రములను బొత్తుగా వదలిపెట్టి యుండి
రి. అపుడు జాతీయాభివృద్ధి వెనుకబడియుండెను. 16, 17వ శ
తాబ్దములందు దీనికి ప్రతిఘాతము (Reaction) సంభవించినది.
ప్రకృతిశాస్త్రి యాంత్రికయుగము స్థిరపడెను. జనులు అతిత్వ
రగా ప్రకృతిశాస్త్రజ్ఞానాధికు లగుటచేత తమ విషయములు
చక్కచేసి ఇతరదేశములమీద కూడ అధికారము సంపాదిం
చిరి. ఇట్టి ప్రతిఘాతము ఇండియాకు వచ్చుట చాల ఆలశ్యమై
నది. కాని రానేమొ వచ్చినది. ఇకనైనను దేశీయులయోచన
ప్రపంచపదార్థములవంక నొకింత తిరిగెనేని దేశాభివృద్ధి ఒక్కపె
ట్టున యెక్కువగును.

(2) రెండవకారణ మాలోచింతము. మనదేశపువారి ఆవ
శ్యకములు మిక్కిలి తక్కువ (అనగా మనకు కావలశిన పదా
ర్థములు మిక్కిలి తక్కువ) యగుటచేత యంత్రము లభివృద్ధిచే
యుటకై పూనుకొనవలశిన యావశ్యకము యెవరికిని లేకపో
యినది. 'a' మన దేశములో చాలభాగము ఉష్ణమండలమునం

దున్నది. అందుచేత బట్టలు మానసంరక్షణముకు మాత్రమే కావలశివచ్చినవిగాని చలిదేశములందువలె దేహసంరక్షణము నకు ఆవశ్యకములు కావు కనుక నేతపనికి చేతిపనియే సరిపో వుచుండినది. చేతిమగ్గములమీద అభివృద్ధిచేయుటకు ఇంగ్లం డులోనుండునట్టి ప్రోత్సాహకారణము లేకపోవుటచేత మన మగ్గములింకను పూర్వమునందున్నట్టుగానే యున్నవి. (b) మ న దేశమున వర్షాతపములు మెండగుటచేతను, మనకు కావలశి న జీవనావశ్యకములు కొన్నియె యగుటవల్లను అవి యన్ని యు ఆయాప్రదేశములందే పండుచుండినవి. ఎక్కడిబట్టలకు కావలసిన నారపదార్థ మక్కడనే దొరుకుచుండినది. ఎక్కడి తినుబండారములు అక్కడనే యుత్పత్తియగుచుండినవి. ఎక్క డి ఇండ్లకు కావలశిన మన్ను అక్కడనే దొరుకుచుండినది. ఇం దుచేత ఇతర భాగములనుండి యెగుమతికాని అక్కడినుండి దిగుమతికాని చేయవలసిన యావశ్యక మంతగా లేకుండెను. ఇట్టి స్థితిలో కావలసిన వర్తకపు సరుకు మిక్కిలి తక్కువగా నుండును. దానిమోతకు మూటమనిషి, కంచరగాడిద, యెద్దు బండి చాలియుండెను. కతాచితుగా ప్రయాణము చేయువారు నడవలేక పోయినయెడల వారు బండితోగాని పల్లకీతోగాని తృప్తిపొందుచుండిరి. కాబట్టి ప్రయాణీకులయొక్కయు సరు కులయొక్కయు రాకపోకల సౌకర్యములను పరుగిడు కోచీ బండినుండి పొగబండివరకు యూరోపునందు అభివృద్ధి చేసిన ...ులు మన దేశమున అభివృద్ధిచేయుటకు తగిన ఆవశ్యకము ...ుండలేదు. విమర్శనాబుద్ధి పనిచేయుటకు తగిన యవసరముం ...లేదు. ఇపుడు విదేశీయులు రకరకములైన యంత్రములు

మగ్గమువద్ద విసుగులేక కూర్చొనియుండువాడా యంత్రములన భివృద్ధిచేయువాడు! ఎంతదూరమైనను నెద్దుబండిమీద విసుగు లేక ప్రయాణము చేయగలవాడా మోటారుబండిని కనిపెట్టు వాడు! ఇట్లనుటచేత ఓర్పు తగదని చెప్పుటలేదు. ఓర్పుమంచిది నిజమేకాని ఇది యన్నివిషయములందును తగదు. జోబు (Job) యొక్క ఓర్పు మంచి సుగుణమని లోకప్రసిద్ధి చెందినది. జోబు ఒకడేగాక ఓర్పుగల జంతువు మరియొకటి కలదు. ఇది 'ఓర్పుగల గాడిద'. ఇందుచేత ఓర్పు రెండురకములని తేలుచున్నది. నిజమైన దైవభక్తి కలిగి యెట్టికష్టములు వచ్చినను జోబువలె ధైర్యముతో ననుభవించునట్టి యోర్పుఒకటి. చేతకాక చేయునదేమియు లేక చాకలగాడిదవలెనూరకపడియుండుఓర్పు రెండవది. ఈ రెండవ యోర్పు మనకిపుడు తగదు.

ఇతరదేశీయు లీవిషయమునం దెట్లున్నారో ఆలోచింతము. ఇంగ్లీషువారు ఓర్పులేనివారు. అందుచేత వారి బ్రతుకంతయు తొందరయే. వీరు నియమితకాలమునందు ఒకసారికంటెను నొకసారి యెక్కువపని చేయవలయునని తొందరపడుచుందురు అందుచేత వారు నిరంతరము క్రొత్తసంగతులు కనిపెట్టుట యందధిక ఇచ్ఛగలవారై కాలానుగుణ్యముగ త్వరత్వరగా ప్రవర్తించుచుందురు. అమెరికా దేశమువారి కింతకంటెను ఓర్పుతక్కువ కాన వారిబ్రతుకు మిక్కిలి తొందరబ్రతుకు. అందుచేత వారు మరింతయెక్కువగా నూతనవిషయములను కనిపెట్టుచుందురు. మనకన్ననో తాలిమి యెక్కువ గనుక తొందరలేదు. నూతనవస్తువుల కనిపెట్టుటలేదు. తాలిమియుంట మంచిదేకాని దానివల్ల నష్టము కలిగినపుడు అది తగదని మన

మెరుగము. అదృష్టవశమున నిప్పుడిప్పుడు మన దేశమున జీవనము తొందర యగుచున్నది. కావున మనము తొందరపడుటనేర్చుకొని క్రొత్త వస్తువుల కనిపెట్టి కాలానుగుణ్యముగా వెనుకపడకుండ ముందునకే నడువ నెత్నించవలయును. ఇందుకు ప్రకృతిశాస్త్రజ్ఞాన మత్యావశ్యకము. దీనివల్ల మూఢవిశ్వాసములు పోయి ప్రకృతిశక్తుల కనుగుణ్యముగా పనులు చేయుట కలవాటుపడుదుము.

(4) ఈ విమర్శనాబుద్ధి యభివృద్ధిచెందకుండుటకు మనకుండు యథాస్థితిపరాయణత్వము (conservatism) నాల్గవ కారణము. ఇది మనయందు బాగుగ నాటుకొని ముదిరియున్నది. పూర్వపు మగ్గములందు కాని, కుమ్మరి సాలెయందు కాని యంత్రోపాయము చేయుటవల్ల నేమైనను మార్పు రాగలిగనేని యది మహాపాతకమని నిన్నటివరకు సామాన్యజను లనుకొనుచుండిరి కదా. కావ్యసౌందర్యమెరుగని జనులనడుమ కవి పనికివచ్చునా! సానుభూతిలేని (Unsympathetic) మూకయెదుట కవి తన పద్యములు చదివెనేని యవి వారికి రుచించునా? ఆతని పిచ్చివాడందురుకదా. అలాగుననే కల్పనావిజ్ఞానములేని మన పూర్వీకులయెదుట భారతీయకల్పకు (Inventor) డొకడు వన్నెకెక్కునా? స్వకల్పితమగు క్రొత్త మగ్గమునుగూర్చి యతడు వర్ణింపజొచ్చెనేని ఆతని వెఱ్ఱివాడని తలచియుందురుకదా!

ఈ యథాస్థితి పరాయణత్వము (Conservatism) ఇప్పటికైనను పూర్తిగా పోయినది కాదు. కాని జాతి నీతి బాహ్యములగు మద్యపానము సిగరెట్లు కాల్చుట, పాడుపుస్తకములు చదువుట మొదలగు దురభ్యాసములందు మనము తగసి ధారా

శము చూపుచునే యున్నాము. అయిన నిది ప్రస్తుత ప్రశంసకు దూరము. మనము ముఖ్యముగా గమనింపవలసిన విషయ మేమనగా మనకుండు యథాస్థితి పరాయణత్వము మన జాతీయాభివృద్ధి కొక గొప్ప యాటంకమనియు, మన జాతీయజీవనములో (National life) లేశమయినను వదలుకొనవలసినది లేదనియు, మనకభివృద్ధికరమగు మార్పులనుమాత్రమే సంతోషపూర్వకముగ గ్రహించుట కికముందైనను సిద్ధముగానుండవలయుననియు మనమెరుగవలయును.

పైని చెప్పవలసిన దానికంతయు నొక విచారకరమగు సంగతి చేర్పవలయును. విద్యాశాఖవారి యుద్దేశము యెంత మంచిగానున్నను నిజస్థితినిబట్టి చూడగా నిప్పటివిద్య భారతీయుల విమర్శనాశక్తిని వృద్ధిచేయుట లేదు. ఇందుకుబదులు కాలేజీలనుండియు, పాఠశాలలనుండియు బయలుదేరు విద్యార్థులయందు అదివరకుండిన విమర్శనాశక్తి కూడ తగ్గిపోవుచున్నట్లు కనపడుచున్నది. ఎట్లనగా మన విద్యార్థిముందర కఠినమైన పరీక్షలెన్నియోయున్నవి. అందుచేత విద్య నేర్చుకొను కాలమునందు పరీక్ష ముఖ్యాంశములపట్టికయందు లేనిదేదియు తనకవశ్యకము లేదని యాతడనుకొనును. ఆంగ్ల బాలుర కటుకాదు పబ్లికుపరీక్షలోని యోగ్యతాపత్రిక యాతని విద్యార్థి దశకు School career) సొమ్మువంటిది. అదియొక విజ్ఞానచిహ్నము. అందుచేత పరీక్షలకు చదువునప్పుడు కూడ కావలసినంత విరామము కల్పించుకొని యుక్తములైన అభీష్ట మనోరథములందు Hobbies) కాలము గడుపుదురు. మన మట్లు కాదు. మనకు యోగ్యతాపత్రికయే ముఖ్యమైనది. దీనియొక్క ప్రాముఖ్య

మింతయని చెప్పుటకు వీలులేదు. దీనిని సంపాదించుకొననిచో వ యైనేని మంచి సంబంధము తప్పిపోవుటయేగాక జీవనోపాయము కూడ లేకపోవును. ఇందుచేత పరీక్షకు చదువునప్పుడు విద్యార్థి తన సర్వశక్తులను వినియోగించి పరీక్షకులు అడుగునట్టి రన్నయంశముల నన్నిటిని శ్రద్ధగా నేర్చుకొనును. ఇతనికి విజ్ఞాన (culture) మక్కరలేదు. నవాన్వేషణము Research) కాలహరణము. రేడియం (Redium) వింతయైన లోహము కావచ్చును. దీని పేరు రసాయన శాస్త్రి ముఖ్యాంశపట్టికయందు చేరిన యెడల దాని సహజగుణములను (Properties) గురించి తెలిసికొనుట కాలహరణమని అతడనుకొనును. పరీక్షవిషయములో నో ఇటుకాదు. ప్రతిపాఠమునందును కావలసినంతవరకు మాత్రము నేర్చుకొనుట యత్యావశ్యకమని గట్టిగా ననుకొనును. ఇంగ్లీషుభాషా పఠనీయ గ్రంథములందు ఇతని నవాన్వేషణము "స్మిత్ సర్ గారి టిప్పణము — గ్రంథము టిప్పణసహితము పుటలు ౮౦" తో ముగియును. రేఖాగణితమునందును బీజగణితమునందును పుస్తకములో నున్నదానినే (Book work) నమ్ముకొనును. ఇట్టి చదువుతో పరీక్షకును జీవనమునకును బాలుడు తయారగును! వాఙ్మయమునందును చరిత్రయందును ప్రకృతిశాస్త్రములందును అచ్చటచ్చట వచ్చి, విమర్శనాశక్తిగల విద్యార్థిని నవాన్వేషణమునకై పుస్తకభాండాగారమునకు పంపు నప్రస్తుతవిషయములు (side issues) ఇతనికి సరిపడవు. ఇతనికి కావలసిన దంతయు పరీక్షలో పేరునవారి పట్టికలో తన నంబరుండుటయే. ఇట్టిచదువుచేత తన విమర్శనాశక్తిని చంపివేసి తన జ్ఞాపకశక్తిని మాత్రము వృద్ధిపొందించుచుండును.

ఇతరులు చెప్పినది నేర్చుకొనగలిగెను. కాని తనకై తాను నే ర్చుకొను శక్తి సంపాదింపడయ్యెను. ఇతరుల సాహాయ్యమేకా వలసినవాడుకాని స్వయంసహాయశక్తిని పోగొట్టుకొనెను.

పరీక్షలో సులభముగా నుత్తీర్ణులగుటకై చేయుచుపాయము లలో ఇంటియందు బాలురకు పాఠములు చెప్పించుట (Private tuition) యొకటి. పాఠశాలయందు చేయబడు బోధన చాలద నియు దానికితోడు ఇంటియందు పాఠము చెప్పించుట మంచిద నియు తలచి కొంత జీతమిచ్చి ఇంటివద్ద పాఠములు చెప్పింతు రు. ఇట్టిది యనావశ్యకమనితోచును. తరగతికి తగినవాడై నపక్ష మున పాఠశాలలందు బోధచేయు సంగతులు తెలిసికొని పరీ క్షలయందు తేరగలుగును. ఇందుకు బదులు పాఠశాలయందొ క బోధకుడును ఇంటియందొక బోధకుడును ఉండుటచేత ఆ లోచనయంతయును బోధకులే చేయుట తటస్థించుచున్న ది. ఇట్టివారు స్వశక్తులను కోలుపోయి అనంతర జీవనములో పరులనే నమ్ముకొనియుండవలసి వచ్చును. అనంతర జీవనమననే ల విద్యార్థిగా నుండునపుడె పైతరగతులలోకి వెళ్ళినపుడు అట్టి బాలురు పడు చిక్కులు అనుభవనీయులకే తెలియును. ఇట్లు నుటచేత నింటివద్ద బోధకులుండుటవల్ల బొత్తుగా లాభములే దని చెప్పజాలము. ఒకరిద్దరిబాలురకు తెలియునటు చెప్పుచు వారియొక్క జ్ఞానతేజస్సును వికసింపజేయ నెత్నించుట గొ ప్పవిషయముకాని పాఠశాలయందుండు విధమున 10, 14 బా లురనుంచుకొని వారికి విద్యంగరపుదురన్న మాట వట్టిబూట కమనియె తలపవలయును. మొత్తముమీద నది యనావశ్యక మనియు స్వయంసహాయశక్తికి వేరుపురుగనియు చెప్పకతప్పదు.

ఇప్పుడు చేయువలసినదేమి? ప్రతితల్లిదండ్రియు చిన్నతప్పటి నుండియు పిల్లవాండ్రు ఆలోచించునట్లు చేయవలయును. వింత వస్తువులను చూపి ఆవస్తువులగురించి ప్రశ్నలడిగి వారిని మరల మరల ప్రశ్నలడుగునట్లు చేయవలయును. గోడమీది సాలెపురుగు, పొలములోని పుష్పము, నదిలోని రాళ్ళు మొదలగువాని నన్నిటిని చూపి ఈ వస్తువుగురించియు ఆ వస్తువుగురించియు వింతసంగతులు కనిపెట్టించుచు వారివిమర్శనాశక్తిని అభివృద్ధిచేయవలయును. ఈవిధముగా పెరిగిన బిడ్డ ఇతర బిడ్డలకంటె మంచిస్థితియందుండును. మన దేశమందు తలిదండ్రులు బాలురు నాటి పాఠములు చదివి నాటి కాపీలు వ్రాసినంతమాత్రముననె తృప్తిపడక వారి అవగాహన శక్తిని బలపరుచు చుండవలయును. ఇట్లు చేయుటచేత విమర్శనాబుద్ధి స్థిరపడజేసిన సామాన్యపు తప్పుబోధనయు (Educational stiffening) [illegible] తపజాలదు. విమర్శనా శక్తిని వికసింపజేయు కిండర్ గార్టన్ బోధనాపద్ధతి మనదేశమునందభివృద్ధి యగుట దేశమునకు శ్రేయస్కరము. ఈపద్ధతిప్రకారము బోధించు బోధకులు దొరకుట దుర్లభము. ఇండియా గవర్నమెంటు వారివలన అమలులోకి తేబడిన నూతనపద్ధతి ప్రకారము ప్రతిపెద్దవిద్యార్థికిని స్వాన్వేషణాభ్యాసము (habits of research) కొంచెము కలుగవచ్చును. కాని చిన్నవయసునందే యిట్టిపద్ధతులు అలవడలేని పెద్దవయస్సునందు యెంత శ్రమమీద కాని అలవడుట దుస్తరము. కాబట్టి పిల్లవాండ్ర విషయమై యెక్కువ శ్రద్ధతీసికొనవలయును. చెట్టుగ వంగనిది 'మానై వంగదు' అను సామెత ప్రకారము

“పిల్లలవిషయము శ్రద్ధతీసుకొంటిమేని పెద్దలు వారంతనే శ్రద్ధతీసుకొందురనుట” నిక్కము.

ఆఱవ ప్రకరణము.

## పరిశోధన (Investigation.)

సద్బోధనచేత మన గ్రామవాసియందు విమర్శనాభావము పుట్టి ప్రదర్శనశాలయందు పరిశ్రామిక ప్రదర్శితముల (Industrial exhibits) చూచుటచేత నూతనభావములు (ideas) కలిగి, పరిశ్రామికోద్యోగ మునస్కుఁడై యున్నవాఁడనుకొందము. ఇతడు వాణిజ్యపరిశ్రమాభివృద్ధి చేయుట దేశాభిమానమని తెలిసికొని తనకును తన దేశమునకును మేలుచేయు కుతూహలము కలవాఁడై యున్నాఁడనుకొందము.

---

వెనుకటిప్రకరణమున ‘విమర్శన’ ‘పరిశీలన’ అనుపదములను వాడితిమి. ఈ ప్రకరణమునందు ‘పరిశోధన’ యనుపదము వచ్చినది. పదములను యేయర్థమునందు ప్రయోగింపబడినది చెప్పుట చదువరులకు కొంతసహాయముగా నుండును. మనమొకయూర నొక పరిశ్రమ పెట్టవలయునని తీర్మానించుకొంటిమనుకొందము. అప్పుడు మనమాయూరికి వెళ్ళి అచటనుండు పదార్థములు, రాకపోకల కానుకూల్యములు, జనులు, వారివృత్తులు, వారి నిపుణత మొదలగువాని ముందు తెలిసికొందుము. ఈపని చేయుటకు మనము కన్నులు తెరచి చెవులు మూసికొనక సమస్తము నవలోకించవలయును. లేని యెడల కొన్ని సంగతులు జారిపోవును. ఇట్లతిజాగ్రతగా సంగతులు సేకరించుటను, ‘విమర్శనము,’ ‘పరిశీలనము’ అనిపేరు. వీనినన్నిటిని యోచించి ఇది అనుకూలము ఇది ప్రతికూలము, ఇది మంచిది ఇది చెడ్డదియని నిశ్చయము చేయుటను పరిశోధనమని చెప్పెదము, [illegible]

ఇట్టి సదుద్యమమునందు తనతో[illegible]
యపడునట్లు ఒప్పించగలిగెనేని, తానొకడే [illegible]
ల పనికంటె గొప్పదియు నెక్కువ లాభకారియు[illegible]
న కార్యము నెరవేర్పగలుగుదునను గట్టినమ్మ[illegible]
కుబడి గలవారిని తన మతమునకు త్రిప్పు[illegible]
మచావడియెదుటి మఱ్ఱిచెట్టుక్రింది తిన్నెనిరాడ[illegible]
భివృద్ధి యెటుచేయనగునా యని మనసార[illegible]
చేయుచుండును. ఇతని జీవితకాలమునందంతయు[illegible]
త్కృష్టమైన క్షణము మరియొకటి యుండునా! [illegible]
తడు భగవత్ప్రేరితమునకై వేచియుండు దీర్ఘదర్శ[illegible]
మతబోధకుఁడో (Preacher) అవతారపురుషుఁడో [illegible]
న్నవాఁడు. ఈ క్షణమునందితని హృదయమును [illegible]
నది దేశమును ప్రజలను బాగుచేయు [illegible]
[illegible]ధ్యానము చేయుచుండినదేది? పొరుగువారి [illegible]
రవల[illegible] తన భూమికి పారునట్ల [illegible]

---

క్షణమె పోలీసువారు విచారణకు వెళ్ళుదురు. శవము [illegible]
తులను కనుగొందురు. చచ్చినవానికి శత్రువులు ఎవరె[illegible]
న్నారో తెలిసికొని శవమును పరీక్షచేసి [illegible]
ల్ల తెలిసికొని ఈసంగతులన్నియు న్యాయాధి[illegible]
నినే 'పరిశీలనము' 'విమర్శనము,' అని చెప్పవచ్చును. [illegible]
కారి ఈసంగతులన్నిటిని విని సాక్షులను [illegible]
కొని తీర్పు చెప్పును. ఇదియే 'పరిశోధనము.' [illegible]
శోధన బాగుగా జరుగగలదు. పరిశీలనమువల్ల [illegible]
నవల్ల ఈసంగతులను జల్లించి నిజస్థితిని తెలిసికొందుము.

వేయవలయుననియా? పొరుగువారి భూమిని అపహరించుటకై వ్యాజ్యము దాఖలుచేయవలయుననియా? కాదు కాదు. తనను పొరుగువారిని ఉమ్మడిగా భాగ్యవంతులను చేసి పేరు ప్రతిష్ట లేని తన పల్లెటూరిని పట్టణవాసముగా చేయునట్టి పరిశ్రామికోద్యమమును స్థాపించుటయే ఇతని ముఖ్యాభిమతము. కాని అట్టి పరిశ్రామికోద్యమ మెద్ది?

మన గ్రామవాసికి ధనసంపాదనయే ముఖ్యమయినయెడల డబ్బుదొరుకు పరిశ్రమను చూపుట అంతకష్టముకాదు. ఈ ప్రయోగమిందుకు (experiment) పనికివచ్చును. ఒక పాలు నెయ్యి రెండు పాళ్ళు కూరపొడిని తీసికొని ఈ రెంటిని బాగుగా కలిపి శెనగగింజలంత మాత్రలు చేసి 'శక్తివర్ధకపు మాత్రలు' అను పేర 50 మాత్రల పెట్టెను 2 రూపాయల కమ్ముటవల్ల డబ్బు రాగలదు. కాని ఇందుకు దేశాభిమాన మేమైనకలదా! ఇట్టి మన గ్రామవాసి కెంతమాత్రము తగదు. ఇట్టివి లాభకరములు కావా యేమి? ఇట్టి యుద్యమములు నిశ్చయముగా లాభకరములేయనుట కొక నిదర్శనమున్నది. ఏమన మనశక్తివర్ధకమువంటి మందులకు అమ్మకముండనియెడల, ప్రకటనలు అచ్చువేయ నొప్పుకొను ప్రతిభారత వార్తాపత్రికయందును అంత పెద్ద పెద్ద ప్రకటనలుండజాలునా? దీనిని చూడగా రెండు విచారవిషయములు తేలుచున్నవి. (1) మనదేశమునందు 'శక్తివర్ధకము' రకముల మందులకంత గిరాకియుండుట యొకటి (2) అట్టి అనుమానాస్పదమగు మందులు ప్రకటన కెక్కుటయొకటి.

గ్రామవాసి తన స్వలాభమునే ఆలోచింపకుకాన త

నకును తన సహచరులకును గౌరవము కలిగించు ఉద్యమము మొదలుపెట్ట కృతనిశ్చయుడై యున్నాడని యనుకొందము. ఇతడు ఏపరిశ్రమ మొదలుపెట్టవలయునో మనము చెప్పజాలము. గ్రామవాసి తన పరిశీలనాబుద్ధిని ఉపయోగించ నిర్ధారణ చేయువలయును. ఎందుకనిన సమయ సందర్భములను స్థితిగతులను బాగుగా నాలోచించినంగాని యిట్టిపని తెగనేరదు. అందునకై ఇట్టి ప్రశ్నలువేశి చూచుకొనవలయును.

గ్రామమునకును ప్రపంచమునకును ఉండు సంబంధము యెక్కువచేయుట కేమైన సదుపాయములున్నవా? ఈ గ్రామము ముఖ్యముగా సరఫరాచేయగల వస్తువులలో నెద్దియైనను ప్రపంచమునకు కావలశియున్నదా? దీనిసమీపపు కొండలయందును అరణ్యములందును మైదానములందును, అభివృద్ధి చేసిన యెడల లాభమునిచ్చు ఉద్భిజ్జ జంతు, ఖనిజ, పదార్థము లెవ్వియైన కలవా? ప్రకృతము దీనదశయందుండి తగిన సాయము చేత నభివృద్ధికాగల స్థానిక పరిశ్రమ లేమైనకలవా? ఉత్పత్తి చేయు శ్రమను (labour of production) తగ్గించి ఫలితము (Productive out-turn) నధికముచేయు సదుపాయము లెవ్వియైనను గ్రామములోనికి తేగలుగుదుమా? అను ప్రశ్న లెన్నియైననుతోచును. పైవానికన్నిటికిని జవాబులిచ్చుట ఈ పుస్తకముయొక్క యుద్దేశముకాదు. పరిశ్రామికోద్యమమును అభివృద్ధిచేయ దలచువాడు పరిశోధించి ఆలోచన చేయవలశిన యంశములను సూచించుటయే దీని ముఖ్యోద్దేశము.

(1) ప్రదర్శనశాలయందు పరిశ్రామిక మనస్కుడగు మన గ్రామవాసి, చుట్టి చుట్టితిరుగు టాంబడిని చూచియుండవచ్చు

ను. ఈతని గ్రామము రైలుదారికి 10, 11 మైళ్ళదూరమున జనసమ్మర్దమగు ప్రదేశములోనుండు గ్రామమంజిరిలో నొకటియై యుండవచ్చును. ఈ గ్రామమునకును రైలుస్టేషనుకును నడుమ గ్రామములుండుటచేత ప్రయాణీకులు విధి విరుగడలేక తిరుగుచుండవచ్చును. మూటలు నెత్తిన వేసికొని నడుచు పురుషులు రొండిన బిడ్డలనెత్తికొని పోవుస్త్రీలును, నడుచుటచేత పుకపుక పొక్కిన పాదములుగల పిల్లవాండ్రును, దారిని కనబడుచుందురు. వాహనమేదైన దొరికెనేని వీరు రెండుణాలిచ్చి సంతోషముగ దాని నెక్కిపోదురుకదా! ఈ ప్రయాణీకులేగాక బరువైన సరుకుమూటలు వేసికొని వానిని స్టేషనుకు తీసుకపోవుటయే గొప్పపనిగా తిరుగుచుండు సరుకుబండ్లనేకములుండును. ఇట్టిస్థితియందు ఒక తేలికట్రాంబండి (Tramway) దారినినడుచుచుండెనేని యెంత లాభకరముగానుండును! ఇనుపదారికిది సహకారియు (feeder) ప్రయాణీకులకు మహోపకారియునయి వాణిజ్యవృద్ధికి కారణమగునుగదా! ట్రాంబండి దారి వేసినవారికి అధికలాభముకూడవచ్చును. ఇనుపపట్టాలు వేయుటకంత ధనము వ్యయముకాదు. గుఱ్ఱములుకాని యెద్దుకాని లాగు 'ఒంటికమ్మి ట్రాంబస్సు' (monorail tram cars) మొదలు, కొంచమెక్కువ ఖరీదయినను మొత్తముమీద చవుకగనుండి ఆవిరియంత్రముతోకాని, విద్యుద్యంత్రముతోకాని లాగబడు తేలికపొగబండ్ల (Light Railways) వరకున యెన్ని రకములబండ్లయినను కలవు. ఇట్టి సందర్భమున ధనముకల వారు కొంచమెచ్చుతక్కువగ నందరును కలిసి ఒక సంఘముస్థాపించిరేని ఈ పనిత్వరగా నెఱవేరవచ్చును. అప్పుడీగ్రామము

ఎట్లుమారునో యోచింతము (1) పొగబండివలన నీగ్రామమునకు ప్రపంచముతోటి సాంగత్య మెక్కువయగును. ఫల ధాన్యములు ప్రపంచపు <u>మార్కెట్టు</u> (Markets) లకు సులభముగాను త్వరగాను పోవును. అంతకుముందు నేలమీద నిరుపయోగముగ పడి అగ్గుగానుండిన కలప సులభముగా సాగిపోగలుగుటచేత మంచిఆస్తి యగును.

(2) అటుగాక జనసమ్మర్దముకలిగి ధాన్యసంపత్తియుండి వాహకసౌకర్యము (transport conveniences) లేకపోవుటచేత నిరుపయోగముగ పడియుండు కలపనుగలిగిన ఈ గ్రామముంజరి రైలునకు అతిదూరమున నున్నదనుకొందము. నావయాత్రకు యోగ్యమైనట్టి నది యొకటి దీనికి సమీపముననుండెనేని దానినుండి వచ్చుకాలువ ఈ గ్రామములనన్నిటిని ప్రపంచముతో కలుపును. ఈ కాలువకు కర్చుఅంతగా పనిలేదు. ఒక పడవకు తగినంత వెడల్పుగలిగి రెండేసి ఫర్లాంగులకొకచోట యెదుటిపడవలు దాటుటకు తగినంత వెడల్పుగా నుండునటుల కాలువ మొదట త్రవ్విన చాలును. ఈ పని యొక చిన్న <u>జాయింటు స్టాక్ కంపెనీ</u>కి సాధ్యముకాకపోదు. దారియందు అరణ్యములుండెనేని కాలువద్వారా కలపను దూలములను నీట తేలాడుచు సముద్రమునకుచేర పంపవచ్చును. ఈ నదీముఖద్వారమున పట్టణమేదియు లేకుండినట్టయిన ఈ గ్రామవాసులొక గ్రామరేవు నేర్పాటుచేయవచ్చును. అదిత్వరలో గొప్ప పట్టణమై సముద్రపునావలు నిలుచు రేవగును.

(3) ఇట్టి వ్యవస్థలు గ్రామవాసికి కొంచెము పెద్దవిగా నుండవచ్చును కాని పరిశ్రామికోద్యమము గల స్వల్పధనికులకు

తగిన చిన్న పరిశ్రమలు కూడకలవు. ప్రదర్శనశాలయందు నీ రెత్తుయంత్రమును మన గ్రామవాసి చూచియుండవచ్చును. దీని విషయమంత శ్రద్ధపుచ్చుకోవలసిన లొందర లేకయే ప గలంతయు పనిచేసి పైనుండి మంచినీటిధారను ఈ యంత్రమి చ్చుచుండినదిగదా! దీనికిని ముందుకును వెనుకకును ఊగుచు నడుచుచుండు మోటమొద్దకును, యేమి సంబంధమున్నది? ఈ యంత్రమునల్ల వచ్చునీటికిని యేతవునీటికిని సంబంధము బొత్తు గా నుండనుకదా! కాన మన గ్రామవాసియు అతని స్నేహి తులును కలిసి ఒకటి రెండు యంత్రములచేత ఎంతమేలు చే యవచ్చును! వీరికి మంచిఊట దొరికెనేని సహకారసంఘము నేర్పాటుచేసి ఒక పంటకాలువ త్రవ్వి దానిచేత ఎక్కువ వై శాల్యమునకు నీటిసరఫరా చేయవీలుండును, ఎట్లుకొనుట ప్రి యము. వానిని ప్రతిదినము చూచుకొనుచుండవలయును. వీటి లిండి ఖరీదు యంత్రమునకు వేయి బొగ్గునకు చాలును. ఏలా గైనను కొందరు తెలివి తేటలుగలవారు కలిసి కొంచెముమూ లధనముగల సహకారసంఘము నేర్పర్చిన యెడల నీటిపారుదల పద్ధతి యిప్పటిదానికంటె మంచిస్థితియందుండకపోదు.

4) వింటిరా! కిఱ్ఱు కిఱ్ఱు మని గానుగశబ్దము వినవచ్చు చున్నది. గిత్తలు చుట్టిచుట్టి నిమ్మళముగా తిరుగుచున్నవి. పి ల్లవాడు రాయిప్రక్కన తిరుగుడుకఱ్ఱమీద కూర్చొని గిత్తల తోలుచున్నాడు. గానుగలోని విత్తనములు మెదిగి నూనె మె ల్లగా కారుచున్నది. పూర్వకాలమున కీ పురాతనయంత్రము తగియుండెనుకాని ఈ కాలమునకిదితగదు. వీనికంటె త్వరగా ను తేలికగాను పనిచేయు గానుగలు పెద్ద పట్టణములలోను

చెరసాలలయందును చూడవచ్చును. వీనివలన పని తేలికగా జరుగుటయేగాక నూనెయెక్కుపగా నుత్పత్తియగును. ఇట్టి యంత్రమును సంపాదించి పనిచేయుటకు మూలధనము కొంచెమేచాలును. కావున నొక చిన్నసహకార సంఘమేర్పడి గాండ్లపనిని (తెలుకులపని) మంచి పరిశ్రమక్రింద అభివృద్ధిచేయవచ్చును.

(5) ఆవీధియందు సాలెవారు కుంచలతో పడుగులు సాగదీయుచు శ్రమపడుచున్నారు. తరువాత యీ పడుగులను పురాతనపు మగ్గముల మీదికెత్తి నేతమొదలుపెట్టుదురు. కూలివారు తక్కువకూలికి పనిచేయుచున్నారు. వీరికిచ్చుకూలి వీరితిండికెచాలదు. కూలి యింత చౌకయయినను ప్రత్తి సమీపపుపొలములలో పండుచుండినను ఆగ్రామయువతి మాంచెస్టర్ బట్ట కట్టుకొనియున్నదే! ఇదెందుకు? సాలెవారు కాలమునకు తగినవారుకాక వెనుకపడియుండుటయె కదా ముఖ్యకారణము. ఇటుగాక తెలివితేటలు ఉద్యమాసక్తియు కలవారు పనిచేసిరేని, ఆయాస్థలములందు నేతపరిశ్రమను కాలానుగుణ్యముగ మరల క్రమపరచి విదేశపుపోటీని లక్ష్యము చేయకుండునటుల కావలసిన సరుకును సరఫరా చేసియుందురుకదా! ఇట్టివారెక్కడ దొరకగలరు!

(6) పశువు లపరిమితముగా నుండు జిల్లాలయందు తోళ్ళ ఉత్పత్తి అధికముగనుండును. ఇప్పుడీతోళ్ళన్నియు విదేశములకువెళ్ళి లాభమంతయు వారికే ఇచ్చుచున్నవి. ఇట్లెందుకు జరుగవలయును? తోళ్ళుతీయు జిల్లాలయందే వానిని పదును చేసి మనకెక్కువగు చర్మముల నేల యెగుమతి చేయరాదు?

మంచితోళ్ళ కారుఖానావల్లను, చర్మపుసరుకులు తయారుచే యుటవల్లను లాభము తప్పక వచ్చునుకదా! కాబట్టి ఒక సహకారసంఘమేర్పడి తోళ్ళ నన్నిటిని కొని మంచి పద్ధతిప్రకారము పదునుచేసి చర్మపుసరుకులను తయారుచేయుటకు తగినసాధన సామాగ్రిని సంపాదించి మాదిగవాండ్రను కొందరిని సరియైన తనిఖీక్రింద నేర్పాటుచేసి, ఆయా భాగములకు కావలశిన చర్మపుసరుకుల నేగాక, ఇతరభాగములకును ఇతరదేశములకును సప్లయిచేయుటకుగాను నాణ్యమైన సరుకులను తయారుచేసెనేని ఈ సంఘమునకు యెంతయైనను లాభమువచ్చును. ఆజిల్లాకిది మహోపకారము చేసినదగును.

(7) బర్మాలోని ఆవిరి రంపపు యంత్రములకు మంచిలాభము వచ్చుచున్నది. మన దేశమునందు ఇప్పటికిని చేతిరంపము లే పనిచేయుచున్నవి. నిస్సందేహముగా చౌకయేగాని కలప సప్లయి యెక్కువగనుండి దానిని సాగించుటకు తగిన సౌలభ్యములుండుచోట ఆవిరి రంపపు యంత్రములే యెక్కువచౌకగానుండును. ఇంతేగాక కోతబల్లలను సులభముగా యెత్తిపెట్టి కట్టలుకట్టవచ్చును గనుక వాని యెగుమతిచేయుట సులభము. కాబట్టి గ్రామసమీపమున అరణ్యములుండి సాగించుటకుతగిన సౌకర్యము (వాహన సౌకర్యములు) లుండెనేని మన గ్రామవాసి సహకారసంఘమొకదానిని యేర్పాటుచేసి ఆవిరి రంపపుయంత్రములచేత పని చేయించినయెడల ఆతడు యెక్కువకలప యెగుమతిచేసి మంచిలాభము సంపాదించినవాడగును.

(8) ఇంతవరకును అచ్చపు పరిశ్రామికోద్యమముల గురించి చెప్పితిమి. మనగ్రామవాసి తనకును తన దేశమునకును

లాభమునిచ్చి మేలుచేయునట్టి మరియొక రకపు జాయింటుస్టాకు కంపినీలను యేర్పాటుచేయవచ్చును. ఇదియే గ్రామబ్యాంకును యేర్పాటుచేయుట. ఇట్టిది బ్యాంకియొకటి యుండి సరియయిన పద్ధతిప్రకారము జరుగుచుండినట్లయిన అది మంచి లాభదాయకమగుటయెగాక జిల్లాలో నుండువారినందరిని దురన్యాయమగు వడ్డీవ్యాపారపు ఆపదలనుండి రక్షింపజాలును. ఇట్టిబ్యాంకునకే అప్పుతీసుకొనను వారందరు వత్తురు. దుర్వ్యయము చేయువారను కారణముచేత ఈ బ్యాంకు యెవరికి అప్పుయియ్యకూడదు. అట్టివారలు మాత్రమే సాహుకారులవద్ద అప్పుతీసికొనుటకు వెళ్లుదురు. ఈ బ్యాంకులు ఇతరదేశములందెంతపని చేయుచున్నవో వినినవారలకె తెలియును.

ఇంతవరకును పరిశ్రామికాభివృద్ధియందు యెట్టిసులభసాధ్యము లున్నవో వానిని గురించి తప్పిళ్ళలోకి దిగకుండ పైపైన కొన్ని ముఖ్యాంశములను చెప్పితిమి. మరికొన్ని విషయముల నాలోచింతము. గ్రామము వెనుక కనబడు కొండలయందు రాగిగాని ఇనుముగాని నేలబొగ్గుగాని మరియే ఇతరఖనిజ పదార్థమయినా మనకు తెలియకయుండవచ్చును. అట్టి స్వభావ సంపదను బయటికి తెచ్చుటకు మంచి తెలివితేటలు గల నైపుణ్యులు కావలయును. ఇతడెక్కడ దొరకగలడు? ఈ విషయమునకూడ మన గ్రామవాసి దేశమునకు మేలు చేయవచ్చును. తన కుమారుని కచ్చేరియుద్యోగమునకు గాని వకీలుపనికిగాని పంపుటకు బదులు ప్రకృతిశాస్త్రజ్ఞానము కలిగించి భూమియందు దాగియుండు స్వభావసంపదను వెతుక బంపవచ్చును. నేలబొగ్గునకీ సమీపమున్న ఇనుపగనిని కనిపెట్టినవాడు దొర

శనమునకు యెక్కువ కీర్తిన్యాభివృద్ధి తెచ్చిన యువ్యోగస్థుని కంటెను, ఉన్నత న్యాయస్థానమునందు మంచి సక్తయను పే రుపొందిన వకీలుకంటెను దేశమునకు యెక్కువ మేలుచేసిన వాడగును. మనగ్రామవాసియొక్క కుమారుడు తెలివితేటలు గలవాడనుకొందము. వీనిని మనదేశమున ప్రకృతిశాస్త్రవిద్య యందు బి. యస్. సి. (B. Sc.) వరకు చదివించుటకును, అటుతరువాత అతనిని విదేశములకు పంపి అచట ఖనిజశాస్త్ర ము (Mineralogy) ఎలెక్ట్రికల్ యింజనీరింగు (Electrical Engineering) నేర్పించుటకును కావలసిన ద్రవ్యమును మనస్థైర్యము మనగ్రామవాసికి ఉండినయెడల ఆచిన్నవాడు మనదేశమునకు వచ్చి తనకును తన దేశమునకును లాభమునిచ్చు ఘనకార్య ము నొకదానిని చేయుట అంత అసాధ్యముకాదు.

అదృష్టవశమున ఇట్టి విద్యార్థులకు సాయము లేకుండలే దు. మనదేశమునుండి యూరోపునకు వెళ్ళి యెద్దియైన నొకప రిశ్రామికవిద్యను నేర్చుకొనుటకై యేటేటను ఒక విద్యార్థివే తనము ఇండియా గవర్నమెంటు వారు ఇచ్చుచునేయున్నారు. కడ చిన అయిదు సంవత్సరములందు విద్యార్థివేతన దారులు (1) నేత, (2) చర్మపు పరిశ్రమ, (3) రంగులువేయుట, తెలుపుచే యుట, ఛీటీగుడ్డలు తయారుచేయుట మొదలగువానికి సంబం ధించిన రసాయన శాస్త్రము (4) సబ్బుచేయుట (5) లోహశో ధన శాస్త్రము (Metallurgy) అను 5 పరిశ్రామిక విద్యలను చదివిరి.

దొరతనమువారు యేటేట నిచ్చు నొక విద్యార్థివేతనము ౩౩ కోట్ల భారతీయుల పరిశ్రామికత్వమునకు చాలదుకాన.

దేశాభిమానముగల కొన్ని సంఘములు ఈ పనికి తోడుపడుటయెంతయు తగియున్నది. ఇందుకుతోడు విద్యార్థులై విదేశములకు వెళ్ళి వారలకు ప్రతిఫలము కోరకయే సాయముచేయు యుదార మహానుభావులుకూడ కొంద రిపుడు బయలుదేరుచున్నారు.

ఇట్టి సంఘములలో ముఖ్యమైనది హైందవులయొక్క శాస్త్రీయ పరిశ్రామిక విద్యాభివృద్ధి సంఘము (Association for the advancement of scientific and industrial education of Indians). దీనికార్యస్థానము కలకత్తాలోనున్నది. ఇది సంవత్సరమునకు సుమారు 40 మందిని ఇంగ్లండు, జపాను, అమెరికా, ఫ్రాన్సు, జర్మని, స్వీడను మొదలగు దేశములకు పంపుచున్నది. ఇది 1904 సంవత్సరమున స్థాపింపబడినది. దీనికి అనేకమంది పెద్దమనుష్యులు పోషకులు. గవర్నమెంటు ఉద్యోగస్థులు సాయముచేయుదురు. బెంగాల్ గవర్నమెంటువారు సంవత్సరమునకు 5000 రూపాయలు విరాళమిచ్చుచున్నారు. తగిన విద్యార్థులను యూరోపు అమెరికా జపాను మొదలగు విదేశములకు పంపి శాస్త్రీ కళావిద్యల నభ్యసించుటకు కావలసినసాయము వారికి చేయుటయే దీని ముఖ్యోద్దేశము. విద్యార్థివేతనముల వితరణయందు ఈ సంఘము జాతి మత వివక్షత చేయుటలేదు. మొదటి సంవత్సరమున పంపిన ఆరుగురిలో నొకడు బంగాళీ మహమ్మదీయుడు, ఒకడు బెహారి మహమ్మదీయుడు, ఒకడు స్వదేశక్రైస్తవుడు, ముగ్గురితర జిల్లాలనుండి వచ్చిన భారతీయులు. ఈ విద్యార్థివేతనమున కర్హుడగుటకు యఫ్. ఏ. (F. A.) పరీక్షయందు తేరియుండవలయును. లేదా కనీసము

మూడు సంవత్సరములైనను సిబ్ పూరు ఎంజనీరుంగు కాలేజీ యొక్క (Sibpur Engineering) ఉమేదువారీశాఖ (apprentice department) యందుండి యుండవలయును. పరిశ్రమిక విద్యార్థులు అమెరికా యూరోపులందుండు కాలమున నెలకు 100 రూపాయిల వేతనమిత్తురు. జాపానుకు వెళ్ళినవారలకు ఖర్చు తక్కువగనుక 50 రూపాయిలు మాత్రమే యిత్తురు. ప్రకృతిశాస్త్రవిద్యార్థులకు ఇంతకంటె యెక్కువ వేతనములు దొరకును. 1911 వ సంవత్సరము మార్చినెలతో అంత్యమైన వివరణపు పట్టిక చదువుట కెంతో కుతూహలముగనున్నది. (1) దీనిని బట్టి చూడ ఈ సంఘము యేటేటను విద్యార్థులను విదేశములకు పంపుటయేగాక మనదేశమునందు వ్యవసాయపు ప్రయోగముల నెన్నియో చేయుచున్నది. దేవఘర్ (Deoghar) వద్ద వ్యవసాయపు సెటల్మెంటు (Agricultural Settlement) ఒకటి స్థాపింపబడినది. ఇక్కడ 40000 బైగాల భూమిని 300 వాటాదారులు సాగుబడి చేయుచున్నారు. రస్తాలు వేయబడుచున్నవి. వంతెనలు ఇండ్లు కట్టుచున్నారు. ఒక పెద్ద తోటను వేసి అనేక హార్మ్యములను కట్టియున్నారు. వ్యవసాయకళాశాల (Agricultural College) నొకదానిని కట్టదలచి యున్నారు. ఇచ్చట తరిబీతయిన విద్యార్థులు గొప్ప సాగుబడిపనులను నిర్వహింతురని ఆశపడుచున్నారు. (2) ఇదిగాక పెన్సళ్ళు, గుండీలు, గొడుగులు మొదలగు వానిని తయారుచేయుటకు లఘుపరిశ్రమాభివృద్ధి సంఘము (Small Industries Development Company) అనుపేర నొక కంపెనీ యేర్పాటు చేసియున్నారు. దీనికి కావలసిన కట్టడములు పూర్తియయినవి. యంత్రములు

పెట్టి పనులు ప్రారంభించినారు. ఈ సంఘపు టుద్యోగస్థుల యందుండు నిపుణులొక కమిటీగ నేర్పడి ఈ క్రింది పరిశ్రమలను పరిశ్రామికులకు సిఫారసుచేసి యున్నారు. అగ్గిపుల్లలు, గుండుసూదులు, పారలు, గొడుగుచట్రములు, కత్తులు, కత్తెరలు, మొదలగు ఇనుపసామానులు, సబ్బులు, గుండీలు, కొమ్ము దువ్వెనలు, గాజు సామానులు, ఎనామల్, పింగాణిసామాను, పెన్సళ్ళు, చర్మము, రంగు, ద్రావకములు మొదలయినవి. (3) ఈ సంఘమువారొక గొప్ప టెక్నికల్ కాలేజిని (Technical College) స్థాపింపదలచి దొరతనమువారికి వారి అభిప్రాయములను తస్సీలుపట్టికతోసహా పంపగా వారియుద్యమములను అంగీకరించి తగిన చర్యను పుచ్చుకున్నారు. (4) అన్నివిషయములకంటెను విదేశములనుండి తిరిగి మనదేశములకు వచ్చినవారి చరిత్ర మిక్కిలి ముచ్చటైనది. విదేశమునకు వెళ్లివచ్చినవారు మన దేశమున నిరుపయోగులుగ నున్నారని రెండవ ప్రకరణమునందు చెప్పితిమి. ఈ సంఘమువారివలన పంపబడినవారటు కాదు. వీరి నేరికొనుటయందు సంఘమువా రెక్కువజాగ్రతనున్నారనుట స్పష్టము. ఎఫ్. ఏ. పరీక్ష యయినవారికిని కనీసము మూడు సంవత్సరములు సిబ్పూరు ఎంజనీరుంగు కాలేజిలో చదివినవారికి మాత్రమే వేతనములిచ్చుటచేత పనికిరానివారిక్కడనే నిలిచిపోవుచున్నారు. ఈ సంఘపు కార్యదర్శిగారు వ్రాసిన యుత్తరమునుబట్టి చూడగా అరువదియైదుగురిలో నలువదిమందికి 150 మొదలు 550 రూపాయలవరకు జీతముగల మంచి యుద్యోగములు దొరికినవని తెలియుచున్నది. వీరి

లోకొందరు బెంగాల్ ఒరిస్సాలోని తోళ్లకారుకానాలను (tanne-ries) పెద్ద పెద్ద సబ్బుయంత్రశాలలను నడుపుచున్నారు. కొందరిని భారతనప్రభుత్వము పట్టుపురుగు పెంపకము (Sericulture) వ్యవసాయము పరిశ్రామిక రసాయనశాస్త్రము (Agricultural chemistry) మొదలగువానియందు నియోగించియున్నారు. మెకానికల్ యింజనీరులు గాను (Mechanical engineers) ఎలెక్ట్రికల్ ఎంజనీరులు గాను కొందరున్నారు. మరికొందరు బెంగాల్ టెక్నికల్ స్కూలునందు (Bengal Technical Institution) ఉన్నతోపాధ్యాయులుగ నున్నారు. మిగిలినవారు స్వంతముగా నేదోయొక పరిశ్రమయందు పనిచేయుచున్నారు.

ఈ విధముగా పనిచేయునది బంగాళాదేశపు సంఘమొక్కటియే (Bengal Association) కాదు. మదరాసులోని జాతీయధన పరిశ్రామిక సంఘము (National Fund and Industrial Association Madras) ఇట్టిపని కొద్దిగా చేయుచున్నది. ఇండియాయందుండు భారతనప్రభుత్వ యెంజనీరింగు కాలేజీలోను, బొంబాయి విక్టోరియా టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ లోను నుంచి కళావిద్య (Technical education) నేర్పుచున్నారు. కాని ఇక కొన్ని సంవత్సరములవరకు నూతన పద్ధతుల ప్రకారము వర్తకమును మ్యానుఫ్యాక్చర్లను (Trade and manufactures) నేర్చుకొనుటకు మన దేశీయులు విదేశములకు వెళ్ళకతప్పదు. దీనికంతయు ధనము ముఖ్యావశ్యకము. ఇప్పుడు మిక్కిలి అల్పసంఖ్యాకులు మాత్రమే వారియొక్క ధారాళమును చూపియున్నారు. ఇంకను యెంతమందియో ధారాళము చూపినంగాని ఇట్టిపనులు కొనసాగవు. ఈ విషయమై బెంగాల్ సంఘపు కార్యదర్శిగారు

పరిశ్రమస్థాపనవిషయమై మన దేశీయులు విముఖత్వము చూపుచున్నారని యతృప్తిపడుచున్నారు. కాని యిట్టియేకాగ్రచిత్తులగువారికి (Earnest minded men) అతృప్తి కలుగకపోదు. అయిన నీ యల్పసంఖ్యాకులు చేసినదానినిబట్టియే పరిశ్రమాభివృద్ధివిషయమున మన ఇండియాను బహిష్కరించవలసియున్నది. ఈ యల్పారంభములను వృద్ధిచేసి ప్రతిజిల్లాయొక్క స్వాభావిక సంపదను జయప్రదముగా పెంపొందచేయుటకు పిన్నవయస్కులగు భారతీయులు శీఘ్రకాలములో బయలుదేరుదురుగాక.

ఇప్పుడొక హెచ్చరిక చేయవలసియున్నది. వెనుకటి ప్రకరణమునందు ప్రతిపారిశ్రామిక దేశాభిమానికి పారిశ్రామికోద్యమములందు పిరికితనము తగదని చెప్పితిమి కాని ఇప్పుడు దుడుకుతనము కూడదని చెప్పవలసియున్నది. ఒక పరిశ్రమ బాగుగా జరుగునని వట్టి నమ్మకముమీద జాయింటుస్టాకు కంపెనీ ఏర్పాటుచేయకూడదు. ఏమనిన ఆపని చెడిపోయి వాటాదారులకును తనకును నష్టమువచ్చునేని ఈ దేశాభిమాని తనజిల్లాకు మహాపకారము చేసినవాడగును. ఒకవేళ ద్రవ్యనష్టమంతయు తనకే వచ్చినను పరిశ్రమలందు నిరుత్సాహము కలిగించుటకు ఒక పారిశ్రామికోద్యమము చెడిపోయినదన్నమాటయే చాలును. ఇతరులధనముకూడ పెట్టుబడిలోనున్నప్పుడు పరిశ్రమలవిషయమున నతిజాగ్రతగా నుండవలయునని వేరుగా చెప్పపనిలేదు. ప్రతి యుద్యమమునందును అపాయము కొంతయుండక తప్పదు. ఎందుకనిన మన మనుకోనని కష్టములు తలచనిచిక్కులు వచ్చుచునేయుండును. కాని సబబైన నష్టము

నకు సంసిద్ధులగుట యొకటి. జూదమువంటిపనికి పూనుకొను
ట మఱియొకటి. అన్ని దేశములందును పరిశ్రామికత్వము మే
ల్కాంచునపుడు అతిలాభపు పిచ్చిపట్టినవారు కొందరు బయలు
దేరి వెట్టి వెట్టి పన్నాగములు పన్ను వారుండకతప్పదు. 1720
సంవత్సరమున సౌతుసిస్కీము (South Sea Scheme) బయలుదేరి
నకాలమున ఇంగ్లండునందు సీసమునుండి వెండితీయుట, స్పైన్
దేశమునుండి గాడిదల నెగుమతి చేయుట, మొదలైనట్టి వెఱ్ఱిపరి
శ్రమలు బయలుదేరి నష్టముకలిగించినవి. కాబట్టి మన పరిశ్రా
మికులు జాగ్రతగ నుండవలయుననుట స్పష్టము. తనకును త
న దేశమునకును లాభమునిచ్చు వ్యవస్థ అతనికి తోచెనేని త
నతో చేరిన వారందరితోను పలుమారు యోచనచేసి తాను
ను తప్పీలుగా దాని నాలోచించి, ఉచితమైనయెడల యొకనిపు
ణుని (expert) సలహా తీసికొని, ఉద్యమమును నెరవేర్పుదారి క
నపడెనేని తరువాత దాని నారంభించి, తప్పక జయప్రదము కా
నలయునను దృఢచిత్తముతో పనిచేయవలయును.

ఇంతవరకు చెప్పినదానినిబట్టి చూడ పరిశ్రామిక కార్య
ములన్నియు పల్లెటూరి వారలకేగాని పురనగరవాసుల కావ
శ్యకము కాదని చదువరు లర్థముచేయవచ్చును. ఇది నిజము
కాదు. గ్రామములందు జనులకు సాధారణముగా ప్రపంచమే
తెలియదు. వీరి ప్రపంచజ్ఞానమంతయు తమ గ్రామముతోను
అదియుండు తాలూకాతోను ముగియును. ఒకవేళ జిల్లా ము
ఖ్యపట్టణమును దాటెనా అది మిక్కిలి అరుదైనవిషయము. కా
వున గ్రామవాసులకు యేది యెక్కడయుండునదియు తెలియదు
కనుక ఈ సంగతులన్నియు కేవలము గ్రామవాసులకే అన్వ

యమగునట్లు చెప్పబడియున్నది. మన దేశములోని కొన్ని నగరములందిప్పటికే పరిశ్రామికపుపనులు బాగుగ జరుగుచున్నవి. పరిశ్రామిక ముఖ్యస్థానములగు పశ్చిమదేశమునుండి యాయినను నూతనముగా నొకడు హుగ్లీనదిమీద కలకత్తాకు ప్రయాణముచేసెనేని నదికిరుప్రక్కలనుండు పొగగొట్టములగుండ మబ్బువలె నల్లగవచ్చుపొగను చూచి పరిశ్రామికౌన్నత్య మీనగరమునకు కలిగినదని తప్పక తలచును. ఇటులే పడమటిభాగమునందు బొంబాయియందును దానిసమీప పట్టణములందును పరిశ్రామికౌన్నత్యము కనబడుచున్నది.

ప్రత్తి ఉన్ని మిల్లులచేతను సబ్బు చర్మపు పరిశ్రమలతోను ప్రసిద్ధిచెందిన కాన్పూరునగరము ఉత్తరభాగమున నున్నది.

పెద్ద పెద్ద పరిశ్రమలు ఇట్టి పట్టణములందే జయప్రదముగాజరుగునుగాని పల్లెలయందు జరుగవు. ఎందుకనగా విద్యావంతులిచట యెక్కువగనుందురు. జనుల జీవనప్రమాణము లేక జీవమానము (Standard of living) ఇచట ఎక్కువగ నుండును. ఇచట నైపుణ్యముగల పనివారు దొరుకుదురు. తరిబీతువల్ల వీరిని మంచి కుశాగ్రబుద్ధికలవారినిగా చేయవచ్చును. ఇచట ఇండ్లు మాపులే కాక వీధులుకూడ విదేశపువస్తువులచేత నిండియుండును. ఇట్టి అనుకూలములుగల పట్టణములందే వివేకముగల పురజనులు పరిశ్రామిక వాణిజ్య ఘనకార్యములందు భాగస్తులుగానో వ్యవస్థాపకులుగానో పనిచేసి, ఇతరజాతీయులకు సాధ్యమగుపనులు భారతీయులకుకూడ సాధ్యమగునని చూపుటకు దృఢనిశ్చయులై యుండగలరు.

గ్రామవాసులపాట యిట్లుండదనిశ్చయము. పురవాసియొకడు

ఇంట కుర్చీమీద కూర్చొని నలువంకలు చూచినాడనుకొండ
ము. ఇచటను, అచ్చటను, అంతటను విదేశవస్తుకపుగుర్తులే క
నబడునుకదా! ఆతనిపక్కనుండు దీపము జర్మనిలో చేయబడిన
ది. దానిచిమ్ని ఆష్ట్రియాలో తయారైనది. అందులోని నూ
నె రష్యానుండివచ్చినది. ఈ దీపమునువెలిగించు అగ్గిపుల్లలు జ
పానులోనో స్వీడనులోనో చేయబడినవి. ఆతని బల్లమీద టి
క్కు టిక్కుమను గడియారము అమెరికాలో తయారైనది.
జేబులోనది జెనీవా (Geneva) నుండివచ్చినది. అతడు వ్రాయు
సిరా లండనులో చేయబడినది. పాళీలు బర్మింగుహామునుండి
వచ్చినవి. ఆతని పెన్సిల్ బవేరియాలో చేయబడినది. వీపు
మీదనుండు కోటుబట్ట యార్కుషైరులో నేయబడినది. మే
జోళ్ళు జర్మనీనుండి వచ్చినవి. ఆతని భార్యవాడుచుండు కత్తె
ర షెఫీల్డులోనో జర్మనీలోను తయారైనది. ఆమెకత్తిరించు
బట్ట మాంచస్టరునుండియు, కుట్టుసూది బర్మింగ్ హాంనుండి
యు, ఆమె రవికలోని పట్టు ఫ్రాన్సునుండియు వచ్చినవి. పిల్ల
వాడు కొరుకుచుండెడి బిస్కటు రీడింగు (Reading) లోను బి
స్కట్లతట్ట స్టాఫ్ఫర్డుషైరు (Stafford shire) లోను, ప్రక్కనుం
డు సోడానీళ్ళలోటా ఆస్ట్రియాలోను తయారైనవి. గోడకుం
డుపటములు జర్మనీలో తయారైనవి. దాని చట్రములోని మ
రమేకులు బర్మింగుహామునుండి వచ్చినవి. ఇట్టి పట్టీని యెంతయి
నను పెంచవచ్చును. కాని మనమెంతవరకు ఇతరదేశముల న
మ్ముకొనియుండునదియు రూఢిగాచూపుట కింతమాత్రము చా
లును. కావలశినయెడల మరియొక యుదాహరణ మాలోచిం
తము. పాఠశాలలను విడుచుసమయమున చదువరి ధారిప్రక్కను

వెళ్ళుచున్నాడని యనుకొందము. ఒక్కొక బాలుని చేతిలో ను వానిపుస్తక భాండాగారమంతయు నుండును. మొదటిపాఠ ము, లెక్కల మొదటిపుస్తకము, భూగోళపు మొదటిపుస్తక ము, పలక, ఆరుపైసల యెక్సర్సయిజు బుక్కు. ఈ బుక్కును పరీక్షించిచూచినయెడల అట్టమీద (ఆస్ట్రియాలో చేయబడిన దనియుండును. బుక్కుపైన జార్జిచక్రవర్తి బొమ్మయు (క్రింద ఆస్ట్రియాలో చేయబడిన' దనియు ఉండుట మిక్కిలి అసంగత ము. మనఇండియాదేశపు స్వభావసంపద యేమి? మనపిల్లల య క్సర్సయిజుబుక్కులు ఆస్ట్రియానుండి వచ్చుటయేమి? యక్స ర్సయిజుబుక్కులు స్వల్పవిషయములు కాని మనదేశపు కాకి తపుపరిశ్రమ మిక్కిలి దీనదశయందున్నదని తప్పక సూచింపు చున్నవికదా! బెంగాలునందు కాకిత పరిశ్రమ కొంత అభివృద్ధి చెందినదికాని 1903-04 సంవత్సరమున చెన్నపట్టణమునకు వ చ్చిన ప్రదర్శితములనుబట్టి చూడగా బజారులో సాధారణము గాదొరకు బాదామికాకితముకంటె అవి శ్రేష్టమయినవికావు. మంచి కాకితపు యంత్రశాలలకు ప్రతికోస్తాయందును కావల సినంత గిరాకియున్నది. ఈ పరిశ్రమ బాగుగజరిగెనేని విదేశీ యులు మనతో పోటీకి వచ్చి మనకు కాకితములు సప్లయి చే యజాలరు. ఇప్పటికీ విదేశపు యెగుమతులను చాలచెప్పియు న్నాము. ఇంకను ఉదాహరణములు కావలయునేని యే బజారై నను, యే యూరోపియనుల షాపైనను చివరకేవిధమైనను చూపగలదు.

కావుననిట్టిస్థితిని బాగుచేయుటకు సర్వవిధములైన సత్ప్ర యత్నములు జరుగవలసియున్నవి. ఇట్టి యుద్యమముల నిర్వ

హించుటకు పురవాసులగు దేశాభిమానులు మొదలుపెట్టవల యును. క్రొత్తపదార్థముల నుత్పత్తి చేయుటకు సమకట్టవలసిన వారు పురవాసులే. ఈ విషయమునందు భారతజాతీయ మహా సభ పరిశ్రామిక ప్రదర్శనముల నేర్పరుచుటయందు మిక్కిలి మంచిపనిచేసినది. దీని సభ్యులలో కొందరు ఇంతటితో నిలువక క్రొత్తపరిశ్రమల నిండియాలోనికి తెచ్చువిషయమున వాని యందు భాగస్థులై స్వయముగా పనిచేయుట యుత్తమోత్త మమని తోచుచున్నది. ఎందుకనిన ఇండియాకు సరుకులు దిగుమతిచేయుట లాభమైనయెడల సరియైన ఆర్థికశాస్త్రపద్ధతుల ప్రకారము (Under truly economic conditions) ఆ వస్తువులను మన దేశమునందే తయారుచేయుట మొక్కువ లాభకరముగానుండి తీరవలయునుకదా.

ఇంతవరకు జరిగిన పని మొత్తముమీద బాగుగనేయున్నది. ఇది ప్రారంభదశ కనుక నింతకంటె యెక్కువజరుగుట కష్టము. 1903-04 వ సంవత్సరమున మదరాసునందు జరిగిన ప్రదర్శనముచూచినవారికి పరిశ్రామికోద్యమములందు ఇండియా యింతవృద్ధినొందినదా యని యాశ్చర్యము కలిగినది. ఈ ప్రదర్శనమువల్ల ఇండియాదేశము ప్రతి పరిశ్రమయందును మంచిపదార్థముల చేయగలిగినదని స్థిరపడినది. కాని చేయవలసినదింకను చాలనున్నది. తాతా కంపెనీవారు (Tata Company) ధైర్యముతో పూనుకొనిన ఇనుము ఉక్కు పరిశ్రమ అభివృద్ధికావలయును. గాజుయంత్రముల స్థాపనకావలయును. జలపాతములను స్వాధీనపరుచుకొనవలయును. అన్ని పరిశ్రమలు మహోత్కృష్టదశకు రావలయును. అనగా మన దేశములో కావల

తీనపదార్థములన్నియు సాధ్యమైనంతవరకు మనదేశమునందే చేయగలిగినపుడుకదా భారతమాతకు మహోచ్ఛదశవచ్చును (Golden age). ఈ యుద్దేశము మిక్కిలియుత్కృష్టమాయినది. దీని నెరవేర్చుటయందు యెంత స్వల్ప సహాయముచేసిన పుర వాసియైనను దేశమాతయొక్క మన్నన కర్హుండగును.

## ఏడవ ప్రకరణము.

## భారతీయ కళ (Indian Art.)

మన గ్రామవాసి తన గ్రామమునకెటుల పరిశ్రామికలాభము కలిగింతునా యని యోచించుచుండగా, మనము భారత కళాస్థితిని గూర్చి కొంత ప్రసంగింతము.

కళయనగా విద్య. కాని గృహనిర్మాణము, కమ్మరము, వ డ్రము, చిత్రలేఖనము, మొదలుగునవి కళల యందు చేర్పబడి నవి. వీనిలో నన్నిటియందును గృహనిర్మాణము లేక వస్తుశాస్త్రము ముఖ్యమైనది. ఈ కళయందు మనదేశము శతాబ్దములనుండి వన్నెకెక్కినది. ఉత్తరదేశమునందుండు మసీదులును దక్షిణభాగంబుననుండు దేవాలయములును, ప్రపంచ వైచిత్రియములలో చేరినవి. కాన వీనిం జూచుటకు విదేశీయులెందరో మనదేశమునకు వచ్చుచుందురు. ఈ కళాకౌశల మిప్పటికినిరాళ్ళను మలుచు కూలీలయందును, చిత్రకారుల యందును కన బడుచునేయున్నది. కాని పైని చెప్పబడిన దేవాలయములు కాని మసీదులుగాని దూరదేశములకు సాగిపోవు సామాగ్రులుకావు. కావున నివి ఎంత మంచివైనను దూరదేశములందమ్మకమగునవికావు. కాబట్టి ప్రస్తుతాంశమగు వాణిజ్యవిషయమున

కివికొంచెమైనను పనికిరావు. ప్రకృతవిషయము చర్చించుటయందు కళను రెండు భాగములక్రింద ఆలోచింపవలసియుండును. బొమ్మలు చిత్రరువులు మొదలగు అచ్చుపుకళ మొదటిది. కలప చెక్కుట దంతము చెక్కుట, లోహపాత్రలమీదను బట్టలమీదను నక్షిపనిమొదలగు వానిచే చూపబడుకళ 'అనగా పరిశ్రమలమీద చూపబడుకళ (Industrial art) పరిశ్రామిక కళ). రెండవది: పరిశ్రామికపదార్థములమీద అలంకారముగా చిత్రించుట విషయమునందు భారతీయకళ ఉన్నతస్థితియందున్నది కాని బొమ్మలను చిత్రలేఖనములనుబట్టి చూడ భారతీయ కళ దీనదశయందున్నట్లు విశదముకాకమానదు.

మొదట చిత్రకళ (Pictorial art) నుగూర్చి యోచింతము. ఇండియాయందు చిత్తరువులు వ్రాయుటయే జీవనోపాయముగా గల చిత్రకారులందరు సామాన్యముగా మనుష్యుల ప్రతిమలనే (Portraits) వ్రాయువారు. తమ పూర్వికులు కట్టినఇండ్ల గోడలమీద తమ పటములను చూడవలయునను ఇష్టముకలవారైన రాజులయొక్కయు జమీందారుల యొక్కయు పటములు వ్రాసి ఈ చిత్రకారులు తిండికి సంపాదించుకొనుచుండిరి. ఇట్టి పటములు సాధారణముగా కళాకార్యములలో (Works of art) చేరవు. ఎందుకనగా ముఖవర్చస్సు లేక చెక్కబొమ్మలవలె కళావిహీనమై యుండినవి. ఈ పటములందు ఆమనుజుని పోలికయుండి ఆ రుమాల ఆ జల్తారుకోటు డాబుగా పటములందు కనపడెనేని ఇదియే చాలునని పటములనుగ్రహించి గోడలమీద వ్రేలాడగట్టుచుండిరి. కళాకౌశలముగల చిత్రకారుడెచటనైన నుండిన నుండవచ్చు

కాని ప్రదర్శనములకు వచ్చు బొమ్మలను, నాటకపు తెరమీది
తిమలను, హైందవుల షాపులలోని పటములను మన ఇండ్లలో
పటములను చూచినవారికి మన దేశపు చిత్రకళ (Indian
ctorial art) మెప్పువడయుటకేమాత్రము తగినదికాదని త
క తోచును. పది సంవత్సరముల నాటికంటె నిప్పుడీకళ కొం
ముభివృద్ధి చెందినది. కొన్ని సంవత్సరముల క్రిందట భారతీయ
దర్శితము లన్నియు నవ్వుపుట్టించు హాస్యపు బొమ్మలుగా
ండినవి. ఇప్పుడైనను అట్టివి ఎక్కువగా నున్నవి కాని
ందవచిత్రకారులు వ్రాసిన మంచిప్రతిమలు కూడకొన్ని
నబడుచున్నవి. ఈ నూతన చిత్రకారులలో పేరుపొందిన
రు తిరువాన్కూరులోని రవివర్మగారు. (ఇతడు 1908
ంవత్సరమున గతించెను). ఈతని ప్రతిమలు అంతటను మె
పొందతగినవి. ఇతడు భారతీయజీవనమును (Indian life)
రతీయకథలను చిత్రించి దేశమునకు మహోపకారము చేసి
వాడు. భారతీయ కథారంగములను చూపు బొమ్మలను తన
హూహ ప్రకారము చిత్రించుటచేత కేవలము మనుష్యులప్ర
మలు వ్రాయుట దాటిపోయి నిజమైన కళాకార్యమునకు
rtistic work) పూనినవాడాయెను. ఇందుచేత ఇతడు నూతన
త్రకళా పాఠశాలను (New school of art) స్థాపించినవాడని
ప్పవచ్చును. ఇతడు వ్యాపారముచేయు స్వభావముగలవాడ
టచేత (commercial interest) రంగుబొమ్మల వ్రాయుయం
శాల (oleographic factory) నేర్పాటుచేసి సులభధరలకు
టములను అమ్మకమునకు తెచ్చుటచేత వీనిని వేలకొలది జ
ల్లు కొనిరి, ఇందుచేత రవివర్మగారికంత పేరు వచ్చినది. ఇట్ల

నుటచేత అతని చిత్తరువు వ్రాతలు యోగ్యములు కావని చె ప్పుట లేదు. అతని కాలమునందు చిత్రకళయుండిన స్థితినిబట్టిచూ చినయెడల ఇతని చిత్తరవులు ప్రసిద్ధికెంతయు తగియున్నవనుట నిశ్చయమని తోచకమానదు. ఇతనితరువాత—ఈతని కొడుకు కూడ నొకడు—నిపుణులగు హైందవచిత్రకారు లనేకులు బయ లుదేరియున్నారు. బొంబాయియందు పార్శీవారిలో మంచిపని వారున్నారు. కలకత్తాయందుకూడ కొందరు ప్రశిద్ధికెక్కినవా రున్నారు. వీరిలో మొదటి వరుసయందు నిలిచియుండు గంగూలీ గారు 1903 - 1904 సంవత్సరమున చెన్నపట్టణపు ప్రదర్శన మునకు ఒక ముచ్చటయైన ప్రతిమ నంపియుండిరి. ఆ బొమ్మ స్నానఘట్టమును చూపుచుండినది. దానియొక్క సామాన్యక ల్పనబట్టి (General design) చూచినను, అందు నీటిని ఆకాశ మును విశదముగాచూపి వాయు జలభేదములగుపడునటుల చే యుటచూడ వానియొక్క ప్రజ్ఞ తెలియుచున్నది. 1911 మేనెల మాడరన్ రెవ్యూ (Modern Review) లో వేయబడ్డ (గంగూలీ గారి) చిత్తరువుయొక్క పునరుత్పత్తిపటమును (Reproduction) చూడగా అసలు చిత్తరువు నిజమైన కళాకార్యముగా నుండవల యునని తోచుచున్నది (a real work of art). దీనిపేరు ఆనా టిపాటునకు ఫలము (His days reward). ఇందు పొలముపనివా డు కనుచీకటిలో తనకాడిగిత్తలను తోలుకొనివచ్చుటయు అ పుడాతనిభార్య యెదురుగవచ్చి చిన్నబిడ్డను చేతికిచ్చుటయు ఆబిడ్డ తండ్రికౌగిట చేరుటకై చేతులు చాచియుండుటయు చూపబడియున్నది. మరియొక చిత్రకారుడు కొన్ని సంవత్సర

ుల క్రింద యూరోపుఖండపు చిత్రాగారము (continental stud-
s) లందు పని చేయునప్పుడు కొంత మెప్పుపొందెను కాని ఇటీవ
అతని పేరు యేకారణము చేతనో బయటికి వచ్చినది కాదు. ఇ
చిత్రకారుల నెందరి పేర్లయినను చెప్పవచ్చును కాని ఇటీవ
జరిగిన అభివృద్ధియే ఇక ముందుకూడ నుండెనేని హైందవచిత్ర
ళ ప్రపంచముయొక్క మెప్పునకు అర్హమగుననుట నిస్సంశ
యము.

ఇంతకాలము మన దేశమున చిత్రకళ (Pictoral art) దీనద
యందుండుటకు అనేక కారణములున్నవి. చైనా జపాను
మొదలగు తూర్పు దేశములవలె మొన్నటివరకును మనదేశ
ముకూడ పడమటిదేశములందు వృద్ధియై వన్నెకెక్కిన కళా
శైలి (Style of art) తో సంబంధమే లేకయుండినది. మొదట
న్ని దేశములందును కళ ఒక్క తీరుననే యుండినది. తరువాత
స్వభావసిద్ధముగా కళాజ్ఞానముగల పూర్వపు గ్రీకులయందు
ఈ కళాశైలి (Style of art) నానాటికి వృద్ధియయినది. ఇతర
పశ్చిమదేశీయులకు వీరితోటి సంబంధము కలిగిన పిమ్మట వా
కళాశైలి వీరికికూడ లభించినది. మన తూర్పుదేశముల కీసం
బంధము కలుగలేదు. కనుక 4000 సంవత్సరముల నాడుండిన
కళాశైలియే ఇపుడు కొంత క్షీణించియున్నది. ఇందుచేత చిత్ర
కారుడెపుడు గుడిగోడమీద వ్రాయు విగ్రహముల కాళ్ళుచేతులు
మనుష్యులకుండినట్లుండవు. ముఖవర్చస్సునందు దేవత్వమేమి
యు కనపడదు. ఈ ప్రతిమలు గుమిగూడియుండు వైఖరిని చూ
చితిమా చిత్రకారునకు చిత్రకళా నిబంధనలు (perspective
laws) బొత్తుగా తెలియవని స్థిరపడును. చిన్న చిన్న పట్టణములం

ను నాటకపు తెరలకు రంగువేయువాడు, ప్రక్క తెరలమీఁద, యెఱ్ఱని కోటువేసికొనిన ఇంగ్లీషుసిపాయిని చిత్రించియుండును కాని ఆప్రతిమయొక్క అంగవిన్యాసము (Posture) కవాతు చెప్పు సార్జెంటు చూచినయెడల అతనికి తప్పక పిచ్చెత్తును. కాబట్టి యూరోపునందుండునట్టుల వంశపరంపరగా వచ్చు కళాజ్ఞానము లేక మనబాలురు జీవన మారంభించుటచేత దేశమునందు కళాభిరుచి తక్కువగుటకు కారణమయినది. పూర్వకాలపుమాట యటుండనిత్తము. ఈ కాలమునందుకూడ కళాభివృద్ధికింత యాలశ్యమెందుకు? కళాభివృద్ధిని కలుగజేయు బొమ్మలను మనదేశపుబిడ్డలు చూచుటలేదు. సామాన్యపు జరుగుబాటుగల ఇంగ్లీషువారి బిడ్డలు తమయింటను తమస్నేహితుల యింటను మంచి మంచి బొమ్మలను చూచుచుందురు. ఇదిగాక వారు తల్లివెంబడిగాని దాదివెంబడిగాని బయట షికారువెళ్ళినపుడు బొమ్మలంగళ్ళ కిటికీలవద్ద నిలుచుండి బొమ్మలను చూచి కళాభిరుచుల కొద్ది కొద్దిగా లోనికి గొనుచుండి కొంచెము పెద్దవారయినతరువాత బొమ్మల గ్యాలరీలకును (Picture galleries) రాయల్ అకాడెమి (Royal Academy) వారి సాంవత్సరిక ప్రదర్శనములకును తీసికొనిపోబడుచుందురు. దీనికిని మన దేశమున బొమ్మలు లేని యెడారిబ్రతుకునకును ఎంత భేదమున్నదో చూడుడు. మనదేశమునందు బొమ్మలనిన యేమియభిప్రాయమో చూతము? కలలో కనపడు దయ్యములు అభినయము చేయు మృగములు, పెద్దచేయబడిన చిత్రప్రతిమలు ఫోటోగ్రాఫులు, యూరోపియను దొరసానులు జర్మనుచక్రవర్తి, స్విజరుల్యాండు చెరువులు మొదలైనవే గాని వేఱుకావు. ఇట్టి

వానివల్ల బిడ్డలకు కళాభిరుచి పుట్టకపోయినయెడల యేమి వింత? ఇతడు రంగులతో బొమ్మను వేయ చూచినపుడు ఒక రంగుపటమును ఎదుటబెట్టుకొని దానియొక్క ప్రతిని తీయును. ఒక బొమ్మను గీయ మొదలుపెట్టినేని యేదోయొక ఛాయా పటమునకు నకలు వ్రాయ మొదలుపెట్టును. ఇట్లు వ్రాయుట యందు తాము వ్రాసినదానికిని అసలుదానికిని పోలిక బాగు గనుండెనేని అంతటితో తృప్తి చెందును. ప్రదర్శనములకు మన వారు పంపు ప్రదర్శితములు చూచినయెడల పైని చెప్పిన దం తయునిశ్చయమని తప్పక తోచును. ఈ ప్రదర్శితములందన్ని యు చెడ్డవికావు. మంచివానిని కొందరు యూరోపియనులును హైందవులును పంపుచునే యున్నారు. ఇట్టివి కళాభిరుచి కలి గించుటయందు సాయపడునుకాన కమిటీవారు అందముచంద ములేని మొరటువానిని రానియ్యకుండవలయును. క్రమక్రమ ముగా ఇండియాలోని ప్రతిపట్టణమునందును స్థిరముగానొక పటముల గ్యాలరీని ఏర్పాటు చేసినయెడల దానిలోనికి మన వారిష్టము వచ్చినప్పుడు వెళ్ళి చూడ వీలుండును. అపుడుకదా బొమ్మలులేని యెడారియనుపేరు ఇండియాకు తొలగిపోవును.

చిత్రకళాభిరుచి తప్పక వృద్ధియగు చున్నదనుట కొంతతృ ప్తికరము. కాని దొరతనమువారు కళాభిరుచి కలిగించు సదు ద్దేశముతో యేర్పాటుచేసిన పద్ధతులు అభిరుచి కలిగించుటకు మారు అందున కాటంకములుగా పరిణమించియుండుట ఆశ్చ ర్యముకాదు. ఇండియాయందు కళాభిరుచి తక్కువగానుండు టచూచి దొరతనమువారు ప్రవేశపరీక్షవరకు చదువు పిల్లలం దఱు ఫ్రీహ్యాండు డ్రాయింగు (Free hand drawing) నేర్చుకొనవల

యునని యుత్తరువు చేసిరి. చిత్రకళకిది (Free hand drawing) ఓ. న. మాల నంటిది. ఇదియే దీని వ్యాకరణము. కాని ఈ యొక్క-దానినే ప్రవేశపరీక్షవరకు బోధించుపద్ధతి, నిజమైన కళాభిరుచిని చంపివేయుచున్నది. బాలుని విద్యాదశయందంతయు ఇతడు నేర్చుకొనునది చతుర్భుజము, వృత్తము మొదలగు క్షేత్రగణితపు నమూనాలును, ప్రపంచమునందెక్కడను కానరాని పుష్పముల యాకారములే యగుచున్నవి. సాధారణముగా ఇన్స్పెక్టరులందరు దీనినే తనిఖీచేయుదురు. అటుగాక యే వస్తువుల విద్యార్థి చూచునో వేనిని వ్రాయుటయందు బాలునికి నిజమైనకళాభిరుచి కలుగునో అట్టివానిని, అనగా టెంకాయ తోట, పొలములో మేయు ఆవుదూడ భాగుగా షేడుచేసి (shade) వ్రాసిన మొదలవానిని, అధికప్రసంగతనము క్రింద త్రోసివేతురు. ఇట్టిపద్ధతి మంచిదని చెప్పనగునా? ఇంగ్లీషువాంగ్మయమునందభిరుచి కలిగించుటకు ఒకబోధకుడు ఈ క్రింది పద్ధతి నవలంబించినాడనుకొందము. పసిబిడ్డకు చిన్నతరగతులయందు అక్షరములు ప్రారంభించి, వర్ణక్రమము, వ్యాకరణము మొదలగువానిని స్కూలుదశయందు చదివించుచుండును. ఇతనికొక కథయైనను చెప్పియుండడు. ఒక పద్యమునైనను నేర్పియుండడు. కాని ప్రథమపరీక్షలో తేరునప్పటికి ఆ బాలుడు భాషలోని ప్రతిపదమునకును వర్ణక్రమము చెప్పగలిగియుండును. ప్రతివ్యాకరణసూత్రమును నేర్చుకొనియుండును. ఇదెట్టిచదువో యోచింపుడు. ఈ విద్యార్థి నైఘంటికుడు కావచ్చును. కాని కవి యెప్పటికిని కాజాలడు. ఇపుడు పాఠశాలయందలి చిత్రలేఖనావిద్యయు ట్టిదే. దీనివల్ల విద్యార్థి మంచి డ్రాఫ్ట్సుమాన్ (Draftsman)

కావచ్చును. కాని చిత్రకారుడెప్పటికిని కాజాలడు. ఇతనికన్నులు క్షేత్రగణితపు ప్రతిమలకలవాటుపడి యుండునేగాని వానికి చెట్టును చిత్రించు కౌశలముండదు. ఈ విద్య రేఖారూపమును బోధించునుకాని కళాభిరుచిని చంపును. కళాభిరుచినిఉత్పత్తి చేయవలశిన మనదేశమునకు మాత్రమే ఈ రిమార్కులు అన్వయించును. ఇంగ్లండునందు పశిపిల్లలు బొమ్మలు వ్రాయుటయందు మిక్కిలి కుతూహలము కలవారు కాన ఫ్రీహాండు డ్రాయింగు ఎక్కువగా బోధించుట అంత బాధకరముకాదు. చిత్రలేఖనపు గంటయునిన తలనొప్పివచ్చు మనదేశపు విద్యార్థులకు ఇది విషతుల్యము. మనదేశమునందు ఫ్రీహాండు చిత్రలేఖనము వెంబడి, తరగతులకు తగినట్లు, చిన్న చిన్న కథలను, వ్రాతరూపమున చదువలేనికాలమున నైనను, బొమ్మల రూపమున వ్రాయించుట మంచిది.

మఱ్ఱిచెట్టుక్రింద ఆలోచించుచు కూర్చున్న గ్రామవాసికి, ప్రతిబాలునియొక్కయు కళాజ్ఞానమును వృద్ధిచేయుట ఆవశ్యకమని నచ్చచెప్పి, అతనికొడుకు ఇంగ్లీషుపాఠశాలనుండి ఇంటికివచ్చినప్పుడు ఆగ్రామదేవాలయము, ఆబావివద్ద నిలుచుండిన తన చెల్లెలు, ఆగ్రామపుచెరువు, పవిత్రమగు మఱ్ఱిచెట్టు, మొదలగు స్వభావరంగములను పిల్లవానిచే వ్రాయించుట మంచిదని బోధించవలయును. ఇతడు వ్రాయుబొమ్మలంత బాగుగా లేకపోయినను, ఇవి ఫలానిదని బాలుడు చెప్పవలసియుండినను చింతలేదు. ఇట్టివానిని వ్రాయుటకు చేసినప్రయత్నమె బాలునకు సంతోషమును కలిగించును. ఈ బాలుడు చిత్రకారుడు

కాకపోయినను. స్వభావసిద్ధములైన రంగముల వ్రాయుట యందు ఇతనికికలుగు క్రమశిక్ష (discipline) మెచ్చాలును.

పరిశ్రామికోద్యమములు గురించి ఆలోచించుచుండు మన గ్రామవాసికి పరిశ్రామికవస్తువుల నలంకరించు కళనుగూర్చి కొంత వినిపింతము. ఈ రకముకళయందు మనదేశము పేరు పొందినదని వెనుకనే చెప్పితిమి. ఇచట చెక్కడపుపని దంతపు పనులు రాగి ఇత్తడి నక్షీ పాత్రలు, మట్టిపాత్రలు, అంచులబట్ట లు మిక్కిలి సుందరములైనవి. అందుచేత నివి అంతటను మె ప్పు పొందినవి. చెన్నపట్టణమున 1903, 1904 సంవత్సరపు ప్రద ర్శనమునకువచ్చిన మంచిరకము పనులను కొన్నిటిని ముచ్చటిం తము. ఫొటోగ్రాఫ్ ఆల్బము (Photo Album) ను కట్టివేయు రెండు గంధపుపలకలు, ముగ్గురు మైసూరు పనివాండ్రచేత బ హుసుందరముగా చెక్కబడియుండెను. ఇందు పత్రసముదాయ ము అడవిమృగములు చెక్కబడి సర్వవిధముల భారతీయకళో న్నతిని చూపుటచేత ఈప్రదర్శితమును చెన్నపట్టణపు గవర్నరు గారు 450 రూపాయిలకు కొనిరి. కొన్ని గంధపుచెక్క ప్రదర్శి తములు ఇంతకంటెను రమణీయముగానుండినవి. తిరువాన్కూ రి కళావిద్యాశాలనుండి (School of arts) వచ్చిన దంతపు మూతపాత్ర మిక్కిలి బాగుగనుండెను. మఱియొక దంతపుప్ర దర్శితము తిరువాన్కూరుమహారాజుగారి మెరవణిఉత్సవమును చూపుచుండినది. ఈ మూతపాత్ర 500 రూపాయిలకు దొరత నమువారి మ్యూజియమునకు కొనబడినది. ఇట్టి యాపురము రా జాగారు పంపిన ఇనుప అంకుశములజత మిక్కిలి అద్భుతముగ నుండినవి. గట్టి ఇనుమును చెక్కి బహునాజూకైన నమూనా

క్రింద చేయుట ఆశ్చర్యముగ నుండెను. నెల్లూరునుండియు మదరాసు కళావిద్యాశాలనుండియు మంచి మంచి నమూనా మట్టిపాత్రలు వచ్చినవి. ఈ ప్రదర్శనమునకు వచ్చిన సుద్దర మైనబట్టలు ఇండియాయందు తప్ప మరి యే దేశములందును తయారగునవి కావు.

ఇట్టి చిత్రపుపనులందు మనదేశపువారు జాగ్రతగా నుండ వలయును. విదేశములందమ్మకము యేర్పాటుచేయవలయును. కాని విదేశపు గ్రాహకుల (Customers) సంపాదించుటకై పని వాడు తనపనితనమును పాడుచేసికొనుట మంచిదికాదు. తమ దేశమునకు బహుమతులుగా పంపదలంచిన వారియొక్క పీడింపు లకును వారి పేంళనమునకును జంకి, హైందవశిల్పకారుడు తన నైజమైన హైందవశైలిని వదలి యూరోపియనుల శైలిని అను కరించినను, చవుకసరకుల సప్లయిచేయుటకై వాని నాణ్య మును తగ్గించినను, దేశీయకళకు అధోగతితప్పదు. భారతీయు ల చిత్రపుపని మంచిది. యూరోపియనుల చిత్రపుపనికూడ మంచిదే. కాని ఇదియు నదియు కానిది పనికిమాలినదే యగును. ఇట్టిసంకరజాతి కళ యెక్కువగుచున్నదనుటకు చిహ్నములు కనబడుచున్నవి. ఇందుకు క్రీహాండు చిత్రలే ఖనమొక కారణము కావచ్చును. పూర్వకాలమున హైంద వ చిత్రకారుడు యంత్ర సాహాయ్యము గోరక కనుచూపు తో చిత్రపుపనులు చేయుచుండెడివాడు. అందుచేత అతని నమూనాలు క్రొత్తవిగను వ్యక్తిత్వము (Individuality) కల విగను ఉండెడివి. ఇపుడిపుడు కంపానులు రూళ్ళకఱ్ఱలు వాడు కలోనికి వచ్చుటచేత నమూనాలన్నియు ఒక లేఖనమునుబట్టి

నకలుతీయబడినట్లు ఇంచుకైనను భేదములేక ఒకేవిధముగా నుండును. కళాకౌశలముగల వారిచేత చేయబడిన ఇత్తడి తట్టలు వ్యక్తిత్వముగలిగి అందముగనుండును కాని రూళ్ళకఱ్ఱలు కంపాసులు వాడుకలోనికి వచ్చినపక్షమున ఈ తట్టలు ఇండియాయందు తయారగుటకు మారు ఇంగ్లండునందే గంటలకు వందలకొలది యంత్రసాహాయ్యమున చేయుట సులభముగ నుండును. బాగుగాతయారైన అంచుబట్టలమీద ఒకొక సమయమునందు జంతువులయొక్కయు మనుష్యులయొక్కయు వికారపు బొమ్మలయందు మార్పు కలిగించుటమొదలగు సర్దుబాటులు జరుగవలయును కాని హైందవ కళావ్యక్తిత్వము (Individuality)ను పోగొట్టుకొనరాదు. ఇందుకై శిల్పులనెఱిగిన ప్రతి జ్ఞానవంతుడును జాగ్రతపడవలయును. లేనియెడల కళాపరిశ్రమయంతయు అధోగతి పట్టును.

మనదేశమునందలి శిల్పకారుడు తాననుకున్న నమూనా స్వభావసిద్ధముగ నుండవలయుననుసంగతి మరచిపోవుచుండును. 1903, 1904ల లో చెన్నపట్టణమునకొక ప్రదర్శితము వచ్చినది. అదియొక పెద్దవ్రాతబల్ల. దానికాళ్ళు చిన్న ఏనుగుల వీపుమీదనుండుటచేత ఆబల్లబరువునకు అవి నలిగిపోవుచున్నట్లు కనబడుచుండినవి. దీనిని చూచుట అందరకును కష్టముగనుండినది. బల్లయొక్క పనితనము బాగుగనుండినది. కాని ఈ లోపమువల్ల ఆపనితనము రాణించలేదు.

ఇట్టి లోపములవల్ల చెడిపోయిన చెక్కడపుసామాను లనేకములుండినవి.

మన దేశపు పనితనము అజాగ్రత సమాప్తమగుట చేత పలు మారు చెడిపోవుచున్నది. ఎగుమతులవిషయ మీపొరబాటు పుట్టించ తగదు. యూరోపియనులు మెరుగుపెట్టు విషయము ను ముఖ్యముగా గమనింతురు. కావున అట్టివాని నెగుమతిచే యుటవలన నష్టము కలుగవచ్చును. మదరాసుప్రదర్శనము నకు ఇట్టి ప్రదర్శిత మొకటి వచ్చియుండెను. ఇది ఒక ఇత్తడిగో పురము. ఇందు చెక్కడపుపని మిక్కిలి నాజూకుగా నుండినది. బొమ్మలు మిక్కిలి సొగసుగనుండినవి. కాని దీనిపీఠమువద్ద రే కును వ్రేళ్ళతో అడ్డదిడ్డముగా వంచి దానికి మామూలుడుక్కు మరమేకులను తగిలించియుండిరి. ఈ మేకులైనను పూర్తిగా త్రిప్పియుండలేదు. ఇందుచేత పనితనము రాణించకపోయినది. పైని చెప్పినదానింబట్టిచూడ మనదేశపు పరిశ్రామిక భవిష్య త్తు బాగుండుటకు మనము పాశ్చాత్యులతో నేకీభవించి వా రిపద్ధతుల నవలంబింపవలయునని తేలుచున్నది. మన పరిశ్ర మాభివృద్ధికి పాశ్చాత్యుల ఆవిరియంత్రములేమి మరి యితర పరికరములేమి తప్పక కావలశియుండును. కాని కళాభివృద్ధివి షయమున పాశ్చాత్యుల ననుసరింప పనిలేదు. అనుసరింపకూ డదు. మన కళాకార్యము (art work) ఉత్కృష్టమైనదేకాని మన జీవనముమీాద దీని ప్రభావమే స్థిరముగ నుండవలయునేని మన కళాకార్యకులు మూడు విషయములను తప్పక గమనిం చవలయును.

(1) వారు చేసినపనియందు వ్యక్తిత్వముండునటుల చూ చుట (2) నమూనాలన్నియు స్వభావసిద్ధముగ నుండుట (3 చే సినప్రతివస్తువు ఉచితవిధమున సమాప్తముచేయుట.

## ఎనిమిదవ ప్రకరణము.

## ఇండియన్ స్టోర్లు Indian Stores.

మన గ్రామవాసి సముద్రతీరమునందు నొక గ్రామములో నివసించువాడనుకొందము. ఈ తీరమున చేపలు విశేషముగానున్నవి. వీనిని చెడకుండ డబ్బీలో వేయుటకు వలసిన కొబ్బరినూనె కావలసినంత దొరుకుచున్నది. ఈ చేపలడబ్బాలు విశేషముగ దిగుమతియగుచుండుటచేత వీనికిగిరాకి కావలసినంతయున్నట్టు కనబడుచున్నది. కావున చేపలను డబ్బీకెత్తుటకుగాను డబ్బీకిని నూనెకును అగు కర్చుకంటె యెక్కువ కాదు. ఈ గ్రామము సముద్రతీరమున నుండుటచేత ఈ చేపలడబ్బాలను విదేశములకుకూడ ఎగుమతిచేయుటకుకూడ వీలున్నది.

మన గ్రామవాసి వీనినన్నిటిని పరిశీలించి తనతోడిగ్రామవాసులతో బాగుగనాలోచించి, ఈ పరిశ్రమను బాగుగఎరిగిన నిపుణునియొక్క సాయమున డబ్బీచేపలను బాగుగతయారుచేసినాడనుకొందము. తరువాత యితడు చేయవలసినదేమి? ఇరుగుపొరుగు గ్రామములందు వీని అమ్మకము చూడవలయును కదా? ఇందుకుగాను నమ్మకమగు ఏజంట్లను ఏర్పరుపవలయును. పేరుపొందిన యూరోపియన్ పార్సీ మోదీలు (భోజనసామాగ్రిని సప్లయిచేయువారు) సరుకు మంచిచెడ్డల నెంచక స్వదేశవస్తువు లన్నంతమాత్రముననె సాధారణముగ వానిని తమ షాపులలో చేరనియ్యరు. వారెందుకు చేరనియ్యవలయును? ఇటలీనుండి చేపలడబ్బీలు తెప్పించి 8 అణాలకొకదానిని అమ్ము

ము ఎక్కువలాభము సంపాదించువారు స్వదేశపుచేపల డబ్బీల
ను స్వల్పధరల కెందుకమ్మవలయును? ఇందుచేత మనసరుకులు
సాధారణముగా ఏచిల్లర యంగడిలోనో పెట్టబడును. కావున
నసీదుబజారులోనుండు మహమ్మద్ బక్సు వీనిని కొని చిల్లరస
రకులనడుమ తన యంగడి చొరుగులలో నుంచును.

మహమ్మద్ బక్సు బజారునందు అంగడిపెట్టుటయేగాక ఇల్లి
ల్లు తిరిగి అమ్మకము చేయువాడు కాన మరుసటిదినము ఈ చే
పలడబ్బీకి యెట్టి అమ్మకముండునో చూతమని తన సంచిలో
నొక డబ్బీని వేసికొని బయలుదేరెను.

“సలాము అమ్మగారూ!” అనుచు మహమ్మద్ బక్సు వసారాలోకూర్చొ
ని కుట్టుపని చేయుచుండు దొరసాని పాదములవద్ద తన మూటను విప్పమొద
లుపెట్టెను. ఇతర ఆంగ్లస్త్రీలవలె ఈమెకును కావలశిన తీరుబాటుండుట
చేత కుట్టుపని తన తొడమీదనుంచుకొని తమాషా చూచుటకై ముందునకువం
గి చూచుచుండెను. మహమ్మదుబక్సు మిక్కిలి నేర్పు ఓర్పులతో తన మూ
టలోని సరుకులను చూపమొదలుపెట్టి కాకితములు, కవర్లు, లక్క, కత్తెర
లు, కత్తులు, దారము, కాలరు గుండీలు, సబ్బు బిళ్ళలు, అగ్గిపెట్టెలు, మొ
దలగునవన్నియు వరుసగా తీయుచు సార్డిన్ చేపలపెట్టెకూడ తీసెను.

దొరసాని నవ్వుచు “సార్డిన్ల పెట్టె యెక్కడ దొంగిలించికొని వచ్చి
నావు” అని అడిగి “వేలములో కొనినడబ్బీ కాబోలునని అనుకొనుచు త
మాషాకై చేయి చాచి డబ్బీనందుకొని అది క్రొత్తదిగనుండుటయు దానిపైని
క్రొత్త చీటీనుండుటయు ఆచీటీమీద “సాన్డ్లు రత్నపిళ్లె అండు కో వచిలి
పట్టణము” అని అచ్చువేయబడియుండుటయు చూచి తమాషాగానున్నదె
యనుకొనుచు ‘ఇది యెంత’ అని నవ్వుచు నడిగెను. “మూడణాలు” అనిబ
క్సు మిక్కిలి వినయముతో బదులుచెప్పెను. పొడుగుచేతుల కుర్చీమీదకూ
ర్చొని ఏకాగ్రచిత్తుడై వార్తాపత్రికలు చదువుచుండు భర్త వైపునకు తిరిగి

అతని చేరబిలచి "ఇటు చూడుడు. ఇదిగో ఇండియను సార్డిన్లు. ఈ సాయంత్రము టీతో కొన్ని యియ్యనా అనెను. "నీవు యియ్యవద్దు ఫీడో (కుక్క పేరు) కియ్యి" అని కోపముతోననెను. "అయ్యో పాపము ఫీడో," అని కుక్కనుపిలచి దానిమూతికి డబ్బీని రాచుచు దుర్మార్గుడ! నీకు విషము పెట్టవచ్చినాడు" అనుచు సార్డిన్ డబ్బి నేలపడవైచి సూదులకట్టను దారపుకండెనుకొనెను.

మహమ్మదు బక్సు సామానులనన్నిటిని మూటకట్టుకొని ఇటు నాలుగైదు చోట్లచూచి ఒకమారు చుట్టితిరుగుట పూర్తికాకమునుపే సార్డిన్లమీదవిసుగుపుట్టి ఇల్లుచేరెను.

ఈ మహమ్మదుబక్సేనా సార్డిన్ల అమ్మకమునకు తెచ్చువాడు! వీనిమాటయందెవరికి లక్ష్యముండును? ఇందుచేతగదా స్వదేశీయులచే స్థాపింపబడి జయప్రదముగా జరుగవలశిన పరిశ్రమలు పాడైపోయినవి. కొన్ని పేరునకుమాత్రము ఉన్నవి. మరియొకటాలోచింతము. స్వదేశపదార్థములను కారణముచేతనా వీనికమ్మకము లేకపోవుట? కాదు కాదు. ఏమనగా మనదేశపు తేయాకు కాఫీలు మనదేశపుచుట్టలు మొదలగునవన్నియు మనదేశమునందే ఇంగ్లీషువారిచేత తయారుచేయబడి విశేషముగా అమ్మకమగుచున్నవి. ఎందుకు? ఉత్పత్తి చేసినవాడు తమవస్తువులను పెద్ద పెద్ద షాపులలో పెట్టించి వారిచేత అమ్మించుచున్నారు. మన బిస్కట్లు, కప్పతాళములు మొదలగు వస్తువులు సాధారణముగ చిన్న చిల్లరియంగళ్ళలోనేగాని పెద్ద పెద్ద షాపులందుండవు. జరుగుబాటుగలవారు ఈ చిన్న చిల్లరయంగళ్ళకు వెళ్ళనే వెళ్ళరు. అందుచేత వారికీవస్తువు లున్నట్లు కూడ తెలియదు. విక్టోరియా (Victoria) బండిలో కూర్చొని వ

చ్చినదొరసానియు, కోచిబండిలో కూర్చొనివచ్చిన హైందవమ హాజనుడును, కావలశిన వస్తువులుకొనుట కీ చిన్న యంగళ్ళ కు వెళ్ళుదురా? వస్తువులు కంటికింపుగా పేర్చబడి హాయిగా గాలి వీచుచుండు షాపులయెదుట కేవిగా దిగటకిష్టపడుదురు. కావున చిల్లరయంగళ్ళకు క్రొత్తగవచ్చియుండు వస్తువులను చూచువారేయుండరు. ఎందుకనిన క్రొత్తవస్తువులను కొనువా రు యెక్కువతరగతివారు. తక్కువవారల ఆవశ్యకములు కొ ద్దిగనుండును. పైగా నూతనవస్తువులయందు వీరికినమ్మకముండ దు. అందుచేత క్రొత్తసరుకు లెప్పటికైనను ముందుగా ఎక్కు వతరగతి కొనువారలకు తృప్తికలిగించవలయును. ఈకారణ ముచేత వానియుత్పత్తి యెక్కువయి ధరలు తగ్గినతరువాత సామాన్యజనులు కొనమొదలుపెట్టుదురు. ఇంతవరకును యె క్కువతరగతివారినే నమ్ముకొననలశియుండును.

తినుబండారముల విషయమునకూడ స్వదేశపుసరుకులందు ఐశ్వర్యవంతులకు నిజముగా ద్వేషమేమియు లేదు. ఇందుకు దాహరణములు మదరాసునం దనేకములున్నవి. మౌంటురోడ్డు లో నొక స్వదేశీయుల దర్జీషాపున్నది. దీని కార్యస్థానము పరి శుభ్రముగను దీనిఆవరణము కన్నులకింపుగను ఉండుటచేత యూరోపియనులలో నాగరికశిఖామణులుకూడ ఇచటికి వచ్చు చుందురు. ఆభరణవర్తకులును నక్షీపనిచేయు పార్శీవారును మ దరాసునందు మంచివ్యాపారము చేయుచున్నారు. వీరుకాక స్వదేశభక్ష్యకారుడొకడున్నాడు. ఇతనిషాపు పెద్దబజారువీధి యందుండుటచేతను, పదార్థములన్నియు పరిశుద్ధముగానుండు టచేతను, మదరాసునగరములో తినుబండారములు సరఫరా

చేయు యూరోపియనులతో సరిసమానముగ అందరికిని సప్లయిచేయుచున్నాడు. ఇతని పాలు పెరుగు వెన్నలు అప్పటముగనుండుటచేతను, ఇతడు ఈపట్టణమున పెద్దలకు చాలమందికి తనసరుకులను సప్లయిచేయుటయేగాక ఇతరపట్టణములకు కూడవానిని పంపుచున్నాడు. వీనినిబట్టిచూడ యెక్కడనో దురభిమానముగల కొందరికితప్ప స్వదేశసరుకులయందు యేమాత్రము ద్వేషములేదని తెలుచున్నది. కాని పదార్థమెంత మంచిదయినను తగినవారుదానిని అమ్మకమునకు తెచ్చినగాని అది అమ్ముడుపోదుకదా! ఇక చిన్న పరిశ్రామికునకు సొగసైన ఆవరణ మెక్కడనుండి వచ్చును? ఇతడేమిచేయవలయును? దీనికొక యుపాయమున్నది. ఇదియే ఇండియన్‌స్టోర్ల నేర్పాటుచేయుట.

స్టోర్లనగా నేమియో చెప్పవలయును. స్టోర్లనగా ఒకపెద్దవిశాలమైన అమ్మకపుభవనము. ఇందొకదానినుండి మరియొకదానికి వెళ్ళుటకువీలుండు గదులనేకములుండును. ఒకగదియందు ఒకొకరకపు వస్తువులుండును. ప్రతిదానియందును సరుకులుఅమ్మకమునకు తగినట్లు ముచ్చటగా పేర్చియుందురు. ఇచట బేరమనుమాటయుండదు. ప్రతివస్తువును దానికంటించియుండు చీటిమీద ధరకేఅమ్ముదురు. ఇట్టిస్టోర్లు బాగుగా నేర్పాటు చేయబడినయెడల యేపెద్దపట్టణమునందైనను అమ్మకమువిస్తారముజరుగును. అందుచేత ధరలుతక్కువగానె యుండవచ్చును.

ఇట్టిపాపులందుకొనుట యెంతో ముచ్చటగనుండును. ఇందుతిరుగాడుటకు వీలగుదారి యుండుటచేత ఒకగదిలోనుండిమరియొక గదిలోకి పోయి అన్నిరకముల వస్తువులను చూడవచ్చు

లేక వకీలు, పైఛాదరీగారు కార్యదర్శియు మేనేజింగు డైరక్టరుగాను ఉండిరి. దీని ఆడిటర్లుగ (Auditors సంప్రతిదారులు) యూనియను ఛార్టర్డు అకౌంటెంట్లను ఘరము నియమించిరి. కాబట్టి ఈకంపెని యేర్పాటయిన స్థితినిబట్టి చూడగా ఇది ప్రజలకు మిక్కిలి నమ్మకమును పుట్టించునదిగా నుండెను.

దీని యుద్దేశములు.

(1) ఇండియాలోని పంటలు ఇచటి మ్యానుఫ్యాక్చర్లు కళాపదార్థములు మొదలగువానిని పోగుచేసి వీని అమ్మకమునకు తగినసాపుల నేర్పరచుట.

(2) ఇండియాలో యేభాగమునందైనను యేజంట్ల నేర్పాటుచేసి స్వదేశవస్తువుల కొనుగోలు విక్రయమునకుతగిన సదుపాయములు నేర్పరచుట.

(3) విదేశములకు స్వదేశసరుకుల నెగుమతిచేయుటకును, అటనుండి ఇతరపదార్థముల దిగుమతిచేయుటకును, విదేశములందు యేజంట్ల నేర్పాటు చేయుట.

(4) కంపెనీకి కావలసినటువంటి స్వదేశపుపంటలు మ్యానుఫ్యాక్చర్లు కళాపదార్థములను సంపాదించుకొరకు మనదేశపు పనివాండ్రకును శిల్పులకును మాన్యుఫాక్చరుదార్లకును సాధ్యమైనంతవరకు అన్నివిధముల సాయము చేయుట.

(5) కంపెనీవారి వ్యవహారవిషయములకు కావలశిన ఫ్యాక్టరీలును కారుకానాలను స్థాపించుట.

(6) కంపెనీయొక్కయు హైందవవ్యాపారముయొక్కయు క్షేమముకొరకు మనదేశపుపంటలయొక్కయు, మాన్యుఫాక్చర్లయొక్కయు, కళాపదార్థములయొక్కయు ఉత్పత్తిని పురికొల్పుటకును, హెచ్చు తక్కువకాకుండ సరిచేయుటకును అవశ్యకములగు కంపెనీలను సంయోగములను ప్రజాసంఘములను వృద్ధిచేయుట.

(7) కంపెనీవ్యవహారము యొక్క, విరివిని అధికము చేయుటకై కళా పరిశ్రమలను వృద్ధిచేయుటకును, కొన్నిటిని స్థిరపరుచుటకును, కొన్నిటికి పునర్జీవనమునిచ్చుటకును సర్వవిధముల పనిచేయుట.

ఈ కంపెనీ రిజష్టరుఅయినపుడు లక్షరూపాయిల చందా పోగుఅయినతోడనే వ్యాపారము నారంభింప నిశ్చయించిరి. ఆమొత్తము త్వరలో చందాలరూపమున వసూలాయెను. 1902 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో పని ప్రారంభమాయె నది. సంవత్సరాంతమున లెక్కలు సరిచూచుకొనగా మూలధనముమీద నూటికి 2 రూపాయిలనంతున లాభము నిసలుగా గిట్టినది. ఈ లాభమునంతయు పంచిపెట్టుటకు బదులు రిజర్వ్ ఫండు (Reserve Fund) క్రింద స్థాపించిరి. ఇది మిక్కిలి ఉత్తమమైనపని. ప్రారంభమునకిది మిక్కిలిమంచిది. ఈపద్ధతిప్రకారము పనులు జరుగుచుండినయెడల ఈ స్టోర్సు జయప్రదముగా నడచితీరవలయును. ఇది యేమాత్రము జయప్రదముగా జరుగుచుండినదియు దీని సాంవత్సరిక వివరణపట్టికలను బట్టియు శిలుకుపట్టీలను (Balance sheet) బట్టియు తెలిసికొననగును.

మనదేశములోని పౌరులందరు కలిసి తమ తమ పురములందు ఇండియన్ స్టోర్ల నేర్పాటుచేసినయెడల వీరు మంచిలాభమును సంపాదించుకొనుటయే గాక తమ దేశవ్యాపారమునకు మేలుచేసినవారగుదురు. ఈ స్టోర్లు యెంత ప్రబలమైనయెడల పని అంత బాగుగాజరుగును. కాబట్టి కలకత్తాలోని కంపెనీకి పోటీగా చిన్న చిన్న కంపెనీలు పెట్టుటకుబదులు, కలకత్తా కంపెనీతోచేరి దానికి శాఖలుగా చిన్నకంపెనీల నేర్పాటుచేయుట యుత్తమమైనపని. ఇట్లుచేసినయెడల చిన్నకంపెనీలకు కొం

తసాయముండును. ఈ కంపెనీల ప్రాబల్యము మనదేశమునం దేగాక వర్తక ప్రపంచమునందంతటనుకూడ తప్పక వ్యాపించును.

మహామ్మదుబక్సు తన బ్రతుకు పోయినదని వగవవచ్చు నందు రేమో. ఉత్పత్తి చేయు పనివాండ్రు వేలకొలది దేశము నందంతటనుండగా వారి జీవనోపాయములను వృద్ధిచేయుపనిని యెక్కువగా చూడవలయును గాని వీధులవెంటతిరిగి అమ్మె వారి లాభనష్టముల నాలోచించవలశినది కాదు. ఇట్టి సదుపాయములుండినయెడల ఉత్పత్తి చేయువారల సంఖ్య యెక్కువగును. అయినను మహామ్మదు బక్సు తన జీవనముపోయినదని చింతింప పనిలేదు. మనదేశమునందు ఎండ యెక్కువగనుండును గనుక ద్వొరసానులు వెలుపలికిరాక వారి వారి వసారాల లోనె వ్యాపారముచేయ నిష్టపడుదురు. ఇట్టి స్థితియందు మహామ్మదు బక్సు సరుకులను సంచిలోవేసికొనిపోక పైన 'ఇండియనుస్టోర్లు' అనుపేరు పెద్దఅక్షరములతోనుండు చేతిబండిలో వేసికొని ఈ కంపెనీతరఫున దానిని తోసికొనిపోవుట యెక్కువసుకరముగనుండును. అప్పుడితని సార్డిన్లకు గౌరవమెక్కువగును. వానిని కుక్కమూతిమీద తోమరు. సూదులు దారము అమ్ముటకంటె యెక్కువలాభమితనికి వచ్చును.

ఈ విషయము నాలోచించుకొలది ఒక గొప్ప ఇండియను స్టోర్లు యేర్పాటుచేసి ప్రతినగరమునందొక కొమ్మయు, ప్రతియూరనొక రెమ్మయు ఉండునటుల చేయుట మాహాత్మ్యప్రముగనుండునని తోచుచున్నది. ఇట్టికంపెని హైందవవ్యాపారమునకు ప్రబలమైన కారణముగనుండును. దీనివల్ల ఉత్పత్తి అధికమగును. ఛిన్న పరిశ్రామికులగు మన గ్రామవాసివంటి

దేశాభిమానులకు వీరు పలుకుబడిగల సలహాదారులగుదురు. వీరివలన నేయేపదార్థములకు గిరాకి యెక్కువగునో దేనికి గిరాకియుండదో తెలిసికొని చిన్న పరిశ్రమికు లట్టి వానిని ఉత్పత్తి చేసి, ఈ కంపెనీద్వారా త్వరగా అమ్మకమునకు తెత్తురు. భారతీయ గ్రాహకుడు సొగసుగానుండు షాపునకు వెళ్ళి అచ్చట మంచినమ్మకమైన సరుకులను తక్కువధరలకు కొనగలుగును. స్టోర్లన్నునో ఒట్టుధరలకు తమ సరుకులను విదేశములకు ఎగుమతిచేయుటయే గాక ఇతర యెగుమతిదారుల వ్యాపారమునకుతగిన సరుకులనుకూడ ప్రదర్శించుచుండును.

పైవిషయములు యెనిమిదిసంవత్సరములక్రింద ఇంగ్లీషుభాషయందు ప్రజలకు తెలుపబడినవి. ఈ సలహానందరు ఆమోదించిరి. పురనగరములందు ఇండియనుస్టోర్లు న్యాషనల్ స్టోర్లు అనుపేరుతో అంగళ్ళు అనేకము బయలుదేరినవి. కాని ఇవియెంతవరకు స్వదేశవర్తకమును అభివృద్ధిచేసినవో చెప్పుటదుస్తరము. ఇది స్వదేశవర్తకమునకు అపకీర్తి తెచ్చినవనుట యెక్కువ నిజము. ఇందుకు కారణములున్నవి.

(1) స్వదేశపుస్టోర్లనియు జాతీయస్టోర్లనియు గుర్తుబల్లలు వేసిన అంగళ్ళు చాలవరకు నిజమైనవికావు. కందసామి అండు కో అని బజారులోనుండిన దుకాణము స్వదేశాభిమానవ్యాపారము కాయుచుండగా కొనువారల నాకర్షించుటకై స్వదేశీస్టోర్లని మారినవి. మొదటనుండినషాపే ఇప్పుడీపేరుపెట్టుకొనినది. ఇందు దేశాభిమానమేమియున్నది? కేవలము డబ్బులాగుటకు వేశినబల్లగాని ఇతరము కాదుకదా? జనులకప్పుడుండిన చిత్త సంకల్పము (Sentiment) నుండి యేలాగైనను డబ్బురాబ

ట్టు ఉపాయమునే ఇతడాలోచించెను. ఈతని చిన్నషాపునకు ఎక్కువతరగతి కొనువారురారైరి. అతని తగ్గురకపుసరుకులు హైందవవర్తకమునకు కీర్తినితెచ్చినవికావు.

కొన్నిచోట్ల దేశాభిమానులు నిజమైన ఇండియనుస్టోర్లు యేర్పాటుచేసి పుణ్యముకట్టుకొనిరి కాని వీరు చిన్న అంగడితో తృప్తిపొందుటచేత నిజమైనజాతీయ వ్యవహారము (National business) జరుగలేదు. ఇందుకొక ఉదాహరణము. ఇండియా యొక్క వర్తకాభివృద్ధికొరకు ఒక పెద్దనగరపుమహాజనులు మార్గదర్శకులై ఒక ఇండియనుస్టోర్ల నేర్పాటుచేయనిశ్చయించి దేశాభిమానము చూప ప్రసంగములుచేసి స్టోర్లనుస్థాపనచేసినట్టు వార్తాపత్రికలందు డంబముగా ప్రచురముచేసిరి. వీనినిచదివి ఒకడు ఈ స్టోర్లను చూచుటకై వెడలెను. జాతీయకార్యమునకు తగినకట్టడమును చూతునని అనుకొనెను కాని తీరావెళ్లి చూచుసరికి యేమనిచెప్పను! ప్రక్కననుండు శిగరెట్లు సూరగాయలు చీనారేకులాంతరులు అమ్ము దుకాణమువంటిదాని మీద గుర్తుబల్లనుచూచి మిక్కిలి అసహ్యపడెను. ఈస్టోర్లుకొన్ని మాసము లూపిరితో నుండి కడపట అందరనుకొనినట్లు పడిపోయినవి. కాబట్టి జాతీయప్రమేయము నెప్పటికిని తగినస్థితియందుంచ యత్నించవలయును. అట్టిస్థితియందుంచుటకు తగినంత ధనముండిననేగాని ఇండియను స్టోర్ల నేర్పాటుచేయకూడదు. రెండు బట్టలు నాలుగు పెట్టెలు, మొదలగు చిల్లరసామానులనుంచి ఇండియను స్టోర్లని పేరుపెట్టుట అపకీర్తిగాని లాభమేమియు లేదు. అటుగాక కొందరు కలిసి తగినభాగస్థులను పోగుచేసి కావలసినధనము వసూలయినతరువాత కంటికిం

పగుషాపునందు మంచిరకపువస్తువులను తెచ్చి ఖరాధరలకు విక్రయముచేసిరేని యెంతయుపయోగకరముగనుండును. వీని వల్ల మనదేశమున ఉత్పత్తియయిన సరుకులెంతసులభముగ అమ్మకమునకు వచ్చును. ఇవి జయప్రదముగా నడుచుటకు సాధారణపు అంగళ్ళకంటె అన్నివిషయములందును మంచివిగా నుండవలయును. లేకున్ననివి స్వదేశమనోరధము నీడేర్చుటకు బదులు దానికి వ్యతిరేకముగ పరిణమించును.

ఇండియను స్టోర్లు నభివృద్ధిచేయుటయేగాక యూరోపియనులషాపులందుకూడ మనదేశపదార్థముల (Indian section) నుంచుట ఏర్పాటుచేయునట్లు షాపుదారులను ఒప్పింపవలయును. యూరోపియను షాపుదారులు సాధారణముగా వ్యాపారలాభముల చూచుకొనువారు కావున దీనివలన లాభము వచ్చునని యేమాత్రము నమ్మకముకలిగినను వారు ఇండియను శాఖను పెట్టుటకు తప్పక యొప్పుకొందురు.

ఇండియనుస్టోర్లు బాగుగా నడిచెనేని ఎంతయైనను లాభము వచ్చుననుటనిశ్చయము. కాని ఏదియెట్టులున్నను మనదేశపుసరుకులను సమీపముననుండు గ్రాహకులగు మనవారలకే అమ్మ ప్రయత్నించవలయును.

## తొమ్మిదవ ప్రకరణము.

## గ్రాహకులు (Customers).

వెనుకటిప్రకరణములో కడపటిభాగమున మనదేశపు వస్తువులను కొనుటకు గ్రాహకు లుండవలయునని చెప్పితిమి. ఈప్రకరణమునందు గ్రాహకులెవరైనదియు వారికి మనదేశపు సరుకుల నెట్లుపరిచయము చేయనలసినదియు వివరింపబడును.

మనదేశమున విస్తారముగను వివిధముగను ఉండు స్వభావ సంపదనుబట్టి చూడగా సాధ్యమైనంతవరకు మనకు కావలశిన ఆవశ్యకములన్నిటిని మనదేశమునందే తయారుచేయవలయున నుట ప్రతిపరిశ్రామికునకును ముఖ్యోద్దేశమై యుండవలయును. ఇట్టిస్వభావసంపద కలిగిన ఇండియాదేశము విదేశపుసరుకులనే నమ్ముకొని వానినే కొనుచుండుటమిక్కిలి గొప్పలోపము. ఇట్లనుటచేత సంరక్షణసుంకములుం (Protective duties) డవలయునని హెచ్చరించుటలేదు. అనిర్బంధక వ్యాపార నియమములు (Free trade principles) వాడుకలోనుండవచ్చును. ఈ నియమములుండినను మనదేశమునకుండు సంపదనుబట్టి, పరిశ్రమలు బాగుగ జరిగెనేని విదేశపుదిగుమతులు మనలను బాధింపవు. ఇండియాదేశపు ఇనుము యెప్పుడు వాడుకలోనికి వచ్చునో అప్పుడే యిండియాయొక్క వాణిజ్యస్వాతంత్రియము వచ్చినదనుకొనవచ్చును.

మనదేశపు సరుకులకు ముఖ్యగ్రాహకులు మనదేశమునందువారే. వీరితరువాత వచ్చువారలు విదేశీయులు. మనకుకాగా మిగిలినవి వారలకు పంపవలయును. ధాన్యము, తోళ్లు, దూది నూనెవిత్తనములు, మొదలగు పదార్థములు విదేశములకు అపరిమితముగా మనదేశము ఎగుమతిచేయుచున్నది. వీనినిబట్టి చూడ మనదేశము పరిశ్రామికవిషయములందు వెనుకపడియున్నట్టు కనబడుచున్నది. ధాన్యమెగుమతిచేయుట బాగుగనున్నదికాని తోళ్ళకుబదులు చర్మపుసరుకులను, దూదికిబదులు బట్టలతానులను, నూనెవిత్తులకుబదులు సబ్బుబిళ్ళలను, ఎగుమతిచేయుచుండినయెడల ఎంతబాగుగనుండును.

మనదేశమునందు గ్రాహకులను మూడు రకములుగా భాగింపవచ్చును. (1) మనదేశీయులు (2) మనదేశములోనుండు యూరోపియనులు (3) గవర్నమెంటులు, మునిసిపాలిటీలు, పబ్లికు కంపెనీలు.

(1) పూర్వముకంటె మనదేశీయులకు ఆవశ్యకము లేకేటను ఎక్కువగుచున్నవి. సుమారు నూరు సంవత్సరముల క్రిందట తూర్పుఇండియా కంపెనివారియొక్క శాశ్వతపువర్తకపుహక్కునుగూర్చి చర్చజరుగునప్పుడు కర్నల్ (తరువాత మదరాసు గవర్నర్ గారయిన సర్ థామస్——) మన్రోదొరవారు (Col. Munro) ఇట్లు వ్రాసియున్నారు.

ఏపదార్థములను వారంతటవారే చౌకగాను బాగుగాను తయారుచేసికొనగలరో, ఆపదార్థములను యేజాతివారైనను ఇతరజాతులవారివద్ద కొనరు. ఇండియాయందు ప్రజలకుకావలసిన సరుకులలో ప్రతిదియు యూరోపులోకంటె చౌకగాను నాణ్యముగాను తయారుచేయబడుచున్నవి. ప్రత్తి, పట్టు మ్యానుఫాక్చర్లు; ఇనుపఇత్తడి గృహోపకరణములు; తోళ్ళు; కాకితములు; వ్యవసాయపుపనిముట్లు మొదలయినవన్నియు ఇందు చేరినవి. వారియొక్క ముతక ఉన్ని సరుకు మంచిదికాకపోయినను మిక్కిలి చౌకయగుటచేత స్థిరముగనుండునదే. వారు తయారుచేయు కంబళ్ళు యెక్కువ వేడిమి నిచ్చునవిగను యెక్కువమన్నిక గలవిగను ఉన్నవి. ఇండియాలో గాజుసామాగ్రికి గిరాకి మిక్కిలితక్కువ, భారతీయులలో ముఖ్యులగుకొందరు మాత్రమె ఈ గాజుసామాగ్రిని కొందురు. వారికైనను చూచుకొను అద్దములు లాంపులే కావలసియుండును. వీనిని కొనువారు యూరోపియనులతోటి సాంగత్యముకలవారు. వీరైనను యీగాజుసామానును తమ యుపయోగమునకు వాడుకొనుటలేదు. యూరోపియనులు యెప్పుడైనను చూడవచ్చినపుడు వారికి చూపిం

చి మిగతసమయములందు వీనినొక మూల పడవేసియుందురు. శీతోష్ణస్థితుల నుబట్టియు వారి కులాచారములనుబట్టియు నేర్పడినవారి వినీతజీవనమునకు (SIMPLE mode of living) మనము ఇండ్లకును భోజనపుబల్లలకును చేయు అలంకారములుగాని మనము వాడుకొను ఫర్నిచరు (furniture) కొయ్యసామానులుగాని ఆవశ్యకములుకావు. తగ్గనసుండు మంటిఇండ్లలో నివసించుచు వట్టినేలమీద భోజనముచేయుచు ఉండు భారతీయులకు మన ము పయోగించు వివిధవస్తువుల అక్కరయేలేదు. వీరికి బల్లలులేవు. ఇండ్లయందు ఇతరకలపసామాను ఉండదు. భాగ్యవంతుల ఇంటిలో నొకతివాసీకాని చాపలుగానియుండును. కులాచారములనుబట్టి కొందరు భారతీయులు బయలను కొందరు పందిళ్ళలోను, పళ్లెములకు బదులు విస్తళ్ళలో భుజింతురు. ఈ చెప్పినదంతయు కంపెనీవారి నిరంకుశాధికారము (monopoly) క్రింద యూరోపియనులు చేసినహింసచేత నిరుపేదలయినవారి చరిత్రయని చమవరులు తలంతురుకాబోలు. ఇది నిజముకాదు. ఇండియాదేశమందు ప్రతిచోటను ధనాధికులందు ప్రతివానియొక్క జీవనముకూడ ఇట్లేయుండును. రాజాధిరాజుగారియొద్దనుండు ప్రధానమంత్రియొక్క జీవముకూడ నిట్టిదియె. ఈతని యిల్లుగుడిసెకంటె మెరుగుగనుండదు. దానిగోడలు మట్టివి. అమట్టి నేల చల్లగానుండుటకు ప్రతిదినమునను పేడనీళ్ళతో అలుకుదురు. ఇందేమియు ఫర్నిచరు ఉండదు. ఇతడు కావలసినవారికందరకు అన్నముపెట్టుచుండును. కానిస్నేహితులకు పెద్ద పెద్ద విందులు చేయడు. ఇతడు తన మీదిబట్ట నాపల పడవైచి గోండిమీది బట్టతప్ప మరేమియులేక బయట వట్టినేలమీద యొంటరిగా కూర్చుని భుజించును."

సర్ థామస్ మన్రో (Sir Thomas Munro) దొరగారు మనుష్యులను వారినడవడికను బహుజాగ్రతగా కనిపెట్టువాడు. మొగమాటములేక విశదముగను తెగువగను వ్రాయువాడు. (clear and forcible writer). ఈవల ఇరువది సంవత్సరములకు

(లోపుగా ఇండియాకు వచ్చినవారుకూడ సర్ థామస్ గారి వ్రాతలు అప్పటిస్థితులను సరిగా వర్ణించినవేననియు ఇప్పటి సాధారణపు వ్రాతలవలె ఎగ తాళికి వ్రాయబడినవి కావనియు తెలిసికొనగలరు. ఇప్పటికిని పల్లెటూళ్ళయందు జనులవాంఛలు (wants) మిక్కిలి తక్కువ. ఇప్పటికిని గ్రామాధికారి మట్టిగోడల యిండ్లలో నివశించునుకాని జమాబందికై వచ్చిన కలెక్టరుగారిని, అప్పుడప్పుడు వచ్చు షికారీలను ఆదరించుటకై ఒక గదియందు పెద్ద పెద్ద అద్దములు లస్టర్లు గుళ్లో బాలు సొగసుగా పెట్టియుంచును. మనదేశమువారు యథాస్థితి పరాయణులయినను విద్యాధికులుమాత్రము సర్ థామస్ మన్రోగారి కాలమున కంటె యెక్కువమార్పులు పొందినవారు. తయారైన సరుకులను కొనువిషయమున ఇప్పటియిండియా పూర్వముండినట్లులేదు. సర్ థామస్ మన్రోగారి కాలమున యూరోపులోకంటె యెక్కువ చౌకగాను బాగుగను చేయబడుచుండిన చేతినేత నూళ్ళను (hand made cottons) ల్యాంకషైరులో అభివృద్ధిచెందిన దూదిమిల్లులు తరుమగొట్టినవి. ఇంతేకాక మిల్లులలో తయారైన ఇతరపదార్థములకు పూర్వమునకంటె యెక్కువ గిరాకి తగిలినది. మన్రోగారి కాలమున గాజుసామాగ్రిని అడుగు వారేలేకుండిరి. ఇప్పుడు దానికి గిరాకియెక్కువయినది. చౌకగావొరుకు కిరసనాయిలును,చౌకయైన గాజు లాంపులు ఈ మార్పునకు కారణములు. నిరుపేదయగు కూలివాడు మినుకు మినుకుమను ప్రమిదదీపముతో తృప్తిపొంది యుండవచ్చును .కాని కిరసనాయల్ లాంపు ప్రతిపట్టణముననేగాక గ్రామములందుకూడ సాధారణమైనది. ప్రతిపెద్ద బజారు

నందును లాంపుషాపు ఒకటైనను మంచి వ్యాపారము చేయుచుండును. లాంపు చిమ్నీలవిషయమే మనదేశమున గొప్పపరిశ్రమకు ఆస్పదమున్నది. లాంపులు చూపుటద్దములేకాదు వాడుకలోనుండుట. పురములలో పెరిగిన మధ్యతరగతుల భారతీయులు సోడావాటరు—ఒకొకసమయమున విస్కీ—బ్రాండీల తోసహా—మీాద యెక్కువ మక్కువగలవారు కాన గాజులోటాలు సోడాబుడ్లు యెన్నియైనను కావలసియున్నవి. మంచి మంచి ఇండ్లయందు పూర్వపు కొయ్యకిటికీతలుపులకు బదులు అద్దపుబిళ్ళలను వేయువాడుక వచ్చినది. మంచిమంచి షాపులందు మట్టిగూళ్ళకు బదులు అద్దపుబీరువాలు వాడుకలోనున్నవి. మన్రోగారికాలమున ఇత్తడిపళ్ళెము ఇత్తడిచెంబు అరిటాకులే భోజన పానీయ సామాగ్రులుగా నుండినవి. ఇప్పటికైనను విస్తళ్లకు వాడుక తక్కువకాలేదు. కానిపింగానిగిన్నెలు పింగానిపళ్లెములు కూడ వాడుకలోనికి వచ్చుచున్నవి. ప్రతిబజారు నందును ఒకటి రెండు 'కాఫీ, టీ' షాపులుండును. వీనియందు పింగాని గిన్నెలు పళ్ళెరములు బల్లమీాదవరుసగ పెట్టియుందురు. ఇప్పటికిని నోటికిఅన్నము తెచ్చునవి చేతి వ్రేళ్ళేకాని ఇంగ్లీషువారి ఆచారముల నవలంబించిన భారతీయులు స్పూనులను ఫోర్కులను వాడుచున్నారు మన్రోగారి కాలమున వాడుకలో ఉండిన కాకితము ఇప్పుడు సరుకులను చుట్టిపెట్టుటకేగాని వ్రాతపనులకు యోగించుటలేదు. నోటుకాకితములు ఫూల్సుకేపుకాకితములే కాని ముతకకాకితములు వ్రాతపనులకు సరిపడుటలేదు. వీనినన్నిటినిచూడ మన దేశమున జీవనప్రమాణము (Standard of living) రానురాను అధికమగుచున్నదని తేలు

చున్నది. ఇదిమనదేశమునకు మేలగునా కాదా? ఇందుచేతమన సౌఖ్యము యెక్కువగుచున్నదా లేదా? యనువిషయము ఇక్కడ చర్చించవలశిన ఆవశ్యకములేదు. ప్రస్తుతవిషయము భారతీయుల వాంఛలనుగురించి కనుక ఇవి రానురాను అధికమగుచున్నవనియు ఇందుచేత మన్యానుఫాక్చరయిన సరులకు పూర్వమునకంటె గిరాకియెక్కువగుచున్నదనియు తెలియచెప్పుటయే ముఖ్యాభిప్రాయము.

పల్లెటూళ్ళయందు జీవనోపాయము తక్కువ అగుటచేత కూలిదొరకునని జనులు పట్టణవాసములకు పోవుచున్నారు. కావునపురజనుల సంఖ్యఏటేటను ఎక్కువగుచున్నది. పురములందుచేరిన ప్రతికొత్తవానికిని వారితండ్రి తాతలెరుగని కొత్త ఆవశ్యకములు కలుగుచున్నవి. మొదట ఇతడు తన పూర్వీకులకంటె యెక్కువగా బట్టలువేయును. ఇతనికి సాధారణముగా ప్రతిరోజునను ఎక్కువ సౌఖ్యములు కావలశియుండును. ఇతడు ఆరోజు పని పూర్తిచేసికొని వచ్చినతరువాత తన తండ్రివలె అరుగుమీద ఆనుకొనక పొడుగుచేతుల కుర్చీమీద చేరగిలబడును. ఇతనితండ్రి ఒకవేళ వ్రాయగలవాడయి యుండినయెడల మోకాలుమీద తాటాకు పెట్టుకొని వ్రాయుచుండెనుకాని ఇతనికిపుడు తెల్లకాకితములు వ్రాతబల్లలు కావలశియున్నవి. ఇతని తండ్రి మినుకు మినుకుమను ప్రమిదదీపముల వెలుతురులో కండ్లకు బాధనిచ్చి చదువుచుండెనుకాని ఇతడుసౌఖ్యముగా లాంపువెలుతురునందే చదువును. ఇతని తండ్రి నీళ్ళతో వంటిని తోముకొనుచుండెను కాని ఇతడిప్పుడు సబ్బువాడుకచేయుచున్నాడు. ఈతని తండ్రి చిటికెలువేయుచు నగా

రావాయించుటకు అలవాటుపడియుండెను కాని ఇతడిప్పుడు హార్మోనియముగాని ఫిడేలుగాని వాయించుచుండును. ఇతనితండ్రి నక్షత్రములనుగాని సూర్యునిగాని చూచి పొద్దెంతఅయినదని తెలిసికొనుచుండెనుకాని ఇతనికిప్పుడు గడియారము కావలశియున్నది. ఇట్లేచదువరి మిగతవిషయముల నన్నిటిని తనకుతానే యూహించుకొనవచ్చును. మనకిన్ని ఆవశ్యకములుండగా మన దేశమునందే వీనినన్నిటిని ఉత్పత్తిచేశి, విదేశపుసరుకులను దిగుమతిచేయక అన్నింటిని మనదేశమే సప్లయి చేయగలిగెనేని వీనినుపయోగించువారు మనదేశమునందే యున్నారు. దూరముపోవలశిన అక్కరయేయుండదు.

(2) అచ్చుపుయూరోపియనుల జనసంఖ్య మిక్కిలి స్వల్పమేకాని వారికి జీతము లెక్కువ. వారి రసజ్ఞతను తృప్తిపరచుటకు వ్యయమెక్కువయగును. కాబట్టి వీరిని గ్రాహకులుగా సంపాదించుకొనుట మనదేశమునకు కొంతలాభకరము. ఇండియాయందుండు యూరోపియనులజీతము అదే జీవనదశయందుండు భారతీయునికంటె 10 రెట్లు యెక్కువగనుండును. మనదేశపు 'బియ్యే' 25 రూపాయిలకు సులభముగా దొరుకును కాని ఇంగ్లండులోని 'బియ్యే' ఒకవేళవచ్చినయెడల 250 రూపాయలకు తక్కువకురాడు. వర్తకపుకంపెనీలయందు మొట్టమొదట 15రూపాయిలు దొరికితేచాలునని మనదేశపువారుందురు కాని విదేశమునుండి వచ్చుయూరోపియను 150 రూపాయలకు యెక్కువగానిచ్చినగాని రాడు. మనకు 100 రూపాయలనిన పెద్దజీతములోచేరును కాని యూరోపియనునకు అధమము వేయిరూపాయలైనను ఉండవలయును. సివిల్, మిలిటరి, పోలీసు, ఫా

రేస్టు, రైలు మొదలగు డిపార్టుమెంటులన్నిటిలోనుండు యూరో
పియనుల జీతము కలిపినయెడల లక్షలకొలది ధనమగును. ఈ
ద్రవ్యమంతయును, ఒక్కొక సమయమున ఇంతకంటె యెక్కు
వయును మనదేశముననే కర్చగుచున్నది. కాని మనదేశపు చే
తిపనులు చేయువారికి ఇందులో కొంతైనను రాకుండుట మి
క్కిలి విచారకరము.

యూరోపియను మనదేశమున ఇంత ఖర్చు చేయవలశినదెం
దుకు! మొట్టమొదట యూరోపియనుల వాడుక ప్రకారము
మనదేశమున జీవించుటకు యెక్కువ ఖర్చగుచున్నది. యూ
రోపునందలవాటుపడిన పదార్థములు ఇండియాయందు కూడ
అనుభవింపవలయునని ఆసతోనుందురు. అట్టి పదార్థములు
సాధారణముగ విలువైనవి. ఇందుకొక సామ్యపురుదాహర
ణము. ఇంగ్లండునందు పొద్దుట కోడిగ్రుడ్లు పందిమాంసము
తినుటకు అలవాటుపడియుండినవాడు ఇండియాయందుకూడ
అట్టి భోజనమే కోరును. ఇండియాయందు కోడిగ్రుడ్లు చవు
కయేగాని ఇతడిండియాలో కొను డబ్బీమాంసము తనదేశము
లో కొనుదానికంటె మిక్కిలి విలువయైనది. బీరు (Beer)
త్రాగుటకలవాటుపడినయెడల ఇంగ్లండులో రెండణాలకొకలో
టెడు దొరుకుచుండెడిది కాని ఇండియాయందు తనకు కావల
సిన పానీయము సీసాలనుండి తీసికొనవలసియుండును కనుక
దీనిఖరీదు కనీసము నాలు గైదు రెట్లుండును. 2 మనదే
శములోని యూరోపియను ఇంగ్లండులోనివానివలె మితవ్యయు
లు కారు (economic). ఇంగ్లండునందు జీతపుదినమువచ్చి
నప్పుడు తనకు ముందురాబోవు కర్చులను లెక్కపెట్టుకొను

చు బ్యాంకులో తనపేర ఎంతపైకము వేయవలయునాయని యోచించుచుండును. మనదేశమున వీరికెక్కువ జీతము వచ్చినను ప్రాతఖర్చులను లెక్కపెట్టుచు బ్యాంకులో తనకెంత అప్పుయగునో లెక్కించుచుండును. (3) ఇండియాలోని స్థితులు యూరోపియనులను మితవ్యయులుగా నుంచునంతటివికావు. సివిల్ మిలిటరీ మొదలగు డిపార్టుమెంటులన్నిటిలోను పనిచేయు యూరోపియనులు మితవ్యయులుగా నుండవలశిన ఆవశ్యకము లేదు. ఏలయనగా తమ ముసలితనమునను, తమ భార్యాపుత్రులకును ఉపయోగముండునటుల పెన్షను (వార్ధిక వేతనము) తప్పక వచ్చును. ఇది లేనిచోట్ల ఇండియాలోని యూరోపియనులు దయార్ద్రహృదయులై చందాలు వేసిపోగుచేసిన పెద్దమొత్తము బీదవారలకు సాయపడును (4) యూరోపియనుల సాంఘికజీవము (Social life) మిక్కిలి కర్చగునది. పగటిపూట తమాషాగా ప్రొద్దుపుచ్చుటకు ఇండియాయందు ఎండ అధికము కావున ఉద్యోగకాలముపోను మిగత కాలమంతయు ఖరీదైన భోజనముతోను పేకాటలతోను, గంటలకొలది క్లబ్బు (Club) లందుండుటతోను, సరిపోవుచుండును. సాధారణముగా పెద్దజీతములవారు మార్గముచూపుదురు. మిగతవారు వారిమార్గమవలంబింతురు. ఇదిగాక ఇంగ్లండునందుండునపుడు రసజ్ఞత (taste) యెంతయో వినీతముగ (Simple) నుండినను అతడు మన దేశమునకు వచ్చినతరువాత అంతయు మారిపోవును. డిన్నరునకుముందు ఒక లోటెడు 'షెరీ' యును తరువాత ఒక గ్లాసు షాంపేనును త్రాగుటకు నేర్చుకొనును. ఇంగ్లండునందుండునపుడు గొట్టములో పొ

గాక కల్తింపులను వేసి త్రాగువాడు ఇండియాలో ఈజిప్టు సిగరెట్లను లెక్కలేక త్రాగును. ఇంగ్లండునందు ఆఫీసుకు ట్రాంబండిలో వెళ్ళువానికి మనదేశమున బ్రూహంబండి కావలసియుండును. ఇంగ్లండులో గ్రామతమాషాలకు ఒక షిల్లింగు చందా వేయువాడు ఇండియాయందు 20 రూపాయలకు తక్కువ వేయుటకు సిగ్గుపడును. ఇదంతయు ఇక్కడిపద్ధతి. దీనిని లక్ష్యపెట్టనివానిని మిక్కిలిధైర్యశాలియె యనవచ్చును. వీరిభార్యలుకూడ ఇట్టివారే. ముఖ్యఅవశ్యకములనుబట్టి చూడగా ఇండియాలో ఇంటిఖర్చు అతిచౌకగానున్నది. కాని డిన్నర్లు విందులు తమాషాలతో ఇంటిఖర్చు మిక్కిలి యెక్కువగుచున్నది. మనదేశమునకు వచ్చు యూరోపియనుల భార్యలలో కొందరు ఈ దేశమునకు వచ్చుటకు ముందు మొదతెగని సాంఘిక విందులకు అలవాటుపడియుందురు కాని చాలమందికీయలవాటు ఉండదు. ఉండకపోయినను ఇండియాకు వచ్చినతరువాత త్వరగా ఇది రెండవ నైజమగుచున్నది. ఇంగ్లండులో నున్నంతకాలము ఇరుగు పొరుగువారి 'టీ' పార్టీలకు వెళ్ళుటకును అప్పుడప్పుడు తన తండ్రిగారి చర్చియందు (Church) కన్ఫరము (Confirm) చేయునప్పుడు జరుగు చిన్న విందులకు పోవుటకును అలవాటుపడియుండు మతబోధకుని కూతురు ఇండియాలోనుండు తనజ్ఞాతిని పెండ్లియాడినపుడు ఆంగ్లోఇండియనుల పద్ధతులలో పుట్టి పెరిగినదానివలె ఇండియాచేరిన కొన్ని వారములలోపలనె డిన్నరు లిచ్చుటకును డిన్నరులకు వెళ్ళుటకును ఆరంభించును. దీనినిబట్టిచూడ యూరోపియనుల జీవనముచౌకగా జరుగుటలేదని తేలుచున్నది కాని ఇంత ఖర్చుచేయు

యూరోపియనుల గ్రాహకత్వము మనదేశీయులు సంపాదించుకొనకుండుట మిక్కిలి విచారకరము. గుండుసూదుల కట్టలు మొదలుకొని పియానోల వరకుగల అన్ని సామానులను మంచివిగాను చౌకగాను సప్లయిచేయగలిగినయెడల ఇంగ్లీషుగృహిణి తప్పక వానినికొనును. ఏమనగా సహజముగా ఇంగ్లీషు స్త్రీ మితవ్యయము చేయునది. ఆమె ఇండియాయందు అనావశ్యకములను కొనునదైనను అట్టి పదార్థములను చౌకగాకొనుటకిష్టపడును. దుబారాఖర్చుచేయు గృహిణికూడ తనవంటివారితోను తినుబండారము లమ్మువారితోను బేరము మెక్కువగా పెట్టుకొనును. ఈ గుణమును కనిపెట్టియే యూరోపియనుల బట్టలవాడు "వెల సులభము ఫలమధికము. కారుచౌక. మిక్కిలి సులభధరలు" అని పలుమారు ప్రకటించుచుండును. ఇదేవిధముగా మనదేశపు మ్యానుఫాక్చరుదారులుకూడ క్రొత్తసరుకులు తయారుచేసి మంచిబేరములు కలుగజేసినయెడల వారికి లాభముతప్పక వచ్చును. ఇండియాలో యూరోపియను లెంత కొనునదియు, యూరోపియను ఎంపోరియము లేచూపుచున్నవి. వీనికి యూరోపియనులు విశేషముగ వెళ్ళుదురు. ఇవి దూరమునునుండు గ్రామములతోకూడ టపాద్వారా వ్యాపారము చేయును. ఇండియను మ్యానుఫాక్చరుదారులు విదేశమునుండి దిగుమతియగు పదార్థములను ఎరుంగియేయున్నారు. కాన కాలక్రమమున ఈదిగుమతులు సన్నగిల్లి స్వదేశవస్తువుల సప్లయి యెక్కువయగునట్లు చేతురనితలంతము.

వెనుకటిప్రకరణమున ఇండియాలో తయారైన వస్తువులందు స్వాభిమానులకెట్టి వైరము లేదని చెప్పితిమి. ఇదియొక శుభ

సూచకము. 1903-1904వ సంవత్సరములో చెన్నపట్టణమున ప్రదర్శింపబడిన విస్కి (whisky) ఇంగ్లండునందు వాడుకలోకి వచ్చుటకు చాలకాలముపట్టును. ఈ సారాయములు మొదలగు పానీయములమాట అటుండగా ఉద్యమముగల మన మాన్యుఫాక్చరుదారులు విదేశమునుండి మనదేశమునకు సరుకులను, దిగుమతిచేయుటకుబదులు, మనదేశమున తయారైన సరుకులను విదేశములకు పంపి అందమ్మకము చేయింపవచ్చును.

వచ్చుచు పోవుచుండు ఆంగ్లోఇండియనులకు తోడుగ ఈదేశమున స్థాయముగనిలిచియుండు ఆంగ్లఇండియనులును యురేషియనులును చాలమందియున్నారు. వీరందరు యూరోపియనసరుకులనే కొనువారుకనుక మొత్తముమీద కొనువారిసంఖ్య యెక్కువగనేయుండును. వీరికోరతలు తీర్చుటవలన మన దేశమునకు లాభము తప్పకవచ్చును.

(3) ఢిల్లీ గవర్నమెంటునకును పరగణాల గవర్నమెంటునకును, లోకల్ బోర్డు, మునిసిపాలిటీలకును, రైల్వేలు, గనులు మొదలగువానికిని కావలసినసరుకులు అత్యధికముగ నుండునని వేరుగా చెప్పపనిలేదు. పూర్వపు స్టేటుసెక్రిటరీల కాలమున వారంత దయార్ద్రహృదయులు కాకుండుటచేతనొ మరి యేరాజకీయకారణములచేతనో మనము చెప్పజాలము కాని ఇండియాలోని గవర్నమెంటు ఆఫీసులకు సరుకులు సప్లయిచేయునపుడు స్వదేశపుసరుకులను తృణీకరించి కావలశినవాని నన్నిటిని ఇంగ్లండునందే కొని సుంపుచుండిరి. అదృష్టవశమున ఇదంతయు మారిపోయినది. తాళములు, ఇనుపపెట్టెలు, కాకితము లు మొదలగుసరుకులు మనదేశమునుండియే సప్లయియగుచు

న్నవి. దండుకు కావలశిన గుఱ్ఱపుజీనులు, బూట్లు, బట్టలు, స బ్బు మొదలగువానినికూడ స్వదేశపు మ్యానుఫాక్చరుదారుల కే కాకపోయినను మనదేశములోనివారికే కంట్రాక్టుయిచ్చుచున్నారు. మన దేశమునందలి రైలువే కర్మాగారములు (Railway workshops) గొప్ప టెక్నికల్ విద్యాలయములు (technical institutions) గానున్నవి. వీనియందనేకులు మన దేశీయులు పనిచేయుచు యంత్రజ్ఞానమును (Knowledge of mechanical engineering) దేశమునందంతటను అల్లుకొనజేయుచున్నారు. ఇండియాయందెపుడు ఇనుము తయారగునో అప్పుడు ఇండియాకు యెన్‌జనుల నుత్పత్తిచేయుదశ పట్టును. ఆస్పత్రులవిషయమున 1903, 1904 వ సంవత్సరమున మంచిశస్త్రచికిత్సోపకరణములు కలకత్తాలోని కంపెనీయొకటి ప్రదర్శించినది. కాబట్టి ఇండియాలో మంచిసరుకులు తయారయిన యెడల వానినికొనుటకు పబ్లిక్ ఆఫీసులు కావలశినన్ని యున్నవి.

విదేశములకు వెళ్ళు హైందవ యెగుమతులవిషయమున స్థితులు బాగుగనన్నవనుట యెంతయు తృప్తికరము. ఆఫ్రికాయందు ఈ యెగుమతులు బాగుగనున్నవి. స్టేట్సుమాన్‌సు యియర్ బుక్కు (Statesman's year book) జాంజిబారునుగురించి వ్రాయునపుడు ఇట్లువ్రాయుచున్నది. "జాంజిబారు ద్వీపమునందు 7000 హైందవులున్నారు. జాంజిబారుయొక్కయు తూర్పు ఆఫ్రికాయొక్కయు వర్తకమంతయు ఖుద్దుగాగాని లేక వేరుమార్గమునగాని వీరిచేతులమీదుగా నడుచుచున్నది. మొంబాసాను గురించి వ్రాయునపుడు ఈ పుస్తకమిట్లు చెప్పుచున్నది. ఇప్పటికి వర్తకమంతయు తూర్పుఇండియా వర్తకుల చేతులోనున్నది.

మాన్‌చస్టరు సరుకులు, బొంబాయిబట్టలు, ఇత్తడితీగెలు, పూసలు, సంబారములు ముఖ్యమైన దిగుమతులు" మాన్‌చస్టరు సరుకులు తప్ప మిగిలినవన్నియు మనదేశమునుండి పోవుచున్నవి. చెన్నపట్టణపు ప్రదర్శనా (1903-4) ప్రథమదివసమునందు తూర్పు ఆఫ్రికానుండి 5000 రూపాయిల విలువగల తివాసులు (జంబుఖానాలు) పంపవలయునని కలకత్తాలోని ఇండియనుస్టోర్లకు జట్టీ (order) వచ్చినది. ఇకముందు మనవారికి బలమైనపోటి వచ్చినను రావచ్చును. అయినను ఆఫ్రికాఖండము వ్యాపారమునకు తెరువబడినదిగనుక వర్తకమధికముగా నభివృద్ధియగును. అందుచేత యెంతమంది వర్తకులకైనను ఆస్పదముండును. మనదేశపువర్తకులు ఈ దేశమున మొదటినుండి వ్యాపారముచేయువారగుటచేతను, మనకు కృషి (labour) చౌకయగుటచేతను, మన పడమటితీరమునుండి ఆఫ్రికాయొక్క తూర్పుతీరము. నకు నేరుగా సరుకులెగుమతిచేయు వీలు మనకు ఉండుట చేతను, మనదేశపు వర్తకులవ్యాపారము యెప్పటివలెనే యుండును. దక్షిణఆఫ్రికా స్ట్రైటుసెటిల్‌మెంటు మొరిషన్ తూర్పుఇండియాదీవులు మొదలగువానియందు మనదేశపువర్తకులనేకులున్నారు. మనదేశమునందు మానుఫాక్చర్లు అభివృద్ధియయినయెడల మరియేకారణము లేకపోయినను చౌకగ తయారైనవన్నకారణముచేత మనదేశమునందేకాక ప్రపంచమునందంతయు మనసరుకులకు అమ్మకము దొరికితీరవలయును. కావున మనదేశపు సరుకులకొరకు గ్రాహకులు మనదేశమునందేకాక ఇతరదేశములందుకూడ కాచుకొని యున్నారనియు, ఇపుడు చే

యవలశినదంతయు పరిశ్రామికాభివృద్ధియనియు చెప్పి ఈ ప్ర కరణమునింతటితో ముగింతము.

## పదియవ ప్రకరణము.

## మూలతిరుగుట (Turning the corner.)

మన పరిశ్రామికుడు స్థాపనచేయ నిశ్చయించుకొన్న పరి శ్రమకు కావలశిన మూలధనము లెక్కపెట్టునపుడు ఆపరిశ్రి మమొదట చెందునష్టములకును, అది 'మూలలు తిరిగి' లాభ మునియ్య మొదలుపెట్టువరకును అగు ఖర్చులకును, తగినంత మూలధనము నుంచుకొనవలయును. అట్లుండనియెడల, అనగా మొదటి నెలలందును ఒకొకసమయమున సంవత్సరములవరకు ను వచ్చుచుండు నష్టమునకు సంసిద్ధులు కాకయుండుటచేత, బాగుపడవలసిన పరిశ్రమలెన్నియో చెడిపోయినవి. మనము కావలశిన యంత్రములు ఉపకరణములు కొని పనియారంభిం చినది తడవుగా లాభమునకు వేచియుందుము. ఈ లాభము రాకపోయినపుడును, పెట్టిన మూలధనము అయిపోవుటచేత ను ఆపరిశ్రమను విడనాడవలశివచ్చును. ఒకవేళ మూలధనమె టులనో సంపాదింపగలిగినను నష్టమువచ్చినదను భయముచేత నిరుత్సాహులమై ఆ పరిశ్రమను మనంతట మనమే ఆపివేయు దుము. ఇది గొప్ప పొరబాటు. ఏమనిన క్రొత్తవస్తువుకనబడిన తోడనే దానిని కొనువారుండరు. పరిశ్రామికుడు తన పరిశ్ర మనుగూర్చి అహర్నిశాదులు యోచించుచుండినను దానిపేరు ప్రజలకు తెలియుటకెన్నియో దినములు పట్టును. దానియం దు వారికి ఆదరము పుట్టుటకు మరింతకాలముపట్టును. అక్క డ నొకడు ఇక్కడ నొకడు అకొ్రొత్తపదార్థమును కొనిచూచి

అది బాగుగ నుండుటచేత ఒక కొరతను తీర్చినదని నమ్మినప్పుడుగదా వారు తమ స్నేహితులకు సిఫారసుచేతురు. అప్పుడా పదార్థమునకు గిరాకీ యెక్కువయి కొంతకాలమున కా పరిశ్రమ నిలిచి లాభము నియ్య మొదలుపెట్టును. కాబట్టి లాభము వచ్చుటకుముందు తాలిమియు పట్టుదలయు యెక్కువ కావలసియుండును. తన యుద్యమము నిశ్చయముగా మంచిదని నమ్మిన ప్రతిపరిశ్రామికునకును ఈ సుగుణములు తప్పక మంచి లాభమునిచ్చును. కాబట్టి పరిశ్రామికులీ క్రిందివాక్యమును మంచి ఉపదేశముగా నెంచవలయును. “ఒక ఉద్యమము మంచిదని నమ్మకముగా తేలుపరికును దానిని ప్రారంభింపకుము, ప్రారంభించినతరువాత మంచిదికాదని స్థిరపడువరకును దానిని వదలకుము.”

పూర్వకాలమునందు జయప్రదముగా జరిపిన పరిశ్రామికులలో సద్దరిచరిత్రలు ఇప్పటివారలకు పట్టుదలయు ఉద్యమాశక్తియు కలుగునట్లు చేయవచ్చును. కావున యీరెంటిని ఇందు పొందుపరచెదము.

(1) ఇండియను బ్యారోనెట్టు (Indian Baronet) అగు సర్ జేమ్సు సెడ్జిజీజీభాయిగారిని గురించిన కథ మొదట చెప్పెదము. ఇతడుద్యమాశక్తులగు పార్శీలలో చేరినవాడు. ఇతడుస్వయం సహాయమున పైకివచ్చినవాడు కాన ఈతని జయమత్యద్భుతము.

ఇతడు బొంబాయిలో 1783 సంవత్సరమునందు బీదదైన ను మంచికుటుంబమునందు పుట్టెను. తలిదండ్రులు శైశవమునందే గతించుటచేత ఇతడుబీదరికమువలని బాధలననుభవించు

చుండెను. ఇతడింకను చిన్నపిల్లవాడుగా నుండినప్పుడే తన పొట్టపోసికొనుటకొరక వర్తకుని ఆఫీసునందు పనిచేయవలసి వచ్చెను. కానచదువుఎక్కుడగా అబ్బినదికాదు. కాని ఉత్తరములకు నకళ్ళు వ్రాయుటకును, సరుకుల జాబితాలు వ్రాయుటకును, స్థిరముగా నిలుచు స్వభావముగలవాడు కాడు. కాబట్టి 16 సంవత్సరముల వయస్సుననే స్వతంత్రజీవనముచేయ నిశ్చయించెను. ఉద్యమాసక్తుడగుటచేత ఇతడు సంచారవర్తకుడాయెను (Travelling merchant). స్నేహితుల సహాయ్యమువల్ల పోగుచేశిన ఆ కొంచెము ధనముతో పిన్నవయస్సునందే ఇతడు తాను పుట్టిన యూరిని వదలిపెట్టి కలకత్తాకు వెళ్లెను. అక్కడినుండి చిన్నచిన్న పనులమీద చైనాకువెళ్ళ మొదలుపెట్టెను. ఆకాలమునాటికిదియే మిక్కిలి సాహసకార్యము. ఏమనగా చైనాదేశము నెరిగిన వారంతగాలేరు. ఈనావయాత్రవలన కలుగు అపాయనష్టముల కన్నిటికిని సంచారవర్తకుడె స్వయముగా పూచీదారుడు కావలశియుండెను. కాన ఇతని సాహసమునకు తగిన బహుమానమువచ్చెను. ఇతని యుద్యమము వృద్ధియయి కొద్దికాలములో ఇతడు ఇండియాకును చైనాకును నడుమ తిరుగుచు తన సరుకులను అమ్ముచుండెను.

ఇట్లుండ 1804వ సంవత్సరమున జెమ్సెట్జి తన సరుకులతో నావయాత్రచేయుచుండగా, అపుడింగ్లీషువారికి విరోధులుగనుండిన ఫ్రెంచివారు ఆయోడను పట్టుకొనిరి. ఉన్నదంతను దోచుకొని గుడుహోపు అగ్రమువద్ద దింపివేశిరి. ఈభాగము డచ్చివారికి సంబంధించియుండుటచేత అచటి ధర్మస్వభా

లగు కొందరు డచ్చి స్త్రీలు చందా వేసికొని ఇతనిని ఇండి యాకు చేరపంపిరి. ఈవిపత్తువలన ఉన్నదంతను పోగొట్టు కొని 22వ సంవత్సరమునందు మరల జీవనమారంభింపవలసిన వాడాయెను.

ఈ దురదృష్టమునకించుకైనను జంకక ఈ పార్సీ పిల్ల వాడు చైనాకు రాకపోకలు మరల ప్రారంభించి పూర్వానుభవ సహాయమున జయప్రదముగా వ్యాపారము జరిపి మరల కొద్దికాలములోనే బొంబాయిలోని పార్సీ ధనవంతులలో నొకడాయెను. ఇంత భాగ్యవంతుడైనను తన బీదరికపు దినముల నితడు మరిచినవాడు కాడు. తన జన్మపురమగు బొంబాయి కెన్నియో గుప్తదానములు చేసి తన ధారాళముచేత (Public munificience) పురమును వన్నెకు తెచ్చెను. ఇతడు ప్రజలకు మార్గదర్శియయి ప్రజాక్షేమమునే కోరువాడగుట చేత 1842వ సంవత్సరమున నైట్‌హుడ్ (Knighthood) బిరుదు పొంది, 1858వ సంవత్సరమున బ్యారొనట్ ఆయెను. ఇతడు 1877వ సంవత్సరమున 94వ యేట కాలధర్మమునొంది తనకును తన దేశముకొరకును శ్రమపడినవాడను యశస్సును తన వెనుక నిలిపిపోయెను.

రెండవ ఉద్యమాసక్తుడు పార్సీ బ్యారొనట్ (Baronet) అగు సర్ దిన్‌షా మానక్‌జీ పెటిట్. పెటిట్ వంశమున కితడు మూలపురుషుడయి కడచిన శతాబ్దాంతమందు మిక్కిలి ప్రశస్తి చెందినవాడు.

పెటిట్ అను వంశనామము వింతగావచ్చినది. నూరు సంవత్సరములక్రిందట ఫ్రెంచివారికిప్పటికంటెను మన దేశమున

యెక్కువ ప్రాబల్యముండినది. డూప్లే (Dupleix) మహోన్న
తదశయందుండినదియు ఫ్రెంచివారు నావ యుద్ధముచేసి మద
రాసును పట్టుకొనినదియు అప్పుడే జరిగినసంగతులు. హైద
రాలి మొదలగు స్వదేశ ప్రభువులవద్ద ఫ్రెంచివారు చాలమం
ది నౌకరీలోనుండిరి. 1810వ సంవత్సరమున బోర్బోన్ మొరి
షస్ ద్వీపులు పట్టుపడువరకును, వాని చాటుననుండి బ్రిటీషు ప్ర
భుత్వమును బెదరించుచు, 50 సంవత్సరముల కాలము ఇండి
యాతోటి వర్తకమును స్వాధీనమునను ంచుకొనియుండిరి. 1813వ
సంవత్సరమున తూర్పు ఇండియాకంపెని. ఇండియాయందు
శాశ్వతముగా వర్తకము చేయు హక్కును పోగొట్టుకొనినప్పు
డు ఫ్రెంచి వర్తకులు మన దేశమున యెక్కువయిరి. ఇందు
చేత వ్యాపారమంతయు ఫ్రెంచివారితో జరుగుచుండినది. ఆ
కాలమున (మానక్ జీసస్సర్ వాన్ జీకవాన జీబామన్ జి) అను
పార్సీ వర్తకుడు వ్యాపారముచేయుచుండెను. ఇతడు మిగుల
పొట్టివాడు. ఈతని పెద్దపేరును ఫ్రెంచివారంత ఓపికతో
పలుకజాలక ఇంత పొట్టివానికింత పెద్ద పేరా యని హాస్య
మునకై యతని లేపెటిట్ అని పిలువసాగిరి. 'లేపెటిట్'
అనగా పొట్టివాడని యర్థము. పార్సీవారు బహు త్వరగా
పేర్లను ఐక్యముచేసికొనువారు కాన 'పెటిట్' అనునది వం
శపు పేరయ్యెను. బొంబాయియందు ఇట్టి పేర్లనేకములున్న
వి. ఇందు రిపోర్టర్ గారు, బాటెల్ వాలా గారు, రైటర్ గారు
మొదలగునవన్నియు పూర్వీకుల వృత్తినిబట్టివచ్చిన వంశనా
మములు. ఈ పొట్టి పార్సీ వర్తకుడుకూడ తన దేహవర్ణ నా

దమును (Personal description) ఇదే విధముగా నంగీకరించు
చేత పెటిట్ అను పదము అతని వంశనామమాయెను.

ఈ 'లే పెటిట్' గారి కుమారుడే మన సర్ డిన్ షా మాన
క్జీ పెటిట్ గారు. ఇతడు 1823వ సంవత్సరమునందు బొంబా
యినగరమునందు జన్మించెను. తనతండ్రి వలె ఇతడును వర్తకు
డాయెను. ఇతడు ఒక నిమిషమైనను ఊరకుండువాడు కాడు.
వీనికితోడు సమయసందర్భములను గుర్తెరిగి నడుచు ప్రజ్ఞకలవా
డు. 1861వ సంవత్సరపు అమెరికన్ సివిల్ వార్ (American Civil
War అమెరికనుల అంతఃకలహము) వల్ల నేర్పడిన ప్రత్తికరువువ
లన కొన్ని సంవత్సరములవరకు లాంకషైరులోని మిల్లులయజ
మానులు దివాలాతీయుస్థితిలో నుండుటచూచి ఇదియే సమయ
మని ఆ సంవత్సరమునందే, ప్రత్తిమిల్లులకొరకు బొంబాయియం
దు కొంతస్థలమును కొనెను. మరుసటి సంవత్సరమున మానక్
జీ పెటిట్ కంపెనీ, అనుపేర నొక కంపెనీని స్థాపించి సాధ్య
మైనంతత్వరలో దానిచేత పనిచేయించ మొదలుపెట్టెను. మొ
దట ఇతని వ్యాపారము అంతయుత్సాహకరముగా నుండలేదు.
బొంబాయిలో బట్టలునేయుట సులభముగానుండెనుగాని యె
క్కువగ ఉత్పత్తి యగుచుండిన బట్టలకు అమ్మకము దొరుకుట
కష్టముగనుండుటచేత చిల్లరగానులేక బేళ్ళు (Bales)గాను తా
ములుగాను, వచ్చినంతమాత్రమే చాలునని వేలము వేయుచు
యేదోయొకవిధమున సరుకును తొలగించుచుండిరి. ఇట్టి కష్ట
ములకు కొంచెమైననుజంకక పనిని జరుపుచుండుటచేత అది ది
న దిన ప్రవర్ధమానమగుచుండెను. ఆకాలమున ప్రపంచములో
నెల్ల పెద్దదగు మిల్లును 1881 సంవత్సరమున కట్టుటచేత

(మానక్‌జి పెటిట్ మ్యానుఫాక్చరింగు కంపెని' మిక్కిలి ఎక్కువగా మ్యానుఫాక్చరు చేయు స్థానమాయెను. ఈ కాలమునందతడు కేవలము ధనమునే ఆర్జించక విద్యావిషయములందును దాన ధర్మవిషయములందును శ్రద్ధపుచ్చుకొని ధనమధికముగ సద్వినియోగము చేయుచుండెను. జీవితకాలమందంతయు ఇతడు గౌరవనీయుడుగా నుండినను అతని కడపటిదినములందు బిరుదు లనేకములువచ్చినవి. 1887 సంవత్సరమున 64 సంవత్సరముల వయస్సునందు బొంబాయికి షెరిఫ్, ఆయెను. అదే సంవత్సరమునం దితనికి నైటులను బిరుదు వచ్చెను. మరుసటిసంవత్సరము వైస్‌రాయిగారిసభలో నొక సభ్యుడాయెను. ఇట్లుండ 50 సంవత్సరములుగా తన కర్ధాంగియైన సాకర్‌బాయిగారు మృతినొందిన 1890 వ సంవత్సరము నందే వీరు 'బారోనట్టు (Baronet) పదవినందిరి. ఈ పదవికి చిహ్నములగు దుస్తులను వీరికిచ్చినపుడు వారుశ్లేషగా నిటు చెప్పిరి. పెటిట్ అనుపదము ఫ్రెంచిభాషయందు 'పొట్టి' యని అర్థమిచ్చుటయేగాక లాటిన్‌భాషయందు 'అతడు వెదకుచున్నాడని అర్థమిచ్చుచున్నది. కాబట్టి 'దేనిని వెదకునో దానిని ఇతడు సంపాదించును.' అను అర్థమునిచ్చు లాటిన్‌భాషలోని వాక్యము నొకదానిని వీరివంశ నీతివాక్యము (Family motto) గా నిచ్చిరి. పేటిట్‌గారివిషయమున 'వెదకుట' అనగా అడుగుట యని యర్థముకాదు. ఉద్యమాశక్తిగల సాహసమనియే (indomitable spirit) అర్థము.

జీజీభాయి పెటిట్లు లక్షలకొలది లాభముసంపాదించి మహాప్రసిద్ధికాంచినవారు, చిన్నపరిశ్రామికులకిట్టివి సాధ్యము కా

ర్చు. వీటిని తలపనైనను తలపజాలరు. కాని వీరు కోట్లకొలది సంపాదించినపుడు చిన్నవారు లక్షలకొలది వేలకొలది సంపాదించగలరు. చిన్నచిన్న పరిశ్రమలను జయప్రదముగా పనిజరుపుచుండువారి నెందరినో చెప్పవచ్చునుకాని అట్లుచేయుట ప్రకటనాచమత్కారములలోకి దిగును. (Tricks of advertisement). ఉదాహరణకొరకు జీవించుచుండు ఒక ముసలివాని కథను చెప్పవచ్చును. ఇతడు ఎడ్లబండి తోలువాని కొమరుడు. ఇతడు కూలిపనితో ప్రారంభించెను. ఈ కూలిదశయందితడు అడవిలో కట్టెలు కొట్టి భుజముమీద మోపుపెట్టుకొని పట్టణములకు అమ్ముటకు తెచ్చుచుండెను. పిమ్మటకట్టెలు కొట్టు చిన్నకంట్రాక్టుపనులు ఆరంభించెను. తరువాతకొంత అడవిప్రదేశమును సంపాదించి రంపగాండ్లను కూలీలను యేర్పాటుచేసి పని జరుపుటచేత ఒకఇల్లును భూములను కొన్నివేలరూపాయిల రొక్కమును సంపాదించి తన ముసలితనమున సుఖముగా జీవించుచున్నాడు. ఇట్టివారింకను అనేకులున్నారు. మదరాసు ప్రదర్శనపు ప్రదర్శకులతోను వారి ఏజంట్లతోను మాటలాడుచు పచారుచేశిన ప్రతివారికిని వడ్రంగులు, తాళపుకమ్మరులు, తోలుపనివారు, సబ్బుచేయువారు మొదలుగాగల చిన్న పరిశ్రామికులకథ లెన్నియో తెలియును. వీరందరు వారి వారి పరిశ్రమలందు శ్రమపడి లాభమును సంపాదించుచుండువారే.

పరిశ్రామిక ప్రపంచమునందు ఎంత యెడమయినను ఉన్నది. కాని ప్రతి పరిశ్రామికుడును, తన పరిశ్రమ మూలలుతిరిగి జయపురాజబాటను చేరువరకును సాధారణముగా నెన్నియో శ్రమలు పడవలశియుండుననియు పరిశ్రామికలాభములు ఒక ని

విషయములో రావలియు బాగుగ నెరుగవలయును. ఇట్టివాడు పనిచేయుటకే మొదలుపెట్టిన యెడల ధైర్యముతో పనిచేసి మొదటికష్టములు కడచువరకును తగినంత మూలధనమునుం చుకొనవలయును.

పదునొకండవ ప్రకరణము.

## ముగింపు (Conclusion.)

ఇంతవరకును చెప్పుచుండిన మాటల నింతటితో విరమించి పరిశ్రామికారంభులకు కొన్ని సలహాల నిత్తము.

తయారైనపదార్థము మంచిదిగానుండుటయే గాక ప్రజల కు దానిని చూపించునపుడు కంటికింపుగానుండునట్లు చేయుట మొట్టమొదట గమనించవలశిన యంశము. ఇట్లు చేయనియెడ ల కొనువారికి నమ్మకము కలుగదు. పదార్థము యెంతనాణ్యమై నదైనను పరిసరములు బాగుండనియెడల దాని నాణ్యము అం తగా రాణింపదు. పాతమశిగుడ్డయందు కట్టినను బంగారునందు పొదిగినను వజ్రము వజ్రముగానేయుండును కాని సామాన్యజ నులు బంగారునందు పొదగబడినపుడే దానిని అభిలషింతురు. ఇదేవిధముగా మన గ్రామవాశియొక్క సార్డిను చేపలు (చూ. పుట 184) అచ్చువేసినమూత గలిగి ఒకే విధముగానుండు డ బ్బీలలో నింపినయెడల, వానియందు ప్రజలకెక్కువనమ్మకము కలుగును కాని చిత్తమువచ్చినట్లు ఒకమారు పాతజున్ను డబ్బీ లయందును ఒకనారి వెన్నడబ్బీలయందును వేసినయెడల నమ్మ కమింతైననుకలుగదు. ఇట్లు చెప్పుటకు కారణమున్నది. 1903 1904 వ సంవత్సరపు చెన్నపురి ప్రదర్శనమున మచ్చుకు గాను తేబడిన అరటిపిండి సీసాలమీద అమెరికాదేశమున చే

నుబడినయందు గుళిగెలని పేరుండినది. అందుచేత చూపరులకంత శ్రద్ధలేక పోయినది. అటుగాక అరటిపిండియని పోత వేయబడిన బుడ్లువాడినయెడల యెంతబాగుగనుండును. ఇట్టిగాజుబుడ్లధర యెక్కువకదా? అవును ఇండియాయందు గాజుసామాను మ్యానుఫాక్చరగువరకు గాజుబుడ్లధర యెక్కువగనుండుట నిస్సందేహము కాన గాజుపరిశ్రమ యెంతత్వరగా అభివృద్ధియయినయెడల భారతీయపరిశ్రమలకు అంత మేలు కలుగును. కాని అంతవరకు మరొకపేరుంచు బుడ్లలో వేయక సాదాబుడ్లనుకొని వానిపైన అచ్చువేరుగల చీటీల నంటించి తగరపు రేకుమూతలు వేయుటమంచిది. దీనికి ఖర్చు అంత యెక్కువ కాదు. సరుకులను కొనువారికివి ఇంపుగా కనబడును. హైందవ ఫరములందుకొన్ని ఈ యంశమునిప్పటికె గ్రహించియున్నవని చెప్పుట కెంతయు సంతసమగుచున్నది. ఇందుకుదాహరణముగా చెన్నపట్టణపు ప్రదర్శనమునకువచ్చిన సొగసైన పరిమిళపు బుడ్లను సబ్బుబిళ్ళల పెట్టెలను చెప్పవచ్చును. నివారణాశక్తి యెట్లుండినను ఆయుర్వేదౌషధములు చూపరుల కంటికింపుగా నుండినవి.

రెండవది ప్రకటనావిషయము. ఇది ప్రకటనల కాలముగనుక ఇవిలేనిదే యేదియు జయప్రదముగా జరుగదు. ప్రకటనలు వేయుటకు కర్చుయెక్కువగుట నిశ్చయమెగాని తగినజాగ్రతతో ప్రకటనలు వేయించినయెడల మంచిలాభమువచ్చును. దీనిసాహాయ్యము లేకనే జయముగాంచిన పరిశ్రామికుల పేరుగాని వర్తకుల పేరుగాని చెప్పుట దుస్తరము. ప్రకటనలకొరకు చూచి చూచి కర్చుపెట్టుట కష్టముగా కనబడును. కాని దానివ

లని లాభము అధికమయిననను కంటికగుపడదు. మన దేశీయులు ప్రకటనలయందు అంతగా వ్యయముచేయువారుకారు. ఈ సంగతి ఏపత్రికాధిపతి నైనను అడుగవచ్చును. ఆంగ్లహైందవ వార్తాపత్రికలందు ఒకరిద్దరు సామ్ములవర్తకుల ప్రకటనలుతప్ప ఇతర హైందవ ప్రకటనలేవియుండుటలేదు. హైందవవార్తాపత్రికలందు పైసామ్ములవర్తకుల ప్రకటనలుతప్ప మిగిలినవన్నియు రహస్యౌషధ ప్రకటనలై యుండును. ఈ ప్రకటనావిముఖత మనయందుండుట విచారకరము. ఎందుకనిన తా నీపని చేసినానని పరిశ్రామికుడు వెల్లడిచేసిననేగాని పరిశ్రమస్థాపించుటవల్ల లాభములేదు. కాబట్టి ప్రకటనలు అత్యావశ్యకములు ప్రకటనలు వేయుటయందు పొగడివ్రాయుటమంచిది. న్యాయమైనది. వానిని ఇంపుగావేయించుట ఉత్తమము. చాతుర్యమనుపేరున హేయమగుభాషలో ప్రకటించుట తప్పు. ఇందువలన మర్యాదస్థులగు గ్రాహకులు దూరులగుదురు. కావున ప్రకటనలు వేయుటయందు నేర్పు కొంచెముండవలయును. కాన నే ప్రకటనలు వేయుటయందు సమర్థతగలవారికి మంచిజీతముల నేర్పరచి ఖాయముగా కంపెనీలయందుంచుకొందురు. క్రొత్త క్రొత్త ప్రకటనలు నిరంతరము తయారుచేయుచు కడవరకు చదివినపుడు ప్రకటనలోకిదిగు చిత్ర చిత్రకథలను కల్పించుచుండుటయే వీరిపని.

(3) పరిశ్రమ జయప్రదమగుటకు ముఖ్యావశ్యకము. పరిశ్రామికునకుండవలసిన ఉత్సాహాయుతమగు నమ్మకము. ఒకపరిశ్రమ బహుశా జయప్రదముగా జరుగవచ్చును అని అనుకొని ఒక ప్రయత్నముచేసి చూతమనువాడు యెప్పటికిని జయ

ముచెందువాడుకాడు. జయప్రదముగా పరిశ్రమను నడుపువానికి తన పరిశ్రమ కొనసాగునను గట్టినమ్మక ముండవలయును. లేనియెడల చేయవలశిన ప్రయత్నములు జరుగకముందే వాడు పరిశ్రమను ఆపివేయును. పరిశ్రామికునకు నిజమైనయుత్సాహములేక అయితే అయినది పోతే పోయినది అని పని చేయువాడు ఆపరిశ్రమ నెన్నటికిని తుదముట్టింపజాలడు. పరిశ్రామికుడు రాత్రింబగళ్ళు తన పరిశ్రమనే తలచుచుండవలయును. అట్టివారికొక సమయమున మారుపేరులు వచ్చుటయుకూడ కలదు. ఇందు కుదాహరణముగా చాటర్టనుగారి ఉత్సాహమువల్ల నేర్పడిన మనదేశపు అల్యూమిన పరిశ్రమాకథను చెప్పెదము. 1890 వ సంవత్సరమున పెరియారు చెరువు కట్టకట్టుచున్నపుడు, అల్యూమినపు పరిశ్రమమునకు మనదేశము నందెడమున్నదని తలచి, ఆ చెరువులోని నీటిలో కొంతభాగము వరిపొలములకు పారుటకు ముందు, కోరండము (Mineral ఖనిజ విశేషము)నుండిఅల్యూమినమను లోహమును తయారుచేయు యంత్రములను త్రిప్పుట కుపయోగించుట మంచిదని దొరతనమువారికి చాటర్టనుగారు సలహానిచ్చిరి. కాని ఇతర ఇంజనీర్లు వారిసలహాతో నేకీభవించనట్లు దొరతనమువారికి తెలిపిరి. ఇంతటితో చాటర్టనుగారికి అల్యూమినపు పరిశ్రమయందు నమ్మకముపోయినదికాదు. 1896 సంవత్సరమునందు మధుర టెక్నికల్ ఇన్స్టిట్యూటునందు విద్దేశపుంగాహమునుండి పాత్రసామాగ్రి చేయించి చూతమని విద్యాశాఖాధికారికి (Director of Public Instruction) మనవిచేసిరి. కాని వారేమియు చేయరైరి. ఇంతటితో చాటర్టనుగారు నిరుత్సాహులు కాక వారుశలవుపై

ద ఇగ్లండునకు వెళ్ళినపుడు అల్యూమినమును సరఫరాచేయు కంపెనీయొక్క కార్యదర్శిని దర్శించగా వారు ఒకటన్ను లోహము నిచ్చి ఇండియాయందు ప్రయోగము చేసిచూడమనిరి. ఇతడు ఇండియాకు వచ్చినతరువాత తానధ్యక్షుడుగానుండు మదరాసు కళావిద్యాలయమునందు (School of arts) ప్రయోగములు చేసి చూడ ననుజ్ఞ యిమ్మని డైరెక్టరుగారిని ప్రార్థించిరి. లాభనష్టములు దొరతనము వారికి పూచీలేని షరతుమీద డైరెక్టరుగారొప్పుకొనిరి. ధననష్టమునకైనను జంకక చాటర్టనుగారు ఈ యుద్యమమును పూని జయప్రదముగా కార్యము నెరవేర్చుట చూచి 1898 వ సంవత్సరమున తమ ఖర్చుకింద నే ఈ పరిశ్రమయందు వ్యాపారముచేయుమని దొరతనమువారు అనుమతి నిచ్చిరి. ఇంతవరకును చాటర్టనుగారికీ పరిశ్రమయందున్న గట్టినమ్మకము పనిచేసినది. అల్యూమినపు సామానులు చేయగలిగిరికాని వానిని కొనువారు లేకుండిరి. దీనివలన లాభము వచ్చుటకు ఉత్సాహ మానశ్యకమాయెను. ఆకాలమున మనదేశమునందు అల్యూమినపుపాత్రలు వాడుకలోనుండలేదు. వాని గుణాగుణము లెవ్వరికిని తెలియకుండెను. పైగా క్రొత్తలోహమగుటచేత జనులు దానిని వాడుటకు వెరచుచుండిరి. ఇట్టిస్థితియందు పరిశ్రామిక దీక్షగలవారగు చాటర్టనుగారు కరపత్రముల నచ్చువేయించుచు, ప్రసంగముల చేయుచు, అల్యూమినపుపాత్రలను ప్రదర్శించుచు 'అల్యూమినపు దేవత యోయన (Apostle of aluminium) దేశమునంతయు తిరుగుచు వచ్చిరి. దీనివల్ల పరిశ్రమ వృద్ధియయ్యెను. లాభము బాగుగవచ్చెను. పరిశ్రమ స్థిరపడినతోడనే ఇండియను అ

ట్యానినముకంపెనీకి పరిశ్రమ నప్పగించిరి. ఇప్పుడది యొక క్రొత్త పరిశ్రమ మైనది.

చాటర్టనుగారింతటితో తృప్తినొందక మరియొక పరిశ్రమ యందు శ్రద్ధవహించిరి. ఇదియె క్రోము ట్యానింగు పరిశ్రమ. క్రోముపదనుచేయు పరిశ్రమయని యర్థము. (తోళ్ళకుసాధారణముగా తొగరుచెక్క తంగేడుచెక్క మొదలగువాటితో పదునుచేయుదురు. అటుచేయుటకుబదులు రసాయనపదార్థములచే పదునుచేయుటకు క్రోముట్యానింగని అందురు. దీనిని క్రోముపదును పరిశ్రమ యందుము.) దీనివల్ల తోలు అంతగా రద్దుపోదు. చర్మము మృదువుగనుండును. నీటనానినను యెండినప్పుడు చర్మమునకు బిరుసెక్కదు. పైగా యెక్కువకాలము మన్నును. ఈ పరిశ్రమవిషయము అధికప్రయాస పడి దానిని జయప్రదముగానడిపినవారు చాటర్టన్‌దొరగారే.

ఇట్లుండగా 1911 వ సంవత్సరమున ప్రొవిన్షియల్ గవర్నమెంటువారు, దొరతనమువారి సొమ్ము ఖర్చుపెట్టి క్రొత్త పరిశ్రమల కల్పించుటగాని ఉన్నవానిని అభివృద్ధిచేయుటగాని తగదని ఉత్తరువువచ్చెను. ఈ ఉత్తరువును రద్దుపరుపుమని ప్రజలు పెద్ద మహాజరు పంపుకున్నారు. ఇది రద్దుపడనియెడల హైందవపరిశ్రామికత్వమున కొక గొప్పసాహాయ్యము పోయినదగును. కాని ఒకవిధముగా ఈయుత్తరువు మంచిదనియే చెప్పవచ్చును. దేశక్షేమమునకు కేవలము దొరతనమువారే పూచీదారులు కారనియు; జనులుకూడ కొంత శ్రమావ్యయములకు పమకట్టవలయుననియు, నమ్మకముగ తెలుపుడుచేయుచు, దేశ

ముయొక్క క్షేమమునకు ప్రజలప్రియత్నములే ముఖ్యము లని యీయుత్తరువు మనకు నొక్కిచెప్పుచున్నది.

పరిశ్రామికుడు ఉత్సాహముగలవాడుగా నుండుటయేగాక జనరంజకుడుగా కూడనుండవలయును. ప్రతిమనుజునకును ఇరుగుపొరుగువారలతోను తనతో పనిగలవారితోను సఖ్యముగానుండుట మంచిదే కాని వ్యాపారముచేయువానికిది మిక్కిలి యావశ్యకమైనది. ఇది లేనియెడల వ్యాపారమునకు భంగముకలిగించినవాడగును. ప్రతిపనికిని జనసన్మానము ఆవశ్యకము. అదిలేని పరిశ్రామికుడు క్రొత్తగావచ్చు పదార్థములలో దేనికిని అమ్మకము తేజాలడు. ఇందుకుదాహరణముగా నొక వృత్తాంతము చెప్పెదము. నాటకప్రపంచమునందు మంచి దిట్టమైన నాటకుడుండెను. ఇతడు రంగముమీద నుండునప్పుడు అత్యద్భుతముగ నటించువాడు కాని వెలుపలనుండునపుడు చాకచక్యములేక మూగవానివలె నుండుటచేత, ఇతడంత జనప్రియుడు కాడయ్యెను. "నాకు జనప్రియత్వము సంపాదించుకొను శక్తి లేదు. ఆ కారణముచేత నాటకపాత్రముల నిచ్చునపుడు మంచిపాత్రముల నితరులకిచ్చి నన్ను త్రోశివేయుచుందురు. మొదటినాటక రాత్రులందు నాకు స్నేహబృందము లేకపోవుటచేత నానటనకు అభినందించి చప్పట్లు కొట్టువారు లేరైరి. నాకు ఆప్తులగు విమర్శకులు లేకుండుటచేత వార్తాపత్రికలందు పొగడ్తొందనైతిని" అని ఇతడు చెప్పుచుండెను. "సర్ హెన్రి ఇర్వింగుగారి ప్రఖ్యాతి అతడు నాటకరంగముమీద చూపిన నైపుణ్యమువల్ల వచ్చినది కాదనియు అందుకు కారణము చూచువారియందనేకులు స్నేహితులుం

ంటయనియు" ఇతడు చెప్పుచుండెను. కాని ఇందతిశయోక్తి యుండినను జనప్రియత్వమును గురించి చేశిన రిమార్కులయం ప కొంత సత్యమున్నది. జనప్రియత్వమువల్ల నాటకు డేప్ర కారము మంచి పాత్రములను సంపాదించుకొనునో అదేవిధము గా వ్యాపారస్థుడుకూడ గ్రాహకుల సంపాదించుకొనును.

ప్రతివిషయమునందును ఎట్టి చిన్న వ్యాపారమునందైనను క్కచ్చిగా ఋజుమార్గముననే నడుచుట అత్యావశ్యకమని వేరు గా చెప్పవలెదు. ఋజుమార్గమున నడుచుట మంచిది (Honesty ; the best policy) అను సుభాషితమునందు ఋజుమార్గము Honesty) ఎక్కువ గౌరవస్థలమున నుంచబడినది. ఇది నిజము గాదు. వ్యాపారవిషయమునందుకూడ ఋజుమార్గమే మంచిపద్ధ యని చెప్పక తప్పదు. జనప్రియత్వముకంటె గురుత్వము esteem) ఎక్కువముఖ్యమైనది. ఏ తెలివితేటలుగల వ్యాపారస్థు ) నందరు గౌరవింతురో, ఎవనిమాటలు పథ్యముగా నామో ంతురో, నీచమునకెవడు లొంగడని జనులు నమ్మెదురో, అ ట్టివానికే బేరము బాగుగా తగులును. ఈ కాలమునందు వ్యాపారవిషయమున మోసమే యెక్కువ కనబడుచున్నది గాని న్యాయప్రవర్తన మంతగా లేదు. వ్యాపారపు కుయుక్తులు Tricks of the trade) మెండగుచున్నవి. మోసపుచ్చు ప్రయ త్నములు అధికము లైనవి కాన నిట్టికాలమునందు న్యాయప్ర ర్తనముగలవాడని పేరుపొందినవాడు ముందుకు వచ్చుటకు యెక్కువ ఆస్పదమున్నది.

మొదటి ప్రకరణమునందు వాణిజ్యమందలి దేశాభిమాన మునుగూర్చి ముచ్చటించితిమి. దీనివిషయమై మరియొక సంగతి

చెప్పవలశియున్నది. మనదేశపు కంపెనీలు యూరోపియనుల పేరుపెట్టుకొని ప్రకటనలు చేయుటయందు దేశాభిమానమే మియు కనపడదు. ఈ వాడుక నింద్యమైనదనియే చెప్పవలయును. ఇది మనదేశ పరిశ్రమలకు విరోధముగా పనిచేయును. మనదేశీయులు యూరోపియనుల పేరుపెట్టుకొనినయెడల యెక్కువ నమ్మకము కలుగునని తలచి ఈ కుయుక్తి కొడిగట్టుచున్నారు. ఎక్కడనో కొన్ని ఫరములు మాత్రము బాగుపడినవికాని సాధారణముగా నీకుయుక్తి పారుటలేదు. గుర్తుబల్లమీద 'మెకంజీ అండు కంపెనీ' అను పేరుండి గల్లా పెట్టివద్ద రామస్వామి కూర్చొని వ్యాపారముచేయుచుండుట మనదేశ వాణిజ్యమునకు హానికరముగాని సుకరముకాదు. ఫరములు బాగుపడుట దొంగపేరువల్ల కాదు. సరుకులు మంచివిగానుండుట వలననేయని యెరుగవలయును. తెలియనివారిమీద మోసము కొంతపనిచేసినను చేయవచ్చును గాని యూరోపియనుల పేరుండినమాత్రముననే వ్యాపారము నిలువజాలదు. జయప్రదముగా జరిగిన స్వదేశఫరములకు విదేశనామములుండుట చేత వారి జయము దేశమునకు లభించినదికాదు. ఏదియెట్లుండినను జయాపజయములమాట అటుండగా ఈ మోసకృత్యమువల్ల హైందవనామము మన వ్యాపారమునకు తగదని వెల్లడిచేసినట్లగుచున్నది. కాన ఇది మన దేశమునకు అపకీర్తికారణమగుచున్నది. ఇట్టి కుయుక్తులకు ఆత్మగౌరవముగల భారతీయుడెప్పటికిని ఆస్పదమియ్యకూడదు. మనదేశపు పరిశ్రామికులును వర్తకులును తమవిషయమునను తమ గ్రాహకుల విష

యమునను న్యాయప్రవర్తన గలవారైనయెడల మనదేశపు పేరు వినినంతనే ప్రపంచమునందంతటను అధికమైన నమ్మక ము కలిగించుకాలము తప్పకవచ్చును.

ఇంతటితో విరమింతము. "దేశపు పరిశ్రామికత్వము" మిక్కిలి గొప్పవిషయము. దీనినిగురించి పెద్ద యుద్గ్రంథములు వ్రాయవచ్చునుకాని మనదేశముయొక్క స్వభావసంపదాతిశయకారణముచేత దీనినిగురించి విస్తరించి వ్రాయుట యనావశ్యకము. అపరమితముగనుండు మనదేశ స్వభావసంపద అభివృద్ధినొందుననుట కేమియు సందేహములేదు. ఇప్పటికే కొందరు దేశీయులు దీని నభివృద్ధిచేయ నెత్నించుచున్నారనుట యొక సంతోష కారణము.

ఇట్టి స్వభావసంపద నభివృద్ధిచేయు మహాకార్యమునందు ప్రతిభారతీయుడును స్వయముగానో పరకీయముగానో పనిచేయవలయునని సలహానిచ్చుటయే ఈ చిన్న పుస్తకముయొక్క ముఖ్యోద్దేశము. బిరుదులువహించి దివ్యభవనమునందుండు రాజు మొదలు పూరియింటనుండు గ్రామతలారివరకును అందరుదేశ పరిశ్రామికాభివృద్ధియందు వారి వారికుచితమగు సాయముచేయవచ్చును. కావున ప్రతిభారతీయుడును తన దేశమాతకు తానేమిసాహాయ్యము చేయగలడో యని ప్రశ్నించుకొనవలయును. ఒక పరిశ్రమ క్రొత్తగస్థాపించిగాని ఉన్నదానిని అభివృద్ధిచేసిగాని దేశమాతకు సాయముచేయుట సర్వోత్తమము. ఇట్లుచేయుట ప్రతివానికిని సాధ్యముకాదు కాని ఇతరులచే నేర్పాటుచేయబడిన పరిశ్రమలయందు తనశక్తికి వంచనలేకుండ కొద్దిగనో గొప్పగనో భాగములు పుచ్చుకొనుట యుత్తమము.

ఇట్లనుటచేత నిరుపయోగముగా ధనమును దానముచేయుమని చెప్పుటలేదు. దీనివిషయమై ఒక కాసైనను ఊరకనియ్యనక్కరలేదు. తనకు లాభమునిచ్చి తనదేశసంపద లెక్కువచేయు కార్యములందు తన ధనములో కొంత పెట్టుబడి పెట్టుట ఎంతయో మేలుచేసినట్లగును. మనదేశము పూర్వము మంచిస్థితియందుండెననుట నిర్వివాదాంశము. ఇప్పుడు దీనదశయందుండుట విచారకరము. ఈ దీనదశకు కారణము మొత్తముమీద జనుల లోపమనియే చెప్పవలయును.

మన దేశమాతకిప్పుడు (ఇనుపదశ) పరిశ్రామికదశ పట్టినది. కాబట్టి ఈమె బిడ్డలమగు మనము కాలానుగుణ్యముగా ప్రవర్తింప నేర్చుకొని మన దేశమాతను ఉన్నతదశకు తెచ్చుచు ఆ యౌన్నత్యమునందు మనముకూడ భాగస్థులమగుట మనకును మన దేశమాతకును బ్రిటిష్ సామ్రాజ్యమునకును మిక్కిలి శ్రేయస్కరము. బ్రిటిష్ పరిపాలనకిది యొక ఘనగౌరవము.



## PRESS OPINIONS.

———o———

### దేశమాత. 27-11-1912.

రాజమహేంద్రవరము వీరేశలింగము పాఠశాలా ప్రధానోపాధ్యాయులగు మ. రా. శ్రీ. ముడియం సీతారామారావు పంతులుగారు తెనుగున సులభశైలితో నీ గ్రంథమును రచియించి మా కార్యస్థానమున కొక ప్రతి నంపిరి. ఈ గ్రంథము నే మామూలాగ్రముగ జదివితిమి. ఇందు భూమి స్థితిగతులు, గ్రహముల సంచార ప్రచారములు సూర్యచంద్రగ్రహణ కారణములు మొదలగు ననేక విషయములు విపులముగ సహేతుకముగ వ్రాయబడినవి. ప్రకృతి శాస్త్రము లన్నిటిలో భౌతిక భూగోళశాస్త్రము చదువుటకును వినుటకును మిక్కిలి యింపుగా నుండును. మనల భరియించుచున్న భూమియొక్కయు మనము పీల్చుచున్న గాలి యొక్కయు మనకు వెలుతురు నిచ్చుచున్న సూర్యచంద్రులయొక్కయు సకలజంతు జీవనాధారమైన వర్షముయొక్కయు తత్వముల నాను పూర్వికగ నెఱుంగుట మనుష్యునకు ప్రథమ కర్తవ్యము. ఈ విషయమై యట్టి నిశ్చలజ్ఞానము సంపాదించుటకై సీతారామారావుగారి పుస్తకము మిక్కిలి యుపయోగించుచున్నది. తెనుగువారందరు గ్రంథమును తప్పక చదువవలయును. జన్మమధ్యమం దెప్పుడు కని విని యెఱుంగని మహాద్భుతములు మన మీ గ్రంథమును చదువుట వలన గ్రహింపగలము. ఆయా పదార్థముల భిన్నస్థితుల తెలియజేయుటకై యిందు బొమ్మలు విశేషముగా జేర్పబడి యున్నవి. సర్వవిధములచేత నీ గ్రంథము మిక్కిలి యుపయోగకరమైనది. బాలక బాలికా పాఠశాలల యధికారు లీ గ్రంథమును ప్రతి ప్రాథమిక పాఠశాలయొక్క గ్రంథ భాండాగారమునందు నుండునట్లు చేయవలయుననియు బాఠశాలలలో జదువనివారు తీరికగ నున్నపుడే గ్రంథమును తప్పక చదువుకొని జ్ఞానమును సంపాదించుకొనవలసినదనియు సలహా నిచ్చుచున్నాము. దీనివెల అట్టబైండు రు 1-8-0 లు, కాలికో బైండు రు 1-12-0 లు.

### భౌతిక భూగోళము.

ఇదియును ముడియం సీతారామారావుగారి చేతనే రచియింపబడినది; చిన్న బిడ్డలకు భూగోళము నేర్పుటకై యిది మిక్కిలి యుపయోగకరమైన

పుస్తకము. ఇది ప్రతిపాఠశాలలో బఠనీయ గ్రంథముగ నుండునట్లు చేయుట సమంజసమని పాఠశాలాధికారుల హెచ్చరించుచున్నాము. దీనివెల 4 అణాలు. పాఠశాలలలోని ప్రధానోపాధ్యాయులు తమ విద్యార్థులచేత తప్పక చదివింతురేని లాభము కలుగును.

శ ని లే ఖ. *Friday, 17th May, 1912.*

బొమ్మల భూగోళము.

రాజమహేంద్రవరము వీరేశలింగము హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు మ. రా. రా. శ్రీ. ముడియం సీతారామారావు, బి. ఎ. ఎల్. టి. యీ చిన్న గ్రంథము వ్రాసి దీని రావుబహదర్ కందుకూరి వీరేశలింగం పంతులవారికి అంకిత మిచ్చిరి. పసిబాలురకు యీ శాస్త్రమును నేర్పుటలో మొదట వారి గ్రామము, పిదప తాలూకా, అటుపైని జిల్లా, పిమ్మట ఇండియా, తుదకు ప్రపంచముతో సంబంధించిన విషయములను నేర్పుటను వాడుక అయిన బాలుర కన్నులకు గోచరించని యితర ఖండములలో గల పదార్థముల విషయమును బొమ్మలు పటములు మొదలగు వాని సాహాయ్యమువల్లనే బోధ చేయవలసియుండును. కనుకనే సీతారామారావుగారు యీ గ్రంథమును ఈ రీతిగ రచించిరి. దీనిలో 28 మంచి బొమ్మలు గలవు: న్యూయార్కులో వీథి, గని యిల్లు, నీటిలోని యిల్లు, నది పుట్టుక స్థలము, ఒంటె, వోయసిస్సు, జాన్సీవద్ద యేనుగులుండు చోటు, ఎర్రఇండియనులు. అగ్నిపర్వతము, కైబర్ కనుమ, కొండమీద యినుపదారి, మొదలగు వాని దెలుపు బొమ్మలు గలవు. వీనితో సంబంధించిన సంగతులు బాలురకు సుబోధక మగునట్లు వ్రాయబడినవి. కనుక చిన్న పాఠశాలల బాలురకు యీ శాస్త్రమును నేర్పుటలో నీ పుస్తకము బాగుగ సహాయము చేయుననని నమ్ముచున్నాము. దీని ధర అణాలు ౬. రాజమంద్రిలో గ్రంథకర్తగారికి వ్రాసి దీని దెప్పించుకొనవచ్చును. బి. ఎ. పరీక్ష యిచ్చిన పండితులు యిట్టి మంచి పుస్తకములు వ్రాసి క్రింది తరగతుల బాలురకు, ఉపాధ్యాయులకు సహాయము చేయుచుండవలయునని కోరుచున్నాము.

# PRESS OPINIONS

———:x:———

## TELUGU GEOGRAPHY.

*Madras Mail*, 30-7-1913.

Mr. SitaramaRau of Rajahmundry, has added another volume to his interesting publications on Geography which have already become popular with school children. The latest book is entitled 'Regional Geography of the World' the first part of which is devoted to India. The treatment of the book is thoroughly interesting and rational. The first portion of the book gives an account of Physical Geography, in which he explains such phenomena as, tides, ocean currents, volcanoes, etc. There is a great deal of information compiled in this book not ordinarily met with in geographical publications in the vernacular. The author has digested in it several standard works on the subject of Physical Geography and has given in a small compass much valuable information. The Geography of India is thoroughly exhaustive and quite up to date. He has made use of the latest issue of the Imperial Gazetteer and the statistical report for census and other information. The book is replete with illustrations which however would have been made more attractive had they been better executed. The language of the book is claimed to be simple; a claim which is thoroughly justified. A special feature of the book is that at the end of every chapter are given a series of questions to test the knowledge of the students in the

ముగను జ్యోతిషసిద్ధాంతముల గూర్చి సవిస్తరముగ వ్రాసినమీదట నీ గ్రంథకర్త ఆ సిద్ధాంతముల మన హిందూదేశమున కనువర్తింపజేయుచు నిచ్చుట నే యేమార్పు లేకారణమున గలుగుచున్నవో తెలుపుటయెగాక, ఈ దేశమందలి యున్నతపర్వతములు, శిఖరములు, మహానదులు, గొప్ప మైదానములు, శీతభూములు మున్నగువాని చారిత్రమును, ఆయాదేశభాగముల నివసించు ప్రజలు, వారి పంటలు, పరిశ్రమలు, భాగ్యభోగ్యములు మున్నగు విషయములును పురాణేతిహాసయుక్తముగ హృదయానందకరముగ, చదువువారికి, వినువారికిగూడ నుత్సాహముబుట్టునట్లు వర్ణించెను. దీనిజదువుటవలన ప్రజల పీడించు కొన్ని మూఢవిశ్వాసములు నశించి ప్రపంచజ్ఞానము కలుగగలదు. ఈ గ్రంథము యింగ్లీషు భాషాగ్రంథ సహాయమున వ్రాయబడినది. సర్వజనమాదరణీయముగనీగ్రంథము ఆంధ్రమండలమందలి స్త్రీపురుషులెల్లరు పఠించదగినదనియు దొరతనమువారి యొక్కయు, తదితరులయొక్కయు పాఠశాలయందు పఠనీయగ్రంథముగ నుంచదగినదనియు మా నిశ్చితాభిప్రాయము. ఇది మంచి కాగితములమీద ఛాయాపటములతోగూడ ముద్రింపబడిన 206 పేజీలగ్రంథము. దీని వెల రు 1-8-0 లు. వలయువారు గ్రంథకర్తకు వ్రాసితెప్పించుకొనవచ్చును.

(దేశమాత.)

---

రాజమహేంద్రవరమునందలి వీరేశలింగము హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు మండియం సీతారామారావు, బి. ఏ. ఎల్. టి గారు ప్రపంచభూగోళమును రచియించి మూడుభాగములుగ ప్రచు[illegible] యుల వద్ద పా[illegible]. ఇట్టి గ్రంథమిదవరకు [illegible] ప్రచురింపబడ[illegible]. ఈ గ్రంథమునందు ప్రపంచమందుగల పట్టణములు, నదులు, [illegible] కాక సూర్యచంద్ర నక్షత్రములు, వాని [illegible]కలు, వాని భూమి [illegible] సంబంధములు [illegible] ప్రతిమలలో వేసి చూపుయున్నారు.

ఈ గ్రంథమునందు ఇంగ్లీషుభాషయందు ఉపయోగపరచబడిన సాంకేతిక ప[illegible] తెలుగు పదములు గల్పించి ఉపయోగించుటయేకాక చదువరుల [illegible] ప్రత్యేకపట్టికలుగ ప్రచురించిరి. ఆంధ్రభాషా

పుస్తకములో నానావిషయములను బోధించుటకు 22 మంచిప్రతిమలను ని మిడ్చియున్నారు. ఒకప్రతిమను జూచినంతమాత్రముననే విషయము అనాయాసముగ మనసుకెక్కును. ఇండియావిషయిక భూగోళ పుస్తకములను నెన్నింటినో చూచితిమి. ఈగ్రంథములో గల యిన్ని గొప్పయంశములు నే గ్రంథములోను జూచినటుల మాకు జ్ఞాపకములేదు. శ్రీరావుగారు భూగోళశాస్త్రమును బాగుగనభ్యసించి, యీగొప్పపాండిత్యము బాలురకు వినియోగపడుటకై యీగ్రంథమును వ్రాసి లోకోపకారులైరి. డిగ్రీపరీక్షలిచ్చినవారు, వారు నేర్చిన నవీనశాస్త్రరహస్యముల నీరీతిగ, దేశభాషలద్వారా మనప్రజలకు దెలుపుచుండవలయునని కోరుచున్నాము. యం. సీతారామరావుగారు రాజమండ్రిలో శ్రీ వీరేశలింగము పంతులుగారి హైస్కూలులో హెడ్ మాస్టరుగనుండి అపుడపుడు అవకాశము గలిగించుకొని యిట్టిగ్రంథముల వ్రాసి లోకోపకారులగుచుండుట కెంతయు సంతోషించితిమి. దీని ధర అణాలు 8. గ్రంథకర్తగారికి వ్రాసి దీని బడయవచ్చును.

(శశిరేఖ.

---

ఈ పురమందలి వీరేశలింగం హైస్కూలునందు ప్రధానోపాధ్యాయులగు మ. రా. శ్రీ ముడియం సీతారామారావుగారిచే వ్రాయబడిన ప్రపంచ భూగోళము మాకు చేరినది. ఇది ప్రథమమున ప్రపంచమంతకును సంబంధించిన అగ్నిపర్వతములు, సముద్రప్రవాహములు మొదలగువాని ఉత్పత్తిని గూర్చి వ్రాసి, సముద్రమునకు గలుగు పాటుపోటులు మొదలగువానికి కారణములు గూడ వివరింపబడినవి. ఇంతేకాక యిండియాలోని మత భాషా జన సంఖ్యలు నేకేశ్వరుపట్టికలమూలమున తెలుపబడినవి. మిగిలిన భాగములం గూర్చి వ్రాయుటకై యీగ్రంథకర్తగారి కెల్లరును ప్రోత్సాహము గావించెదరని నమ్ముచున్నాము. డి: వెల రు. 8-0. కావలసినవారు గ్రంథకర్తగారికి వ్రాసి తెప్పించుకొనవలెను. కొన్నికొన్నిచోట్ల సులభముగా గ్రాహ్యమగుటకు పటములుగూడ జేర్చబడినవి.

ఆంధ్రపత్రిక.

---

పై గ్రంథముయొక్క ప్రథమ భాగమును గూర్చి యిదివరకు వ్రాసియున్నాము. దానిమూడవ భాగముకూడ మా కార్యస్థానము నలంకరించినది. ఇది హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు మండియం సీతారామారావు బి. ఏ. ఎల్. టి. చే రచియింపబడినది. ఇందు అమెరికా ఆఫ్రికా ఆస్ట్రేలియా ఖండములనుగూర్చి విపులముగా వ్రాయబడినది. ఆయా ఖండములయొక్క సరిహద్దు పర్వత శీతోష్ణస్థితి మొదలైనవి చక్కగ వర్ణింపబడినవి. భౌతికవిషయములం గూర్చియు, వర్షపాతములు, సముద్రప్రవాహములు ఎక్కడెక్కడ యే యే రీతినుండెనో తెలిసికొనుటకీ గ్రంథము మిగుల యుపయోగకారియగునని నమ్మవచ్చును. ఏయే కాలములందు శీతోష్ణస్థితి యెట్లుండునో, యేప్రదేశములందు జనసంఖ్య యెట్లుండునో పటములమూలమున నిందు దెలుపబడినవి. ఆయా ఖండములందు విచిత్రవిచిత్ర వృక్షములు, జంతువులు మొదలగు వానిని గూర్చి కూడ యిందు వ్రాయబడినది. ఆ యా ఖండములం గూర్చి భౌతిక విషయములం జదువువారికి మిగుల లాభకారి యగుననుటకు సందియములేదు. విదేశ స్వదేశములం గూర్చిన సంగతులను దెలియగోరనివా రుండరు. ఇట్టిగ్రంథ మిదివరకు తెనుగున రచియింపబడినదని తలంచము. ఇట్టి మంచిగ్రంథమును రచియించినందుకు మా యాంధ్రులందఱును గ్రంథకర్తగారికి కృతజ్ఞులై యుండవలెనని నమ్ముచున్నారము. ఈ గ్రంథాదియందు మనచక్రవర్తి చక్రవర్తినుల పటములు కూడ చేర్పబడియున్నవి. దీనివెల రు. [illegible] లు. [illegible] గారికి వ్రాసిన బడయగలదు.

ఆంధ్రకేసరి.

---

రాజమహేంద్రవరం వీరేశలింగం హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు మ॥ రా॥ శ్రీ మండియం సీతారామారావు బి. ఏ. ఎల్. టి. గారిచే రచియింపబడిన పై గ్రంథముయొక్క రెండుమూడు భాగములు నవీనముగా బయలువెడలినవి. ఇందు మొదటిదానియందు ఆశియా, యూరోపాలనుగూర్చిన భౌతికవిషయములును, రెండవదానియందు అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియాలను గూర్చిన విషయానేకములును సమగ్రముగా వివరింపబడినవి. ప్రతిభాగమునందును, నాయా దేశములకు సంబంధించిన నదులు, పర్వతములు, వనములు

మ్ముటకు కాదు. మనదేశములో తయారైన వస్తువులు యెంత చౌకగాను, ఎంతమంచివిగాను ఉన్నవో ప్రజలకు చూపుటకే ప్రదర్శనము లేర్పాటుచేయబడినవి. ప్రదర్శనములకు అనేక పదార్థములు వచ్చునుకాని ప్రదర్శకుడు తక్కువ వెలకు పోవు వస్తువుల ప్రకటనమునే గమనించవలయును కాని కొన్ని వస్తువుల నెక్కువధరకు అమ్ముటకుమాత్రమే ప్రదర్శకులు రాకూడదు. ఈ విషయమును మరచిపోకూడదు. చూపరులలో ననేకులు కొనుటకు వచ్చిన వారుండరు. అందుచేత వస్తువులు నాణ్యమైనవనియు ధరలు సరసముగా నున్నవనియు చూపరులకు అభిప్రాయము కలుగునట్లు ప్రదర్శకులు జాగ్రత పుచ్చుకొనవలయును. (2) వింతవస్తువు లెవ్వియైన యుండెనేని వాటిమీద తగిన రిమార్కులు వ్రాయుట ప్రదర్శకులకు శ్రేయస్కరము. ఎట్లన 'అడవిపంట' (Forest produce) క్రింద నొక కఱ్ఱముక్క అగుపడెనేని దానినెవరును చూడరు. అటుగాక 'చుట్టుకొలత 25 అడుగులు 2 అంగుళములుగల చెట్టుయొక్క పటము' అని రిమార్కు ఉండినట్లయిన 'ఎంత పెద్దచెట్టని' యాశ్చర్యపడుచు గుంపులు గుంపులుగా చూచుటకు జనులు నిలుచుందురు. (3) ప్రదర్శకుడుకూడ జనులలోనుండి వారు చేయు రిమార్కులను వినుట మంచిది. ఒకొకసమయమున వారి రిమార్కులు సహించుట కష్టముగానుండిన నుండును కాని వారికి దురుద్దేశముండదు కనుక అట్టిమాటలను లక్ష్యముచేయుట యెంతవరకు న్యాయమో అంతవరకే గమనించవలయును.

(C) చూపరులు. వీరిలో చాలమందిని పాటించవలసిన నక్కరలేదు. 903 వ సంవత్సరమునందు మదరాసునందు జరిగిన ప్రదర్శన

*Ramachandra Series.*

# పరిశ్రామిక

# PARISRAMIKA HINDUDESAMU.

# హిందూదేశము.

M. SITARAMA RAU, B. A., L. T.

Ramachandra Series.

పరిశ్రామిక

# PARISRAMIKA HINDUDESAMU.

హిందూదేశము.

M. SITARAMA RAU, B. A., L. T.

Ramachandra Series.

7

పరిశ్రామిక

# PARISRAMIKA HINDUDESAMU.

హిందూదేశము.

M. SITARAMA RAU, B. A., L. T.

Ramachandra Series.

7

పరిశ్రామిక

# PARISRAMIKA HINDUDESAMU.

హిందూదేశము.

M. SITARAMA RAU, B. A., L. T.

Ramachandra Series.

పరిశ్రామిక

# PARISRAMIKA HINDUDESAMU.

హిందూదేశము.

M. SITARAMA RAU, B. A., L. T.

Ramachandra Series.

పరిశ్రామిక

# PARISRAMIKA HINDUDESAMU.

హిందూదేశము.

M. SITARAMA RAU, B. A., L. T.

మునకు పిచ్చివారి శరణాలయములోని వాడొకడు ఒక బ్రాహ్మణ బిచ్చగానియొక్కయు అతని భార్యయొక్కయు బొమ్మలు మనిషియెత్తున చేసి పంపెను. అదేమి చిత్రమోకాని గుంపులు గుంపులుగ విరగబడి జనులు దీనిని చూచుచుండిరి. ప్రత్తిగింజల యంత్రము చూచువారు లేకపోవచ్చును. మురికి నీటిని బాగుచేయు యంత్రమువద్ద నిలువక ముక్కు మూసికొనిపోవచ్చును, దివ్యమైన సాట్టుబండిని చూచి ఆనందించువారు లేకపోవచ్చును. కాని ఈ పిచ్చివాని ప్రదర్శితములవద్ద రాత్రి పగళ్ళు జనులు మూగుచుండిరి. ఇది చూడ చూపరుల రసజ్ఞత వేళాకోళములోకి దిగినట్టగుపడినది. అయినను ఈ ప్రదర్శనమందరికిని ఒక మంచి వస్తుపాఠమాయెను. ఏదియు కాబట్టక కేవలము తమాషా కొరకే విలువదుస్తులతో వచ్చిన స్త్రీలకుకూడ వారి గృహములు వదలి నిరాటంకముగా గుంపులవెంబడి తోసికొనిపోవుచు యెట్టని జరీపట్టుతాప్తాల నిగనిగలకును, రాజుల సాట్టుబండ్ల వైభవమునకును, ఇత్తడి దంతపుపనుల నాజూకునకును అచ్చెరువందుచు, పిచ్చివాని బొమ్మల కభినందించి ముచ్చటలాడుచు స్వేచ్ఛగా విహరించుట యెంతయు గొప్ప యనుభవముగా నుండెను. మన చదువరి పురికొల్పి పంపగా వెళ్ళిన గ్రామవాశి కేవల మిట్టిదానితో తృప్తిపొందకూడదు. తన యూడువాండ్ర వెంబడి ప్రదర్శనము నంతయు చుట్టుతిరిగి వారితో కలసి ఆనందింపవచ్చును కాని అంతటితో నిలువక వ్యవసాయ పరిశ్రామిక ప్రదర్శితముల నించుక శ్రద్ధతో పరీక్షచేసి తనజిల్లాయొక్క అభివృద్ధికి ఈ యంత్రము బాగుండునా? ఆయంత్రమ్ము బాగుండునా? ఈ పరిశ్రమతగినదా?